ప్రచురణ: ఫిబ్రవరి, 97

ప్రతులు: 800

ప్రకాశకులు:

**శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

కృతి కర్త:

**నేరెళ్ల శ్రీ రంగాచార్యులు,** వరకవి, అభినవభారవి

ముద్రణ:

**శ్రీరామ పవర్ ప్రెస్,**

**కంప్యూటరైజ్డ్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్, కోరుట్ల.**

టైప్ సెట్టింగ్:

**శ్రీరామ లేజర్ గ్రాఫిక్స్, కోరుట్ల.**

చిరునామా:

శ్రీ నిలయము, 1–3–392,

కుంటరోడు, మెటుపల్లి.

కరీంనగర్ జిల్లా.



ఓం శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః

# శ్రీ ఆళ్వారుల చరితము

## విషయ సూచిక

పుటసంఖ్య





కృతి భర్త

"THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTANAMS UNDER THEIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS"



శ్లో॥ శ్రీ మచ్ఛేషాంశ సంభూతం।
సీతానగర వాసినం
వేద విద్యాప్రదాతారం
తం వందే మమ జీయరుమ్

త్రిదండ మండిత కరం
శిఖోప వీత శోభినమ్
శ్వేత పద్మ విశాలాక్షం
జీయరుం శరణం వ్రజే॥



యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాఃపరశ్శతం।
విఘ్నం నిఘ్నంతి సతతం। విష్వక్సేనం తమాశ్రయే।



కృతికర్త

## శ్రీమాన్ నేరెళ్ళ శ్రీ రంగాచార్యులు

వరకవి, అభినవభారవి

వారి ధర్మపత్ని

## శ్రీమతి ల॥సౌ॥ హరిప్రేమ

MAHAMAHOPADHYAYA
**NOOKALA CHINNA SATYANARAYANA**
ASTHANA VIDWAN
Tirumala Tirupati Devasthanams,
Sri Kanchi Kamakoti Asthanam,
Sri Pitts'burg S.V. Devasthanam. USA
Member Expert Committee Music Academy Madras.

Sundarakripa
6-1-349/1, Padmarao Nagar,
Secunderabad-505 025.
© Resi: 821061.

Date: 19-07-1996

**ఓం శ్రీ**

ప్రియమిత్రులు, వరకవి, అభినవ భారవి, సంగీత సాహిత్య కోవిదుడు వినయశీలి, పరమనిష్ఠాగరిష్ఠుడు, పరమ భాగవతుడు శ్రీమాన్ శ్రీనేరెళ్ల శ్రీరంగాచార్యులు భక్తితో రచించిన "శ్రీ ఆళ్వారుల చరిత్రము" కూలంకషముగ చదివే భాగ్యమునాకు కలిగినది.

ఈ దివ్య సూరిచరితము నందు పన్నెండుగురు ఆళ్వారుల చరిత్రములు పద్యకావ్యముగా రచింపబడినవి.

ఈ పద్యకావ్యము, సరళముగ, పండిత పామర రంజకముగ, భక్తి ప్రచార ప్రధానముగ, రసవంతముగ కథాకథనము గంగా ప్రవాహమువలె అవిచ్ఛిన్నమైన ధారగా కొనసాగినది.

ఈ గ్రంథము ఆ చంద్రార్కముగా భక్త కోటి హృదయములందు ప్రకాశించు ననుటకు సందేహములేదు.

పరమార్థ చింత గలిగిన వారందరూ ఈ గ్రంథమును ఆదరించి తరింతురని ఆశించుచున్నాను.

ఆప్తులు శ్రీమాన్ శ్రీరంగాచార్యులవారికి నా అభినందనలు

భవదీయులు

**నూకల చిన్న సత్యనారాయణ**

Nada Sudharnava
Gankala Gandharva
Sangeetha Ksheera Sagara
Ganakala Propoorna
Sangeetha Vidya Sagara
Sangeetha Retnakara
Sangeetha Sarvabhouma
Lakshya Lakshana
Telugu Velugu



ఓం శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః

# స్వకీయము ముఖచిత్ర పరిచయము

శ్రీ హరియె సర్వముకు నాద్యుడు
సృష్టిస్థితిలయములకు మూలము
ప్రళయ మందును సర్వమును తన
నుదరమున దాచెన్. 1

సృష్టి జేసెడి సమయమవగా
పాలకడలిన పాపరేణిన్
పాన్పుగా శయనించి నాభీ
కమల గర్భంబున్. 2

కమల గర్భుని సృష్టి జేయగ
నతని ద్వారా సృష్టి యేర్పడ
నెవరు నేయే సమయములలో
శరణు వేడచునున్. 3

తనదు రక్షణ గోరువారో
ననుచు శ్రీభూనీళదేవుల
తోడ మాటాడుట సహింపక
యోగ నిద్రుండై. 4

భక్త జన సంరక్షదీక్షా
సక్తుడై పరమాత్ముయుండగ
స్వామి భావము గురు తెరింగియు
పరమ కుతుకము తో. 5

తదను సారమె శంఖ చక్రా
ద్యాయుధాళ్వెన్నంటి యుండగ,
పరమ పద నాథుండు జగమును
రక్షసేయుటకై. 6

పొయిగ, పూదత్, పేయ తిరుమొళి,
మధుర కవి శ్రీ పరాంకుశ, కుల
శేఖరులు, శ్రీ విష్ణు చిత్తులు
తొండరప్పొడులున్. 7

తిరుప్పాణ్పరకాల, యాండాళ్,
శేషులౌరామానుజులుమా
మనల బ్రోవగ హరియు బంపగ
నవతరించిరిలన్. 8

అట్టి వారల దివ్య చరితము
వ్రాయు భాగ్యము నాకొసంగియు
నాలొ వారై కరుణ జూపను
ధన్యుడను నైతిన్. 9

శ్రీనివాసుల స్మరణ జేసియు,
సూరి గణముల చరణ యుగముల
వ్రాలి వేడుచునుంటి దాసున్
కృపతొబ్రోచుటకై. 10

కోరినంతనె కూర్మి తోడుత
నార్థికముగా నండనిలచిన
దండి వేలుపు ఏడు కొండల
స్వామినె గొల్తున్. 11

సాయమునకును సాయపడిన
తిరుమలేశుని కార్యనిర్వా
హకులు, సంపాదకులు నధికా
ర్లందరకు సతమున్. 12

ప్రణతి శతముల జేయువాడను,
మెట్టుపల్లీ భక్తజనులకు
సర్వదానేకృతజ్ఞుండను,
సర్వులను సతమున్. 13

వేద వేద్యుడు శ్రీనివాసుడు
ఆయురారోగ్యములు, ఐశ్వ
ర్యముల నొసగుచు బ్రోచు గావుత
నవని సతతంబున్. 14

-ఓం తత్సత్-

ఇట్లు
భాగవత పాదపాంసువు, బుధజన విధేయుడు,
**నేరెళ్ళ శ్రీ రంగా చార్యులు,**
'వరకవి' అభినవభారవి'
శ్రీనిలయము 1-3-392, కుంటరోడు, మెటుపల్లి.

ఓమ్

శ్రీ హయగ్రీవాయనమహః

# ప్రాక్కథనము

"సుకవితా యద్యస్తిరాజ్యేనకిమ్" సుకవిత ముందర రాజ్యాలుధిక్. భోగభాగ్యాలు ధిక్. అనగా సుకవిత్వ మహాత్వము అద్వితీయ వైభవోపేతమనుటలో సందియము లేదు. కవి తన కవిత్వాన్ని చమత్కారంగా, సర్వజన మనోరంజకంగా సులలిత పదజాలములతో భావనా పటిమతో పాఠకుల కందించినప్పుడే అది సుకవిత యనదగును. అట్టి సుకవిత చెప్పినవాడే సుకవి. ఆసుకవి శ్రేణిలో చేర్చదగినవారు ఈ ఆళ్వారుల చరిత్ర కృతి కర్తయైన శ్రీమాన్ శ్రీరంగాచార్యుల వారు. పరమ భాగవతోత్తములు, సత్సంప్రదాయపరులు, నియమనిష్ఠాగరిష్ఠులు అయిన వీరు సహజమైన, నిష్కల్మమైన భక్తి ప్రపత్తులతో విష్ణుభక్తి పరాయణులు వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులు భక్తిమార్గ ప్రచారకులు, ముక్తిమార్గప్రదామయకులు, ఉభయ వేదాంత నిష్ణాతులు, పంచసంస్కార కరణ పరాయణులు, ఆచార్యులు, సిద్ధ పురుషులునైన ఆళ్వారుల చరిత్రను విద్వన్మణులకేకాక విద్యాగంధము లేని గ్రామీణ, పామర జనులకు కూడా సులభముగా అవగాహన యగునట్లు, ఆచార్యుల వైభవము, సూక్తులు హృదయమునందు చెరగని ముద్ర వేయునట్లు గేయకావ్య రూపములో "ఆళ్వారుల చరిత్రము" అను గేయకావ్యమును పాఠకలోకానికి అందించిన ప్రశంసనీయులు.

గురజాడ వెంకట అప్పారావు గారి ముత్యాల సరాల గేయరచనను ఆదర్శంగా తీసుకొని అదే స్ఫూర్తితో స్వచ్ఛ స్వచ్ఛంద ముక్తాహారము కూర్చి శ్రీనివాసుని సమలంకృతుని గావించి ఆతని పదపంకజములకు అంకితమిచ్చిన పరమభక్తాగ్రగణ్యులు. దానినే ఆంధ్రభాషా యోషగలమున నవ్యకాంతులీలునట్లు ఈ దివ్యభవ్య భరణములను ఆచంద్రతారార్కము విరాజిల్లునట్లు అలంకరింపజేసిన తెలుగుతల్లి ముద్దు బిడ్డ వీరు. సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన ఈ కావ్యములో పొయిగ, పూదత్త, పేయాళ్వార్లు, తిరుమలిశయాళ్వార్లు (భక్తిసారులు), కులశేఖరాళ్వార్లు, పేయాళ్వార్లు, శూడి కొడుత్త నాచ్చియార్, తొండరప్పొడియాళ్వార్లు, తిరుప్పాణాళ్వార్లు, తిరుమంగయాళ్వార్లు, నమ్మాళ్వార్లు, మధురకవియాళ్వార్లు, అను పండ్రెండు మంది యాళ్వారుల చరిత్రను సుమధుర రసరంజకంగా, భావస్ఫోరకంగా విశదపరిచారు. ఈ కావ్యలతాంత సుమనోహహర పరిమళ విశేషములను కొన్నింటిని స్థాలీ పులాక న్యాయముగా ఆస్వాదించెదము.

## విశేషాలు

అందరి కవులవలె ఫల శృతిని చివరకు చెప్పకుండా కావ్యారంభముననే "నాకవాహిని యందు క్రుంకిన, సకల తీర్థము స్నాన మాడిన, భూప్రదక్షిణ వల్ల కలిగిన పుణ్య ఫలమబ్బున్" అని చెప్పి పాఠకులకు కావ్యపఠనమునందాసక్తిని, అనురక్తిని పెంపొందించుటకు క్రొత్త పద్ధతిని అవలంబించినా రు.

అవసరమైన చోట జాతీయ రత్నాలను చొప్పించి, సొబగులను ప్రకాశింపజేసి అలంకారములను, పెట్టి, లోకోక్తుల, మహితోక్తుల, అభియుక్తోక్తుల శుక్తిముక్తాఫలముల హారము వేసి తగిన చోట సంఘ సంస్కరణ మను భూషణాలతో సర్వాభరణ భూషితముగా సర్వాంగ సుందరంగముగా ఈ కావ్యమును తీర్చిదిద్దారు.

## జాతీయాలు

తిరుమలిశయాళ్వారుల (భక్తి సారుల) చరిత్రలో భార్గవుని తపో భంగము చేయుటకు అమరులు అప్సరసలు బంప అప్సరసలు భయపడిరి. కాని కనకాంగియనెడి రమణి "నడుము బిగించెన్" అని చెప్పి, అకనకాంగియే భార్గవునిచే సౌఖ్యమనుభవించి గర్భిణియై పిండమును వెదురు పొదలో నుంచి "వచ్చినట్టి కార్యమంతయు వాకిటను నెరవేరె" యని జాతీయములతో తెలుగును గుబాళింపజేశారు.

## అలంకారములు

ఉపమాలంకారము తనదైన శైలిలో అలంకరించారు. కుల శేకరుల చరిత్రలో "ప్రాగ్దిశాంగననుదుటితిలకము వోలె రవిబింబమ్" అని, తిరుమంగయాళ్వారుల చరిత్రలో తిరుమంగయాళ్వారుల పెళ్ళిబృందము వారి నగలన్ని దోచి, వరుని నగలన్నియును దోచి కాలికి ఉన్న ఉంగరము ఎంతలాగినను రాకుండుటను "పవనసుతు వాలంబు నెత్తని పవన సుతువోలెన్" అని చెప్పి హనుమద్భక్తిని కూడా ప్రధర్శించారు.

## సూక్తులు-మహితోక్తులు

"అనువు గాని చోట అధికుల మనరాదు" అను వేమ సూక్తికి అదే తిరుమంగయాళ్వారుల చరిత్రలో " అనువు గానిచో నధికులమమే మనుట ధరలో పాడియుగునా పెద్ద కొండయు నద్ద మందున చిన్నదై యుండున్" అని భగవంతునికి భాగవతోత్తములకు తప్ప ఇతరులకు తలవంచనని తలంచు అతనిచే ఉంగరము ఎంత ప్రయత్నించిచనను రానందువల్ల భాగవత సమారాధనమే లక్ష్యము కనుక మార్గాంతరము లేకపై విధముగా పలికించారు.

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతుదైవతమ్" అను దానికి అనుసరణగా అదే తిరుమంగయాళ్వారుల చరిత్రలో" మంత్రములో "మంత్రముల కధీనుల మరులు బ్రాహ్మణాధీనంబుమంత్రము అట్టి బ్రాహ్మణులెల్లవేళల మాదు దైవముగా" అని బ్రాహ్మణ భాగవత నిష్ఠను ప్రదర్శించారు.

కుల శేఖరాళ్వారుల చరిత్రలో దుర్బలస్యబలంరాజా అను లోకోక్తిని "దుర్బలులకును బలమురాజే" అని అనుకరించారు. అదే కులశేఖర చరిత్రలో కులశేఖరుడు రామాయణము వినుచు భక్తి పారవశ్యముతో సీతనపహరించిన రావణునిపై యుద్ధానికి వెళ్ళుటకు సైన్యమును సిద్ధము చేసుకొని వెళ్ళి సముద్రమునందు గొంతుక పర్యంతము నీళ్ళలోనికి వెళ్ళగానే రాముడు ప్రత్యక్షమై రావద్దని మీపురానికి వెళ్లిపొమ్మని చెప్పచు "రావణుని సపుత్ర మిత్రస బాంధవంబుగ సంహరించి సీతనుంగొని తెచ్చినాడను ఇదిగో నీ తల్లి " అని సహృదయము ద్రవించునట్లు శరీరము పులకరించునట్లు సహజ శైలిలో చెప్పారు.

అదే చరిత్రలో భాగవతనిందను సహించని వాడై మంత్రులను సున్నితముగా మందలించిఆధునిక కుహనామంత్రులకు కనువిప్ప కల్గించునట్లు' ' భాగవతనిందయును పాపము. నింద జేతురె వందనీయుల ప్రభువులన్ పెడదారి కీడ్చెడి మంత్రి పుంగవులా" అని చక్కగా నొక్కి వక్కాణించారు. మరియు మంత్రుల కుతంత్రములను సహించక "రాజ్యమేలా? భోగమేలా? మానవుల సాంగత్యమేలా? రాజ్యపాలన నరక మార్గము నాకువలదంచున్" అని విరక్తి జెంది పుత్రునిపై రాజ్యభారము మోపి శ్రీరంగనాథుని సన్నిధికి పంపించి తరలింపజేశారు.

**సంఘసంస్కరణాభిలాష-** తిరుమలిశయాళ్వారుల చరిత్రలో వ్యాఘ్రపురములో ఒకానొక అరుగుపై బ్రాహ్మణోత్తములు వేదపఠనము చేయుచుండగా భక్తిసారునిగని బ్రాహ్మణోతరుడని పఠనము నాపిరి అతడు కొంతదూరము వెళ్లిన పిదప ఆపిన చోటును మరచిపోయి బాధ పడుచునుండగా అదివిని తిరిగివచ్చి ధాన్యపుగింజను చీల్చి చూపి" వ్రీహీణాంనఖ నిర్భిన్నమ్" అను వేదపాఠమును స్మరణకు తెచ్చుసందర్భములో శ్రీమాన్ ఆచార్యుల గారు కులమత భేదాలు నిరసిస్తూ "భక్తి కల్గినవారు బ్రాహ్మలు (బాపలు), భక్తి లేనిచో శూద్రులగుదురు భక్తులే భాగవతవిప్రులు కులపుతలపేలా? అని నిస్సంకోంచంగా చెప్పారు.

ఇంతే కాకుండా ఇలాంటివి ఇంకెన్నియో కలవు. గ్రంథవిస్తరభీతిచే సంక్షిప్తముగా గావించాను. ఈ కావ్యసుమమును అనుసమానముగా పరిమళింప జేసిన శ్రీమాన్ నేరెళ్ల శ్రీరంగాచార్యుల గారు ఇతోధికముగా పుంఖాను పుంఖములుగా ఇంకెన్నియో కావ్యరత్నాలను ప్రకాశింప జేసి పాఠక సహృదయాలోకానికి అందజేయాలని వారికి అటువంటి శక్తి సామర్థ్యాలను, ప్రతిభాపాటవాలను ప్రసాదించి ఆయురారోగ్యభోగభాగ్యములతో తులతూగుతున్నట్లు సుఖశాంతులతో సంతషించునట్లును ఆ శ్రీసీతారామ చంద్రా అజరామరమైన కీర్తి ప్రతిష్ఠలను కలుగజేయాలని ఆకాంక్షిచే విద్వద్విధేయుడు

**శేషం నరసింహాచార్య**
M.A.BEd.M.Phil,Ph.D.
తెలుగుపండితులు
జిల్లా ప్రధాన కార్యదర్శి-రాష్ట్రీయ ఉపాధ్యాయ పండిత పరిషత్తు
కరీంనగర్.



ఓం శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః

# శ్రీ ఉడయవరుల వర్ణనస్తుతి

శిరము శ్రీ శఠ గోప మౌనులు
నాథముని ముఖ మండలంబును
పుండరీకాక్షులును కన్నులు
రామ మిశ్రులునున్, 1

గండ స్థలమును, యామునార్యులు
వక్ష ముగ, శ్రీ పూర్ణ దేశికు
లరయ కంఠము, గోష్ఠి పూర్ణులు
బాహు ద్వయముగ శ్రీ 2

శైల పూర్ణులు, స్తనద్వయంబును,
కుక్షి శ్రీ తిరువరంగార్యుల్
వీపు శ్రీ తిరుమాలయాండాన్
(కటియు శ్రీ తిరుక్కచ్చినంబీ)
పిరుదు లెంబారుల్. 3

భట్ట వేదాంతులును (పిక్కలు) జంఘూల్
ఊరు యుగ్మంబులును నంబుళ్
కృష్ణ జానూయుగం, చరణాల్
పిళ్ళలోకార్యుల్. 4

అరయ తిరువాయ్ మొళి పిళ్ళై
పాదరేకయు, పాదుకలుమన
వాళ మాముని, సేన ముదలియు
మూర్ధ్వ పుండ్రములున్. 5

జందెములు కూరత్త ఆళ్వార్,
మొదలి యాండాన్ త్రిదండంబును,
వడగనంబులు కావి వస్త్రము
శ్రీ తిరుక్కురుగై. 6

ప్పిరాన్ పిళ్లాన్ మాలగా శ్రీ
విల్లిదాసర్ నీడగానవ,
నిట్లు శ్రీరామానుజాచా
ర్యులకు సూరులునున్. 7

అవయవా భూతులును నవగా,
నవయవులు, మాహాత్మ్యలును, నౌ
జగద్గురు శ్రీ భాష్యకారుల
తిరువడిని గొల్తున్. 8

నిత్య సూరులె మేను గా గల
ఎంబెరూ మావార్ల నెవ్వరు
భక్తితో ధ్యాన్నించి గొల్తురొ
వారలిహమందున్. 9

సర్వ కోర్కెల నను భవించీ
దివ్య కైంకర్యమున కేగుదు
రంత్య కాలము నందు శ్రీహరి
పరమ పదమునకున్. 10



# ఓం శ్రీలక్ష్మీ హయగ్రీవాయనమః

## శ్రీ ఆళ్వారుల చరితము



## అంకితము

### ఇష్టదేవతాస్తుతి

శ్రీయు భూనీళాసమేతుని
శ్రీవరాహ స్వామి రూపుని
శ్రీ కరుండౌ తిరుమలేశుని
శ్రీనివాసులకున్.

ద్రొక్కి నాళ్వారుల చరిత్రము
సూరి చరితము నా బరంగెడు
కావ్య ధృమమును నీ పదంబుల
నంకితంబిడితిన్.

శ్రీనివాసా చిద్విలాసా
శ్రీనిలయము నివాస భాసా
రంగదాసార్చిత విభాసా
అంకితం బిదిగో.

ధాత త్రాతయు భ్రాతవీవే
భావమంతయు నీవె గానా
భక్తితో నీ కావ్య సుతనీ
భార్యగా గొనుమీ.

దోసముల క్షమింపగానే
దోసిలొగ్గియు వేడుచుంటిని
దాస పోషణ కావ్యదోషా
ల్పరిహరింపగదే.



## ఓం శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః

## ఆచార్యస్తుతి

శ్రీ కరము నేరెళ్ళ వంశము
నందు శ్రీరంగమ్మ వరదా
చార్యులను మా మాతృపిత్రుల
చరణముల గొల్తున్.

రాజ్యసభలో మూడుప్రశ్నలు
వేసి విద్వజ్జన కొలాహలు
నోడజేసియు రాణిగారిచె
నాళవందారో.

అంచు పిలువగ బడియుమణకాళ్
నంబిచే విద్యాధనంబును
బొంది వైష్ణవ గురువులౌశ్రీ
యామునుల దలతున్.

ఎవరు ప్రతిదినమచ్చుతుని పద
పద్మయుగముల మదిని దలచుచు
నితర విషయము లన్ని తృణముగ
నెంచు వారెవరో.

లోక పూజ్యులునుడయ వరులును
జగద్గురు కరుణా సముద్రులు
శేషులౌ రామానుజులపద
పద్మముల్దలతున్.

తామ్ర పర్ణీతీర వాసులు
వడక్ తిరుమాళిహనివాసులు
శ్రీమదాత్రేయవేంకటావర
దార్యుగురుగొల్తున్.

కృష్ణవేణీ తట విరాజితు
ఆర్షవిద్యాలయ సుస్థాపితు
శీత నగరాశ్రమ విరాజితు
జీయరుం గొల్తున్.

గురువరేణ్యులు నూకలాబ్దిసు
ధాంశులౌ చిన సత్యనారా
యణులహృద్పద్మంబు నిలిపియు
నుతులనే జేతున్.

తిరుపతి లౌశ్రీ పెరియ జీయరు
తిరువడిని సద్భక్తి నిల్పియు
పరమ ప్రీతిని సేవ జేతును
భక్తి గదురంగన్.

తిరుమలలొ శ్రీ తిరుమలేశుని
తిరుపతిన గోవింద రాజుని
కోరి శ్రీ కోదండరాముని
కూర్మినే గొల్తున్.

మాత మా మంగమ్మ తల్లీ
తమ్మిరేకుల వంటి పదముల
వ్రాలి మదినను స్మరణ జేసియు
భక్తి సేవింతున్.

వ్యాస వాల్మీకులను కాళీ
దాస సంస్కృతీ కవివరేణ్యుల,
నన్నయను శ్రీ నాథ పోతన
కవులనే దలతున్.

పెద్దలందరు ముద్దుగుందన
పిన్నలందరు మిన్నబొగడగ
నాదుసమకాలీను లందరు
నౌరయను నటులన్.

వ్రాసి నాడను వాసిగానే
నజ్ఞులందరు ప్రాజ్ఞులవగా
విజ్ఞతతొ రస గ్రహన జేసిర
సజ్ఞు తెల్లరునూ.

గంధవహుడే విధము పుష్పను
గంధమును వహియించు నట్టుల
పండి తాళి గ్రహించు గావుత
భావ సారళ్యమ్.

కవులలో వరకవిని నేశ్రీ
రంగ దాసుండనెడి వాడను
ఆర్యులారా! దోసి లొగ్గితి
నాదరించండీ.

శ్రీ హరియు గృపనించ వ్రాసితి
మా హరియు దోడ్పడగ వ్రాసితి
కోరికయు నెరవేరె నేడే
జన్మ సార్థకమున్.

ఎన్నో విఘ్నము లెదురవంగను
రుగ్మతలు భయ భీతు జేయను
వేత్ర హస్తుల కరుణనునునా
విఘ్నముల్దొలగెన్.

ఆహయగ్రీవులును వాణీ
లిరువురును నా భావమందున
కలము నందున నిలిచి నడిపిరి
కావ్య కుసుమంబున్.

ఆళ్వ రాదుల దివ్య చరితమె
సూరిచరితం బనగ వ్రాసితి
నవ్య మౌముత్యాల సరముల
స్వామి కృపవలనన్.

ఆంధ్ర వాగ్దేవత గళంబున
నవ్య మౌముత్యాల సరముగ
వెలుగు నా చంద్రార్క మెప్పుడు
నవ్య కాంతులతోన్.

అల్పుడనునే నరయ నేరను
పంచకావ్యాద్యాది కావ్యాల్
అన్నిటను మానాయనమ్మల
తాత గారి కృపే.

కుండలము స్వాముల సహోదరి
లక్ష్మిదేవియె నాయనమ్మయు,
తాత గారలు వేంకటాద్రి
స్వామి తార్కికులున్.

పక్కలో పడుకుండ బెట్టుక
కథలు కథలుగా జెప్పినట్టీ
ఆళ్వారాదుల కథలు నాకును
నక్కరకు వచ్చెన్.

ఎన్ని జన్మల పుణ్య ఫలమో
మంగళా శాసనము మహిమో
శ్రీనివాసుల దివ్య శక్తియొ
నాచె వ్రాయించెన్.

శ్రీలచే చెలు వొందు గోదూర్
గ్రామమౌ మా జన్మ స్థలమున్
పాడి పంటల ప్రాభవంబును
అగ్రహారంబున్.

ప్రస్తుతము మెటుపల్లి నగరము
కరీంనగరము జిల్ల ఆంధ్ర,
ప్రదేశమునందుండి వెలుగును
మేటి పల్లియునై.

  

ఓం శ్రీ లక్ష్మీ హయగ్రీవాయనమః
శ్రీ మతే రామానుజాయ నమః

శ్రీనివాసుని చిత్తమందున
మాత అల్మేల్మంగ మదినను
సూత్రవతి నాథులను హృదినను
భక్తి పూజింతున్.

తల్లి దండ్రుల అడుగు దమ్ముల
గురువరేణ్యుల పాదపద్మము
చిన్న జీయరు దివ్య తిరువడి
కొరిగి నారచనన్.

మొదలు పెట్టితి ముందు గామన
సంప్రదాయము నుద్ధరించిన
ఆళ్వారాదుల దివ్యచరితము
భవ్య విషయంబున్.

నాకవాహిని యందు గ్రుంకిన
సకల తీర్థము తాన మాడిన
భూ ప్రదక్షణ కలుగ జేసిన
పుణ్యఫలమొదవున్.

విినగ వీనుల విందు నియ్యది
బాధ లన్నిట బాపు నియ్యది
పేద గొప్పను భేద భావము
విడుట ధర్మం బౌన్.

అనెడి ధర్మము ధరను చాటిన
పంచ సంస్కారంపు ఘనతను
వైష్ణవంబును విషదపరచిన
ఘనుల వివరింతున్.

పరమ పావని భారతావని
భగవదవ తారముల గనియును
నుత్తరంబున నుజ్వలంబుగ
నుత్తమంబవగన్.

గంగయమునా గండకీనది
సరయు మొదలగు నదుల గాంచెను
వింధ్య హిమగిరి మేరుగిరులచె
ఉన్నతిన్ గనియెన్.

ఉత్తరమునకు దీసి పోనని
దక్షణావని తలచెనోయన
తామ్ర పర్ణీ కృష్ణ పెన్నా
నదుల తాగాంచెన్.

పెరియపెరుమాల్ రంగ నాథుల
వాసమౌ శ్రీ రంగనగరము
వజ్ర కంఠిక భరతమాతకు
ముక్తి ధామంబౌ.

వామనుని పదపసిడి మంజీ
రంబుగా కావేరి యొప్పగ
సప్త ప్రాకారాంతరంబున
హరియు పవళించెన్.

పదియు రెండుల వజ్ర హారము
భారతావని కంఠహారము
ద్వాదశార్కుల భాసహారము
వైష్ణ వంబునకున్.

ధరణి నరులను దయతొ బ్రోవను
హరియు తలచియు సూరిగణముల
ఆళ్వరాదుల ఖ్యాతోడుత
నంపెనిద్ధరుకున్.





## ● పొయిగ, పూదత్త పేయాళ్వారులు ●

ఏక ఆత్మత గల్గి నట్టి
మొదట ఆళ్వార్లరయ ముర్వురు
పొయిగ, పూదత్, పేయఆళ్వార్,
ర్లనెడు పేరుందీ,

ఆర్షమున కాసారయోగీ
నామధేయులు పొయిగ ఆళ్వార్
ఆశ్వయుజశ్రవణంబు జననము
కాంచి పురమందున్.

కృతయుగంబున ప్రీతి తోడుత
అశ్వమేధము ధాత జేయగ
హరియు సంతసమంది నతనికి
దరిశనంబొసగన్.

'క' యను నా బ్రహ్మయునునపుడును
ఆదిదేవుని పాద కమలము
లధికభక్తిని సంచనంబును
సలువు కతనంబున్.

అరయ నారాయణుని చాలా
కాలమచ్చట నిలుచు కతమున
నాటనుండీ యప్పురంబును
కాంచి యనబరగెన్.

పొయిగ ఆళ్వార్లవతరించిరి
కాంచి పురి కాసార మందున
పసిడి తమ్మిన మిసిమిగొల్పెడు
పాంచ జన్యాంశన్.

కాంచి పురమున కలదు సామికి
శ్రీయథోక్తము కారి యాతడు,
తమిళముందున సరసు పొగై
పొగై యనబడియెన్.

అంత్య ఆదీ ప్రాస చేతను
గ్రంథమంతయు రచన జేసిరి
పసిడి కుసుమము తావి నొదవిన
కావ్య ద్రుమమయ్యెన్.

దేని యందున జన్మ మొదవిన
దాని పేరే స్థిరము ధరణిన
తజ్జ న్యత్వాత్ తద్వ్యపదేశను
ఆర్యసూక్త్యందీ.

సత్వ గుణమును సర్వ జనసం
సార తాపము నంతరించగ
చల్లనీ మాటలను నుడువిరి
సరో యోగీంద్రుల్.

మల్ల పురమున సంద్ర తటమున
జాజి పొదలో నవతరించిరి
విష్ణు కౌమోదకీయంశథ
నిష్ఠ నక్షత్రమ్.

మల్ల పురమే నేటి మైలా
పూరు చక్కటి పురముగనగా,
హరిని గనియును నాడి పాడిన
మధుర హృదయాళుళ్.

స్వప్నమందున శార్ఙ్ఞ పాణిని
గాంచి వ్రాసెను కమ్మనైనా
ద్రవిడ కవితా దండలల్లెను
వాణి తని వొందన్.

వీరిజన్మ ధనిష్ఠ శ్రీహరి
గదయు కౌమోదకియు తానే
సరో యోగిగ నుద్భవించెను
జనులు తరియింపన్.

మైలపురమున కొలను లతికా
ఎఱ్ఱ కలువను నవతరించిరి
నందకాంశము మహాయోగిగ
భూత యోగీంద్రుల్.

మహాయోగీ తమిళ నామము
పేయ ఆళ్వార్, భ్రాంతి యోగని,
పేయయనగా పిచ్చి భ్రాంతీ
భక్తి గల వాడున్.

శతభిషంబున మహా యోగియు
భూత లంబున ఖ్యాతి మీరను
అవతరించీ యక్కజంబుగ
పిచ్చి యనబడియెన్.

మువ్వు రాళ్వారాదులిచ్చట
అవతరించిన స్థలము కతమున
ఇదియు ప్రాచేతసః క్షేత్రం
బంచు పేరొందెన్.

ఈ ముదాలాళ్వార్లు మువ్వురు
సీత వోలెనయోని జులును
జన్మ సిద్ధపు గొప్ప భక్తులు
నొకరి నొకరెరుగర్.

సహజ భక్తీ యుక్తులైనను
ప్రకృతి సంబంధంబు గలిగీ
భూమి యందావిర్భవించియు
భక్తి నెరిగింపన్.

పంచ సంస్కారంబు జేయను
విష్ణు నా దేశంబు చేతను
ముగ్గురయ్యల ముందు నిడుకొని
జేసె చక్రాంతల్.

మంత్ర మంత్రార్థముల జెప్పియు
వైష్ణ వంబును బోధజేసీ
వేత్ర హస్తులు జేరబోయిరి
విష్ణు ధామంబున్.

ఏది తగునో, ఏది తగదో
ఏది కూడదొ ఏది బంధమొ
ఏది సంసారంపు బంధమొ
ఏది మార్గంబో.

బంధ మందును మోక్షమందును
జ్ఞాన మందా నంద మందును
ఆత్మ నారాయుణుని దాసీ
ఆత్మ లక్షణమౌ.

దాస భూతము ఆత్మనారా
యణున కిదియే లక్షణంబును
ఆత్మయనియెడు సొత్తైనకుపర
మాత్మ యధికారీ.

ఆకలీ దప్పికయు లేదు (కను)
భావ మందున భవ్య రూపుని
గుణ గనంబుల గుణతి జేయుచు
తిరుగుచుండంగన్.

ఏక విజ్ఞానేన సర్వము
జ్ఞాన మవగాహనము యగునను
వేద వేదాంతాది శాస్త్రము
చెప్పినటు వారల్.

హరినీ గూర్చి నెరుగుకతనన్
ఎరిగి నారలు సర్వ విషయము
ఒక్క చోటను నిలువ లేకను
తిరిగి రూరూరన్.

స్వామి మది సంకల్ప మొక్కటి
కలిగె నెద్దన, కలుషమణచను
దేహళీనగరంబు జేర్చెను (తిరుక్కోవలూర్)
ముగ్గురయ్యలనూ.

పొయిగ ఆళ్వార్ ముందు జేరెను,
కుంభ వృష్టియు గురియ సాగెను
బ్రాహ్మణోత్తము నింటి ముంగిట
కాలు మోపంగన్.

కుండ పోతగ కురియు వర్షము
ధార జూచియు ధరణి సురుడును
ఇంటి లోనినె నుండ, పడుకొన
స్థలము చాలంచున్.

విశ్రమించగభూతయోగీ
అరుగు దెంచియు పొయిగ ఆళ్వార్
నడిగె స్థలమును కొంత తనకును
స్వామి సరెయనియెన్.

వైష్ణ వోత్తము నిష్ట తోడుత
సేవ జేసెడి భాగ్య మొదవెను
అనుచు స్వామికి నాదరంబున
రండి రండని యెన్.

ఇంత లోపల భ్రాంతయోగీ
అచటి కరుదెంచడిగె చోటును
వారలిరువురు మురిసి పోవుచు
స్వాగతంబనిరీ.

ముప్వు రప్పుడు ఒకరికొకరును
వైష్ణ వోవైష్ణవము దృష్ట్వా
దండవత్ప్రణ మేద్ భువియన
ప్రణతులనుకొనిరీ.

అవ్విధంబున పరస్పరమును
వందనంబుల జేయునప్పుడు
వారి మధ్యన శంఖ చక్రా
ధ్యాయుధుండొదిగెన్.

ఒకరు పడుకొన చాలు చోటది
ఇరువురును కూర్చుండు చోటది
ముప్వురైనచొ నిలువ చోటది
ఎటుల సరిపోవున్.

భగవదారాధనకు నాలుగు
సముచితంబౌ స్థలము లనిరీ
అవియె తిరువేంగడము నందున్
స్వామి పవళించున్.

విన్న నగరంబునను విష్ణువు
కొలువు సేయును, శ్రీయధోక్తా
కారి నిల్చెను, తిరుక్కోయిలూర్
స్వామి తానడచున్.

ఆప్తకాముడు మహాత్ముండు
పవ్వళించీ ఆత్మ యందా
నందమును తానను భవించుసు
జ్ఞానులను జేయున్.

అనగ జ్ఞానం బంద గోరీ
శిష్యుడై నరుదెంచ గూర్చొని
ఆత్మనుపదేశంబు జేయగ
నిలువ బడియుండున్.

తన ప్రభోదము చేత జనులపు
నీతులను గావించు భక్తుడు
అట్టి వారల వెంట హరియ
దృశ్య రూపుండున్.

తులసి వనమును పద్మ వనమును
భక్త బృందము మధ్య యందును
సన్నిహితుడై స్వామి చేరసు
వాక్కు నిజమయ్యెన్.

ముప్వు రాళ్వార్లబ్బురంబుగ
జ్ఞాన దృష్టిని గాంచ గోరిరి
కాను పించని కమల నాభుని
గాంచ దీపంబున్.

భూమి ప్రమిదగ సంద్ర జలమును
నేతిగా తామపుడు మార్చి
సూర్యదేవుడు జ్యోతి గాగను
దివ్వె వెలిగించీ.

దివ్య కాంతిలో భవ్య రూపుని
లక్ష్మి వక్షము నందుసుండెడి
నీళ భూదేవులును గొలిచెడు
నవ్యయుని గాంచీ.

అటన ప్రాకృత దివ్య వైభవ
స్వామి సాక్షా త్కారముంగని
సుధా నిధిలో నోలలాడీ
ధన్యతను నొందీ.

ముప్వురయ్యాలు మునిగి తేలిరి,
భక్తి రసమున వారి నోటను
మూడు వందల ద్రవిడ పదములు
ముద్దుగా వెడలెన్.

మొదట పయ్యం దగళి యాయ్యని
రెండు అన్బేదగిళియాయ్యని
మూడు తిరువందాది పదములు
వృక్షు లక్షణమున్.

నరుల నందర దరికి దీసీ
జ్ఞాన కళికను వెలుగ జేసీ
లోకమునకుప కారు లైనా
దేశి కోత్తములున్.

పొయిగ పూదత్ పేయ యాళ్వార్
ముగ్గురయ్యల పుణ్య చరితము
స్మరణ జేసెడి వారి సతమును
హరియు కరుణించున్.

* శ్రీ పొయిగ పూదత్త, పేయ *
ఆళ్వార్ల దివ్య తిరువడి గళే
శరణమ్.



**శ్రీ తిరుమళిశై యాళ్వారులు**

శ్లో॥ శక్తి పంచమయ విగ్రహాత్మనే
శుక్తి కారజిత చిత్త హారిణే
ముక్తి దాయక మురారి పాదయోః
భక్తిసారమునయే నమోనమః

నాటి కాలము నందు పౌల
స్త్యాది బ్రహ్మర్షాది మునులును
బ్రహ్మ సన్నిధి కేగి మ్రొక్కుచు
రడిగి రిబ్బంగిన్.

ఓపితామహ నుర్వియందుమ
హోత్త మంబగు క్షేత్రమేదో
తెలియజేసిన నందు తపమును
మేము సల్పెదమూ.

అనగ బ్రహ్మయు విశ్వకర్మతో
మహీసారం బనెడు క్షేత్రము, (స్థలమును)
భూమినొకతుల నుంచి తూచిన
తేలిపోవనియెన్.

విశ్వమంతయు వీగి పోయెను
మహీసారమె భారమయ్యెను
దాని కొదవిన తమిళనామమె
శ్రీ తిరుమ్మళి శై.

బ్రహ్మ ఆజ్ఞచె బ్రహ్మ ఋషులును
తపమునన్హరి కృపను బొందగ
భార్గవుండను బ్రహ్మఋషియట
దీర్ఘ సత్రంబున్.

జేయసంకల్పించి శ్రీహరి
పూజ జేయను తపముమొదలిడ
ఉగ్రమగు నా తపము గనియును
భీత చిత్తులునై.

రూప లావణ్యముల గల్గిన
అప్సరసలను అమరులంపిరి
భార్గవుగ్ర తపంబు జెరపను
భామలుంజనియున్.

భార్గవుంగని భయము తోడుత
అప్సరసలును అరిగి రామడ,
కాని కనకాంగనెడి రమణియు
నడుము బిగియించెన్.

విశ్వ మోహిని ఆమె జూడగ
విశ్వ మోహను కృష్ణమురళీ
రవళి మాధురి గాన మాధురి
నాట పాటుల చేన్.

అంగ అంగ ప్రదర్శనంబున
మోహవార్ధిన ముంచె నతనిని
మోహవశుడగు భార్గవుండును
పొందెసౌఖ్యములన్.

ఇదియె జూడగ విష్ణుమాయయె
ఏరికైనను దురతి క్రమమౌ
విధిని దాటగ విధికి తరమా?
అనగ నపుడయ్యెన్.

ఫలితముగ నాపడతి గర్భిణి
యయ్యు గర్భము పతనమవగను
పిండమును కనకాంగి గనియును
వెదురు పొదనుంచెన్.

వచ్చినట్టి కార్యమంతయు
వాకిటను నెరవేరె యనగను
అప్సరసయును నతిగ పొంగుచు
నరిగె నాకపురీన్.

భార్గవుండపుడమిత బాధతో
తపము చెడెనని తనలో కుములుచు
సిగ్గుపడియును చేరె మరియొక
వనము తపమునకున్.

పిండ మప్పుడు పెరిగె ధరణీ
మాత యొడిలో ఎంతో వింతగ
గ్రుడ్డు నుండీ పక్షివిధమున
వెడలి రోదించెన్.

బాల రోదన ధ్వనులు నడవిన
ఎవరు విందురు, ఎవరు కందురు,
బాలు గాచును భక్త వత్సలు
భవ్య కృపయొండేన్.

కావె యాబాలుండు కాంచన
చేలు సంకల్పంబు చేతను
దర్శ నుండే ధరను కావగ
దాల్చె నీరూపున్.

ఆనృసింవుండడవి యందున
రక్ష సేయును యనిన విధమున
మంగవల్లీ నాథుడే యటు
బాలు రక్షించేన్.

నారసింహుడె మంగవల్లీ
నాథుడనియెడు నామ ధారీ
మహీసారము నందు భక్తుల
బ్రోవ తావెలసెన్.

జనన కాలము నందె బాలుడు
దివ్య మంగళ విగ్రహాంగని
ఆకలీ దప్పులునులేకను
హాయిగా నుండెన్.

ఆహ! ఎంతటి భాగ్య శాలో
స్వామి సేవయె తృప్తి అమృతం(సుధయా)
ఇతరులకు నిది దుర్ల భంబౌ
ఎంత భాగ్యంబో.

విభవ వత్సర పుష్య కృష్ణా
పక్ష దశమిన మఖా నక్ష
త్రంబు నందుతులాల గనము
గురుని వాసరమున్.

దివ్య బాలుని జన్మదినమిది
పుటుక తోడనె పూజ్యుడాతడు,
ప్రకృతి మాతా పసిడి యొడిలో
వింతగా పెరిగెన్.

ఒక్క నాడూ ఖడు డనియెడు
వెదురు గోసెడు వాడు అడవికి
వచ్చి వెదురును గోయుచున్నట
బాలు నింగాంచీ.

దివ్య తేజము తోడ వెలుగుచు
సున్న బాలుని గనియె ఖడ్గుడు
సంత సంబున బాలు నెత్తుక
నింటికింజనియున్.

భార్య, పంకజ వల్లి బిలిచీ
బాలు నొసగగ, పాలు చేపెను,
సంతు లేదని కుములు నామెయు
సంతసంబొందెన్.

జనన కాలము నందె శ్రీహరి
అనుభవంబను అమృత పానుడు
తల్లి పంకజవల్లి యిచ్చెడు (నొసగెడు)
స్తన్యముంగొనకన్.

మలము మూత్ర విసర్జనంబులు
నిద్ర ఆహారంబు లేకను
రోదనంబును మాట పలుకుల
మానెమౌనమునన్.

శూద్రడొక్కరుడిట్టి బాలుని
వింత కథలను ఎంతొ వినియును
చక్కగాచిన చిక్కపాలను
మక్కువం గొనియున్.

ఖడ్గ నింటను గాంచె బాలుని
దివ్య తేజము తేజరిల్లుచు
దివ్య వర్చస్సున్న వానిని
గాంచె వింతగనూ.

తాను దెచ్చిన పాలు గ్రోలగ
వృద్ధుడెంతయొ వేడుకొనగను
అతిముదంబున భక్తి సారులు
క్షీరముంగ్రోలెన్.

నాడు మొదలుగ వృద్ధ దంపతు
లింపు మీరను పాలు నొసగను
కరుణతో తాక్షీర పానము
జేసె దిన దినమున్.

వృద్ధ జంటకు సంతులేదని
వారి భావము భక్తి సారులు
ఎరిగి త్రాగిన దుగ్ధ మొసగుచు
నిటుల వచియించెన్.

పుణ్య దంపతులార మీరలు
నేనొసంగెడు ప్రాలు ద్రావిన
పనస పండటు వంటి పాపడు
మీకు జన్మించున్.

భక్తి సారుల మాట నమ్మియు
పాలు గ్రోలగ వారలప్పుడె
వార్ధ కత్వము దొలగ నెంతో
యౌవనులైరీ.

అపుడు వారలనంత భోగము
లనుభవించగ వారి కడుపున
పుత్రుడొదవ కణీ కృష్ణం
డనెడి పేరిడిరీ.

నీరు ఆహారంబు లేకియె
భక్తి సారులు పెరిగి పెద్దవ
వృద్ధ దంపతులతనిగొల్చిరి
విష్ణు సముడంచున్.

ఖడ్గ వృత్తియు బుట్టలల్లుట
తండ్రి వృత్తినె తాను జేయుచు
తనదు మహిమను మరగు పరచెను
కొంత కాలంబున్.

తీర్థ యాత్రలు తిరుగ సాగగ
మనసు ప్రాణాయామ ధ్యానా
ధారణా ద్యష్టాంగ యోగము
లందు మగ్నమవన్.

తలచె నిట్లష్టాంగ యోగము
లందు లగ్నం బయ్యె మానస
మందు ధ్యాన్నము ఏది ముందో
ఎరుగలేనైతిన్.

సృష్టి కంతకు కారణంబౌ
వస్తువునుధ్యాన్నింపమందురు
ఏది యదియో ఎట్టులుండునొ
తెలియలేకుంటిన్.

లోకమందున పెక్కు సిద్ధాం
తములు గలవవ లోకనంబును
జేయవలెనని తలచి నన్నిట
తాను పఠియించే.

అక్షపాదా శాక్య పాతం
జలుఉలూక్యక్యక్ష పదములు
వేద బాహ్యములని ఎరింగెను
కొంత కాలంబున్.

న్యాయ, మాయా, వాద వైశే
షికము లరయను సారహీనము
లంచు దలచియు శైవమతమున
దీక్ష వహియించెన్.

శివుడె పరతత్వం బటంచును
శివ పరంబుగ పెక్కు ద్రావిడ
గ్రంధములరచియించి శివవా
క్యునిగ పేరొందే.

వేయి వర్షములపుడు గడచెను
శివ మతంబే సర్వశ్రేష్టము
అన్ని మతములు తృణసమానమ
టంచు తాదలచీ.

ఇతర మతముల వారి జూడక
పలుకరింపక తిరుగ సాగగ
పేయ ఆళ్వార్లదియు వినియును
అచటి కరుదెంచెన్.

అతని ఎదుటను నతడు నిలచెను (నిలచె నప్పుడు)
ద్వాద శోర్ధ్వా పుండ్రములతో
ఇరుభుజంబుల శంఖ చక్రా
లాంచ నాల్గల్గీ.

కంఠ మందున తులసి మాలలు
సూర్య తేజొవి రాజితుండై
పేయ ఆళ్వార్ శైవునెదుటను
మెరియుచున్నిలువన్.

వారి శివ వాక్యుండు జూచియు
పలుకరింపక మనసు రాకను
విముఖుడై జనెలోని కప్పుడు
జ్ఞాన హీనుండై.

అతని మార్చగ మాటలాడగ
నింటి కెదురుగ నున్న తోటను
త్రవ్వి గుంటలు, పాతె మొక్కల
క్రింధు మీదవగాన్.

చిల్లి కుండతొ నీరుబోయగ
శైవుడౌశివ వాక్యు డిట్లనె
పిచ్చివాడవ ఏమి పనియిది
చెట్లు చివురించా?

పిచ్చి నీవే నేను గాదూ
నీ విధంబే జేసి యుంటిని
రంగుటద్దాల్దాల్చి జాచిన
రంగె కాన్పించున్.

మహా యోగీ అటుల బలుకగ
పిచ్చి వాడను నౌదు నెట్లు
ముందు వెనుకల నరయవలదా
మాటలాడంగన్.

పిచ్చివారలు జేయు పనియిది
చెట్ల తలక్రిందులుగ నాటుట
ముందు చేతి కంకణంబుకు
అద్దమేలొ క్కో.

జగత్కారణ మైన వస్తువు
ఏదొ తెలియక జ్ఞాన హీనత
మోహితుడవై తిరుగుచుంటివి
భ్రమకు లోబడియున్.

తత్వ మెరిగిన తత్వ విదుడను
స్థిత ప్రజ్ఞుడ జ్ఞాన యోగిని
నేన పిచ్చి, నీవ పిచ్చి
నీవె చింతించూ.

మహాయోగీ మాటలనువిని
మహామేధావైన శైవుడు
తత్వ మెరుగ మహదాహ్వాయుని
గాంచి యిట్లనియెన్!

నీవు నిజతత్వం బెరుంగుదె
నేను అజ్ఞానమున నుంటిన
రూఢిగా నీవెట్లు జెప్పెదు
నేనె తత్వజ్ఞున్.

ఎటుల యనగా బ్రహ్మ విష్ణువు
ఇంద్రుడాదిగ దేవగణముల
వందనంబుల నందు కొనుపర
మేశుడేవినుమా!

వ్యాసవాల్మీకాది మునులుప
రాత్పరుండా శివుడు సృష్టికి
కారణంబగు వస్తు వనుచును
వేదముల్ నుడివెన్.

వేద వేదాంతములు ప్రతి పా
దించి యుండిన సత్యమియ్యది
జ్ఞాన శూన్యుడవైన నీకిది
ఎటుల గాన్పించున్.

అనగ ఆమహయోగి నగు చనె
సత్యమును బహులెన్స బలికితె
పుట్టు కలులే నట్టిదేకద
జగత్కారణమున్.

పండి తాగ్రణీ! వేద మందుపు
రాణ వేదాంతాది స్మృతులలో
శివుని పుట్టుకయు ఉన్నదంచును
చెప్ప బడియుండెన్.

విష్ణువే శివునెన్నో మారులు
రక్షజేసిన విధము గలదు
నీదు హితమును గోరి జెప్పెద
మూడు మాటలలోన్.

దేవతలలో శివుడు, బ్రహ్మ
విష్ణువరయను ముఖ్యలుంగద
శివుడు తామస గుణుడు, బ్రహ్మయు
రజోగుణుడరయన్.

శుద్ధ మైనా సత్వ గుణుడా
విష్ణు మూర్తియే మోక్షమిచ్చును
సూక్ష్మ బుద్ధితో విచారించిన
నీకె అవగతమౌ.

ఒకడు పాదము చాచ, మరియొక
డట్టి పాదము కడిగె భక్తమ
రొక్కడా శ్రీ పాద తీర్థము
శిరము నందాల్చెన్.

అట్టి మువ్వుర లోన నెవ్వడొ
గొప్పవాడో నిశిత బుద్ధిని
గనుము ఆకారములు వారివి
అవగతంబగునూ.

ఎటుల నందున నీవె గనుమా
భస్మ పూతలు, వ్యాఘ్రవస్త్రము
పునుక దండరుద్రాక్షమాలలు
శివుడు ధరియించున్,

స్రుక్కు స్రువయుల అక్షమాలను
జలక మండల దండముల్గొని
రంగ ధాముని మదిన గొల్చును
కమల గర్భుండున్.

ఇటుల నిరువురు తమకు పైపర
తత్వ ముందని ఎరిగి తపమున
తమకు తీరని కోర్కెలాతడె
తీర్చటంచెంచన్.

విష్ణు వందువ రెండు ప్రక్కల
దివ్య మహిషీ వర్గముండగ
వక్ష మందున లక్ష్మి యుండగ
శేషు పైనుండున్.

దివ్య చందన చర్చి తాంగుడు
వజ్ర మయ ఆభరణ భూషితు
డార్తి కల్చుడు ఆదిదేవుడు
అరయ విష్ణుండే.

పొలసు దిండ్లతొ పొదలు చిక్కుల
శ్రీహరియె తొలంగించె వినవే
శాస్త్ర సమ్మత వాదముల్నివి
బుద్ధి గనుమయ్యా.

సర్వ శాస్త్రార్థరచి చూడగ
మాటి మాటికి విచారింపగ
తేలె సారము హరియె పరత
త్వంబు నిజమనగన్.

విష్ణువేమోక్షాధికారీ
అతని ధ్యాన్నమె అనుసరీయము
అనుచు ఆమహయోగి బహుప్ర
మాణముల్ జూపన్.

ఆశివావాక్యండుముదమున
పేయ ఆళ్వార్ శిష్యుడవగను
పంచ సంస్కారంబు జేసీ
వైష్ణవంబొసగెన్.

అన్య ధాజ్ఞానంబు అజ్ఞా
నంబు విపరీతంబు జ్ఞానము
లన్ని వదలియు హరిని గూర్చియు
నంత తానెరిగెన్.

భక్తి సారులు మహా యోగికి
శిష్య పుంగవులయ్యు గురువుల
బాగుగా పూజించి కొలువగ
బహుముదంబందీ.

తనదు పని నెరవేనంచును
సంత సంబున తీర్థయాత్రకు
ఉత్తరంబుగ వెడలె భూసురు
డుత్త మోత్తముడున్.

హృదయమున నష్టాంగ యోగము
ద్వార నారాయణుని దర్శన
భాగ్య ముంగనె భాగ్య శాలీ
భక్తిసారుండూ.

హరి కృపాపాత్రుండు తానయి
అరి భయంకరమైన చక్రము
రక్షగా తననంటి యుండగ
విష్ణు వుంగొల్వన్.

ఒక్క నాడాతండు కైరవి
ణీనదీ తీరమున నొక్కచో
ఒంటిగా గూర్చుండి స్వామిగు
ణానుభవపరుడై.

యుండ గంగాధరుడు శూలము
దాల్చి పార్వతి సహితముగ గగ
నంబునందున వెల్గుచుంజనె
నంది వాహనుడై.

పరమ వైదికుడైన నాతడు
నాకసంబున నరుగు శివునీ
నీడ మీదను పడగ దగదని
బొంత గప్పుకొనీ.

ఇంటి చూరున నిల్వ నప్పుడు
పార్వతీ పరమేశ్వరుల్గని
అబ్బు రంబుగ నాగి జూడగ
పార్వతిట్లనియెన్.

బొంత దాల్చిన వారు ఎవ్వరు
అతని జూడగ కుతుక మొదవెను
వింత చైదం బితనిదింగన
నాత డెవ్వడనన్.

అపుడు గరకంఠుండు నిట్లనె
విష్ణు భక్తాగ్రేసరుండు
పరమ వైష్ణవునకును మనతో
పనియు లేదనియెన్.

ఐన పార్వతి పట్టు బట్టగ
శివుడు భూలోకమున నాతని
కెదురు నిల్వగ, కనుల నెత్తి
గాంచ డాతండున్.

నేను దేవత లోనముఖ్యుడ
అంత వాడను చెంత నిల్వగ
సుంత యైనను జూడవేమిది
నీవు యోగ్యుడవే.

ఎంతొ దుర్లభమైన  నాదగు
దర్శనంబును గనగ జేసితి
కోర్కెలెల్లెయు కోరి దీర్చెద
కోరు మని నుడువన్.

అనగ శివునితొ భక్తి సారులు
బొంత కుట్టే సూది ద్వారా
దార ముంజను వరమునీయుమ
టంచు తాగోరెన్.

అంత ఫాలా క్షాండు నలిగీ
నుదుట కంటిని దెరచు నంతలొ
అగ్ని జ్వాలా మాల లెగసెను
భక్తి సారులపై.

తనను భసుమము జేయవచ్చెడు
ఫాల నేత్రుని కంటి మంటల
జూచి బెదరక చక్రరాజ్యము
నతనిపైనంపెన్.

దాని నుండీ ఎగసి పడెప్రళ
యాంత మందలి ద్వాదశార్కుల
జ్వాలకెనయౌ జ్వలిత జ్వాలల
లాట నేత్రునిపైన్.

పుష్ప కావర్తకములనియెడు
మేఘముల బిలిపించెహరుడు
ఘోరునన్వర్ళంబుగురిసెను
అగ్నిచల్లారెన్.

మేరు నగసమధీరుడైనట
ధ్యానమగ్నుండైనవైష్ణవు
జూచియా ముక్కంటి నెంతో
పొంగు చిట్లనియెన్.

ఓయి భక్తీ సార నీవిక
భక్తి సారుండ నెడు బిరుదుతో
చంద్ర తారార్కంబు భువినన్
ఖ్యాతి గనుమయ్యా!

అనుచు శివుడా అంబనుంగని
కాంత కాంతే వైష్ణవులనున్
అంబరీషుని వలన దుర్వా
సుండు తానోడెన్.

నేడు నేనీ తనికి నోడితి
నిష్ఠ గల్గిన విష్ణు భక్తుల
జోలికేగిన కలుగు చిక్కుల
టంచు శివుడేగెన్.

మహీసారమె తమిళ మందున
తిరుమళీ శైయనగ బడియెను
అందుచే నాతండు తిరుమళి
శైయ ఆళ్వారుల్.

శుక్తి హారుండనెడి సిద్ధుడు
వ్యాఘ్ర వాహన మెక్కి నింగిన
స్వేచ్ఛగా జను చుండ క్రిందను
భక్తిసారుండున్.

తపము జేయుచునుండ నాతని
తపోశక్తియు మింటి నంటగ
శుక్తి హారుని వ్యాఘ్ర రాజము
దాటలేకుండెన్.

క్రిందుగా నాసిద్ధుడుంగని
విష్ణు భక్తుని వింత గాగని
దివ్యయోగపు తేజముంగని
అబ్బురంబంచున్.

ఓయి! ఇంతటి గొప్పవాడికి
బొంత ఏలను పొందుమిదిగో
దివ్య కవచంబొకట నిత్తును
వజ్ర నిర్మితమౌ.

కవచ మిత్తన మహిమ తొడుత
మణులచేనిర్మింపబడిన
కవచమును కల్పించి జూపగ
సూర్యతేజంబున్.

వెలుగు చుండగ వెరగు పడి తన
కంఠ మందలి మణుల మాలను
జపము మాలగ గొనగ వేడిన
శక్తి హారునకున్.

అక్షమాలను అక్క జంబుగ
మణుల మాలగ మార్చి జూపగ
శక్తి హారుడు సిగ్గు పడి తన
వాఘ్రు మెక్కి చనెన్.

భక్తి సారుల మహిమ విని కొం
కణపు సిద్ధుండనెడి వాడును
గుళిక నొకదాన్నొసగె స్వామికి
స్వర్ణ మొనరించున్.

ఇనుము దాకిన స్వర్ణమగునన
ఒడలి మన్నును గొంత దీసియు
గుళిక గాతా మార్చియిచ్చెను
సిద్ధ పురుషునకున్.

నీది నినుమును జేయు బంగరు,
నాదిమట్టిని జేయు బంగరు
ననగ సిద్ధుడు పర్వతమునకు
దాని తగిలించన్.

భక్తిసారుల మేని మట్టీ
స్పర్శ కతమున పర్వతంబపు
డయ్యెబంగరు కొండ గాగని
సిద్ధుడుంజనియెన్.

కొంత కాలము గడచి నంతట
మొదలు ఆళ్వార్లరయ ముువ్వురు
భక్తి సారులు దైవి కంబుగ
గలిసిరొక చోటన్.

ఇవ్విధంబున పరస్పరమును
గౌరవించుక నలుగురునునొక
కొండ గుహలో యోగమున భగ
వాను నింగనిరీ.

నలువురానందాను భవమున
కొంత కాలము గడుపముదలా
ళ్వార్లు ముువ్వురు జనిరి తమదగు
దేహలీ పురికిన్.

ముువ్వు రయ్యలు ముచ్చటగనట
దేహళీ పురమందు కోవెళ
లోని స్వామిని భక్తి గిల్చియు
మోక్షముంగనిరీ.

వారి కాలము మూడు వేలా
మూడు వందల ఇరువదైదున్
భక్తి సారులు తాను దలచిన
క్షేత్రముల్ గనుచున్.

యోగ సిద్ధీ క్షేత్రమగు నా
సత్య వ్రతక్షేత్రంబు కంచిన్,
స్థిర నివాసము జేయదలచీ
అందె తానుండెన్.

కంచి నర్చారూపుడైనయ
ధోక్త కారుల నిత్య ముంగని
పులకితా గాత్రుండు నైయో
గమున హరి గాంచున్.

వృద్ధ దంపత పుత్ర రత్నము
కణీ కృష్ణుడు కలడు కాంచిన
భక్తిసారుల శిష్య రత్నము
భక్తి యుక్తుండున్.

వారి గృహమును వృద్ధ స్త్రీకడు
భక్తి శ్రద్ధల ప్రతి దినంబును
నూడ్చుచుం గోమయము చేతను
నలుకు ప్రతి దినమున్.

రంగవల్లుల దీర్చునింటను
శబరి వోలెను సేవ జేయగ
భక్తి మెచ్చిన భక్తి సారులు
యౌవనం బొసగెన్.

ఆమె నవ్యాంకురిత జవ్వని
తరగనీ సౌందర్య రాశీ
నిత్య యౌవని యామెనుంగని
మోహసంద్రంబున్.

మునిగి కాంచీ రాజుపల్లవ
రాయలును ప్రార్థించి ఆమెను
పెండ్లి జేసుక సురత క్రీడల
బొందె సౌఖ్య ములన్.

కొంత కాలముగడువరాజును
వృద్ధుడవగను ముద్దు గుమ్మప్ర
వర్థమానపు యౌవనంబున
వెలిగె శశి వోలెన్.

సుందరీ నీయౌవనంబును
వృద్ధి నొందుచు నుండనాదగు
యౌవనంబుడు గంగ జొచ్చెను
కారణంబెరుగన్.

అనగ సుందరి రాజు తోననె
భక్తి సారుల భవ్య కృపయే
నాతడొసగిన బిక్షయియ్యది
అతడె శక్తుండౌ.

అతని బిలిపించడుగ దలచితె (న)
భక్తి సారుల వాప్త కాములు
(శివుని కైనా తలను వంచని)
శివుని కేతల వంచెరుంగని
భక్తు డాతండున్.

వారి శిష్యుడు కణీ కృష్ణుడు
అక్షయం బౌపాత్ర చేగొని
బిక్షకై నాయింటి కొచ్చును
అతని బంపెదనూ.

అతని పురషా కారముననీ
వాంఛి తంబీ డేరునేమో
ఎవరి కర్మకు నెవరు బాధ్యులు
అంత దైవేచ్ఛే.

అనియు సుందరి నంపె కృష్ణుని
ద్వాదశోర్ధ్వా పుండ్రములతో
తులసి మాలలు అక్షమాలలు
దాల్చి సభకేగెన్.

కణీ కృష్ణుని గోరెరాజూ
భక్తి సారుల బంప సభకున్
గురువు రారని బల్ల గుద్దియు
రాజుతో ననియెన్.

అపుడు రాజా కణీ కృష్ణుని
తనకు యౌవన మరుగు దేరగ
కవిత రచన జేసి పాడగ
నెంతయో వేడెన్.

భగవదర్పణ మునకె తనువును
గాన మాటలు మాట పాటలు
మానవుడవగు నిన్ను నేనెటు
స్తోత్రమొనరింతున్.

అంతనారా జాగ్రహించీ
రాజ్యమున నీవుండదగదని
వెడల ద్రోసెను కణీకృష్ణుని
గర్వమేపారన్.

అప్పుడా కణి కృష్ణుడొయ్యన
భక్తి సారుల చెంత నిలచీ
రాజ శాసన మెరుగజేసీ
పోయివత్తనియెన్.

శిష్య రత్నమ నీవులేనీ
చోటు నాకింకేల నయ్యా
నేను నీన్వెంట వత్తని
దైవ సన్నిధికిన్.

జనియ ధోక్తా కారి స్వామితో
అనియె నిట్టుల భక్తి సారులు
వెడలు చుంటిని శిష్యుగూడియు
ఆజ్ఞ నొసగండీ.

అనుచు వేడ యధోక్త కారియు
నాకు అత్యర్థ (అత్యంత) ప్రియుండవు
జ్ఞానివీనాకాత్మ భూతుడ
వైన నీవిచటన్.

లేనిచో నీకంచియేలా?
నేను నీతో వచ్చు వాడను
ఎచట నీవో యచట నేనని
స్వామి తాబలుకన్.

కణీ కృష్ణుడు ముందు నడచెను
బొంత చంకన భక్తి సారులు
శేష తల్పము చంక బెట్టియ
థోక్త కారులునున్.

ఇటుల జనగను కంచి లోనీ
పదియునెనిమిది విష్ణుమూర్తులు
ఏక ఆమ్రేశ్వరులు నితరులు
క్షేత్ర పాలకులున్.

ఆయథోక్తా కారితోజన
ప్రజలు దేవుల ననుగ మించిరి
ఏక మయిరట నొక్కవనమున
ఏక స్థలమయ్యెన్.

రాము డడవికి నేగి నప్పుడ
యోధ్య పట్టణ మెట్టులుండెనొ
కాంచి పట్టణ మట్టి స్థితిలో
నను భవంబొందెన్.

శూన్య గృహములు, శోభతరిగిన
తరులతా పుష్పాది తరులను
తప్తజల సరుసులతొకాంచీ
నగరమే మారెన్.

పల్ల వేశ్వరుడంతయుంగని
భక్తితోనాకంచి వరుదుని
పురమురమ్మని కోరవరదుడు
యథోక్తి కారులనున్.

సర్వ శాస్త్రాల్దరచి చూడగ
మాటి మాటికి విచారింపగ
తేలె సారము హరియె పరత
త్వంబు నిజమనగన్.

విష్ణువేమోక్షాధికారీ
అతని ధ్యాన్నమె అనుసరీయము
అనుచు ఆమహయోగి బహుప్ర
మాణముల్ జూపన్.

ఆశీవావాక్యుండుముదమున
పేయ ఆళ్వార్ శిష్యుడవగను
పంచ సంస్కారంబు జేసీ
వైష్ణవంబొసగెన్.

అన్య ధాజ్ఞానంబు అజ్ఞా
నంబు విపరీతంబు జ్ఞానము
లన్ని వదలియు హరిని గూర్చియు
నంత తానెరిగెన్.

భక్తి సారులు మహా యోగికి
శిష్య పుంగవులయ్యు గురువుల
బాగుగా పూజించి కొలువగ
బహుముదంబందీ.

తనదు పని నెరవేనంచును
సంత సంబున తీర్థయాత్రకు
ఉత్తరంబుగ వెడలె భూసురు
డుత్త మోత్తముడున్.

హృదయమున నష్టాంగ యోగము
ద్వార నారాయణుని దర్శన
భాగ్య ముంగనె భాగ్య శాలీ
భక్తిసారుండూ.

హరి కృపాపాత్రుండు తానయి
అరి భయంకరమైన చక్రము
రక్షగా తననంటి యుండగ
విష్ణు వుంగొల్వన్.

ఒక్క నాడాతండు కైరవి
ణీనదీ తీరమున నొక్కచో
ఒంటిగా గూర్చుండి స్వామిగు
ణానుభవపరుడై.

యుండ గంగాధరుడు శూలము
దాల్చి పార్వతి సహితముగ గగ
నంబునందున వెల్గుచుంజనె
నంది వాహనుడై.

పరమ వైదికుడైన నాతడు
నాకసంబున నరుగు శివునీ
నీడ మీదను పడగ దగదని
బొంత గప్పుకొనీ.

ఇంటి చూరున నిల్వ నప్పుడు
పార్వతీ పరమేశ్వరుల్గని
అబ్బు రంబుగ నాగి జూడగ
పార్వతిట్లనియెన్.

బొంత దాల్చిన వారు ఎవ్వరు
అతని జూడగ కుతుక మొదవెను
వింత చైదం బితనిదింగన
నాత డెవ్వడనన్.

అపుడు గరకంఠుండు నిట్లనె
విష్ణు భక్తాగ్రేసరుండు
పరమ వైష్ణవునకును మనతో
పనియు లేదనియెన్.

ఐన పార్వతి పట్టు బట్టగ
శివుడు భూలోకమున నాతని
కెదురు నిల్వగ, కనుల నెత్తి
గాంచ డాతండున్.

నేను దేవత లోనముఖ్యుడ
అంత వాడను చెంత నిల్వగ
సుంత యైనను జూడవేమిది
నీవు యోగ్యుడవే.

ఎంతొ దుర్లభమైన నాదగు
దర్శనంబును గనగ జేసితి
కోర్కెలెల్లెయు కోరి దీర్చెద
కోరు మని నుడువన్.

అనగ శివునితొ భక్తి సారులు
బొంత కుట్టే సూది ద్వారా
దార ముంజను వరమునీయుమ
టంచు తాగోరెన్.

అంత ఫాలా క్షాండు నలిగీ
నుదుట కంటిని దెరచు నంతలో
అగ్ని జ్వాలా మాల లెగసెను
భక్తి సారులపై.

తనను భసుమము జేయవచ్చెడు
ఫాల నేత్రుని కంటి మంటల
జూచి బెదరక చక్రరాజ్యము
నతనిపైనంపెన్.

దాని నుండీ ఎగసి పడెప్రళ
యాంత మందలి ద్వాదశార్కుల
జ్వాలకెనయౌ జ్వలిత జ్వాలల
లాట నేత్రునిపైన్.

పుష్ప కావర్తకములనియెడు
మేఘముల బిలిపించెహరుడు
ఘోరునన్వర్షంబుగురిసెను
అగ్నిచల్లారెన్.

మేరు నగసమధీరుడైనట
ధ్యానమగ్నుండైనవైష్ణవు
జూచియా ముక్కంటి నెంతో
పొంగు చిట్లనియెన్.

ఓయి భక్తీ సార నీవిక
భక్తి సారుండ నెడు బిరుదుతో
చంద్ర తారార్కంబు భువినన్
ఖ్యాతి గనుమయ్యా!

అనుచు శివుడా అంబనుంగని
కాంత కాంతే వైష్ణవులనున్
అంబరీషుని వలన దుర్వా
సుండు తానోడెన్.

నేడు నేనీ తనికి నోడితి
నిష్ఠ గల్గిన విష్ణు భక్తుల
జోలికేగిన కలుగు చిక్కుల
టంచు శివుడేగెన్.

మహీసారమె తమిళ మందున
తిరుమళీ శైయనగ బడియెను
అందుచే నాతండు తిరుమళి
శైయ ఆళ్వారుల్.

శక్తి హారుండనెడి సిద్ధుడు
వ్యాఘ్ర వాహన మెక్కి నింగిన
స్వేచ్ఛగా జను చుండ క్రిందను
భక్తిసారుండున్.

తపము జేయుచునుండ నాతని
తపోశక్తియు మింటి నంటగ
శక్తి హారుని వ్యాఘ్ర రాజము
దాటలేకుండెన్.

క్రిందుగా నాసిద్ధుడుంగని
విష్ణు భక్తుని వింత గాగని
దివ్యయోగపు తేజముంగని
అబ్బురంబంచున్.

ఓయి! ఇంతటి గొప్పవాడికి
బొంత ఏలను పొందుమిదిగో
దివ్య కవచంబొకట నిత్తును
వజ్ర నిర్మితమౌ.

కవచ మిత్తన మహిమ తొడుత
మణులచేనిర్మింపబడిన
కవచమును కల్పించి జూపగ
సూర్యతేజంబున్.

వెలుగు చుండగ వెరగు పడి తన
కంఠ మందలి మణుల మాలను
జపము మాలగ గొనగ వేడిన
శుక్తి హారునకున్.

అక్షమాలను అక్క జంబుగ
మణుల మాలగ మార్చి జూపగ
శుక్తి హారుడు సిగ్గు పడి తన
వాఘ్రు మెక్కి చనెన్.

భక్తి సారుల మహిమ విని కొం
కణపు సిద్ధుండనెడి వాడును
గుళిక నొకదాన్నొసగె స్వామికి
స్వర్ణ మొనరించున్.

ఇనుము దాకిన స్వర్ణమగునన
ఒడలి మన్నును గొంత దీసియు
గుళిక గాతా మార్చియిచ్చెను
సిద్ధ పురుషునకున్.

నీది నినుమును జేయు బంగరు,
నాదిమట్టిని జేయు బంగరు
ననగ సిద్ధుడు పర్వతమునకు
దాని తగిలించన్.

భక్తిసారుల మేని మట్టీ
స్పర్శ కతమున పర్వతంబపు
డయ్యెబంగరు కొండ గాగని
సిద్ధుడుంజనియెన్.

కొంత కాలము గడచి నంతట
మొదలు ఆళ్వార్లరయ ముప్వురు
భక్తి సారులు దైవి కంబుగ
గలిసిరొక చోటన్.

ఇవ్విధంబున పరస్పరమును
గౌరవించుక నలుగురునొక
కొండ గుహలో యోగమున భగ
వాను నింగనిరీ.

నలువురానందాను భవమున
కొంత కాలము గడుపముదలా
ళ్వార్లు ముప్వురు జనిరి తమదగు
దేహళీ పురికిన్.

ముప్వు రయ్యలు ముచ్చటగనట
దేహళీ పురమందు కోవెళ
లోని స్వామిని భక్తి గిల్పియు
మోక్షముంగనిరీ.

వారి కాలము మూడు వేలా
మూడు వందల ఇరువదైదున్
భక్తి సారులు తాను దలచిన
క్షేత్రముల్ గనుచున్.

యోగ సిద్ధీ క్షేత్రమగు నా
సత్య వ్రతక్షేత్రంబు కంచిన్,
స్థిర నివాసము జేయదలచీ
అందె తానుండెన్.

కంచి నర్చారూపుడైనయ
థోక్త కారుల నిత్య ముంగని
పులకితా గాత్రుండు నైయో
గమున హరి గాంచున్.

వృద్ధ దంపత పుత్ర రత్నము
కణీ కృష్ణుడు కలడు కాంచిన
భక్తిసారుల శిష్య రత్నము
భక్తి యుక్తుండున్.

వారి గృహమును వృద్ధ స్త్రీకడు
భక్తి శ్రద్ధల ప్రతి దినంబును
నూడ్చుచుం గోమయము చేతను
నలుకు ప్రతి దినమున్.

రంగవల్లుల దీర్చునింటను
శబరి వోలెను సేవ జేయగ
భక్తి మెచ్చిన భక్తి సారులు
యౌవనం బొసగెన్.

ఆమె నవ్యాంకురిత జవ్వని
తరగనీ సౌందర్య రాశీ
నిత్య యౌవని యామెనుంగని
మోహసంభ్రంబున్.

మునిగి కాంచీ రాజుపల్లవ
రాయలును ప్రార్థించి ఆమెను
పెండ్లి జేసుక సురత క్రీడల
బొందె సౌఖ్య ములన్.

కొంత కాలముగడువరాజును
వృద్ధుడవగను ముద్దు గుమ్మప్ర
వర్ధమానపు యౌవనంబున
వెలిగె శశి వోలెన్.

సుందరీ నీయౌవనంబును
వృద్ధి నొందుచు నుండనాదగు
యౌవనంబుడు గంగ జొచ్చెను
కారణంబెరుగన్.

అనగ సుందరి రాజు తోననె
భక్తి సారుల భవ్య కృపయే
నాతడొసగిన బిక్షయియ్యది
అతడె శక్తుండౌ.

అతని బిలిపించడుగ దలచితె (న)
భక్తి సారుల వాప్త కాములు
(శివుని కైనా తలను వంచని)
శివుని కేతల వంచెరుంగని
భక్తు డాతండున్.

వారి శిష్యుడు కణీ కృష్ణుడు
అక్షయం బౌపాత్ర చేగొని
బిక్షకై నాయింటి కొచ్చును
అతని బంపెదనూ.

అతని పురషా కారముననీ
వాంఛి తంబీ డేరునేమో
ఎవరి కర్మకు నెవరు బాధ్యులు
అంత దైవేచ్ఛ.

అనియు సుందరి నంపె కృష్ణుని
ద్వాదశోర్ధ్వా పుండ్రములతో
తులసి మాలలు అక్షమాలలు
దాల్చి సభకేగెన్.

కణీ కృష్ణుని గోరెరాజూ
భక్తి సారుల బంప సభకున్
గురువు రారని బల్ల గుద్దియు
రాజుతో ననియెన్.

అపుడు రాజా కణీ కృష్ణుని
తనకు యౌవన మరుగు దేరగ
కవిత రచన జేసి పాడగ
నెంతయో వేడెన్.

భగవదర్పణ మునకె తనువును
గాన మాటలు మాట పాటలు
మానవుడవగు నిన్ను నేనెటు
స్తోత్రమొనరింతున్.

అంతనారా జాగ్రహించి
రాజ్యమున నీవుండదగదని
వెడల ద్రోసెను కణీకృష్ణుని
గర్వమేపారన్.

అప్పుడా కణి కృష్ణుడొయ్యన
భక్తి సారుల చెంత నిలచీ
రాజ శాసన మెరుగజేసీ
పోయివత్తనియెన్.

శిష్య రత్నమ నీవులేనీ
చోటు నాకింకేల నయ్యా
నేను నీన్వెంట వత్తని
దైవ సన్నిధికిన్.

జనియ ధోక్తా కారి స్వామితో
అనియె నిట్టుల భక్తి సారులు
వెడలు చుంటిని శిష్యుగూడియు
ఆజ్ఞ నొసగండీ.

అనుచు వేడ యధోక్త కారియు
నాకు అత్యర్థ (అత్యంత) ప్రియుండవు
జ్ఞానివీనాకాత్మ భూతుడ
వైన నీవిచటన్.

లేనిచో నీకంచియేలా?
నేను నీతో వచ్చు వాడను
ఎచట నీవో యచట నేనని
స్వామి తాబలుకన్.

కణీ కృష్ణుడు ముందు నడచెను
బొంత చంకన భక్తి సారులు
శేష తల్పము చంక బెట్టియు
ధోక్త కారులునున్.

ఇటుల జనగను కంచి లోనీ
పదియునెనిమిది విష్ణుమూర్తులు
ఏక ఆమ్రేశ్వరులు నితరులు
క్షేత్ర పాలకులున్.

ఆయధోక్తా కారితోజన
ప్రజలు దేవుల ననుగ మించిరి
ఏక మయిరట నొక్కవనమున
ఏక స్థలమయ్యేన్.

రాము డడవికి నేగి నప్పుడ
యోధ్య పట్టణ మెట్టులుండెనో
కాంచి పట్టణ మట్టి స్థితిలో
నను భవంబొందెన్.

శూన్య గృహములు, శోభతరిగిన
తరులతా పుష్పాది తరులను
తప్తజల సరుసులతొకాంచీ
నగరమే మారెన్.

పల్ల వేశ్వరుడంతయుంగని
భక్తితోనాకంచి వరుదుని
పురమురమ్మని కోరవరదుడు
యధోక్తి కారులనున్.

యధోక్త కారీ భక్తి సారుల
వారు కణికృష్ణులను జూపిరి
పల్లవుండపుడతని పదముల
వ్రాలి వేడు కొనెన్.

వల్ల భుంగని కరిగె కృష్ణుడు
అందరిని ప్రార్థించె నప్పుడు
పూర్వ స్థలమున యందెనిల్వగ,
అందరబ్బగిన్.

నిలువ కలకల కాంతులీనెను
కాంచి పట్టణ శోభ పెరిగెను
భక్తి సారులు కణీ కృష్ణుతో
కాలముంగడుపన్.

కొంత కాలము గడువ దక్షిణ
దేశ తీర్థయాత్ర జేయగ
భయలు దేరిన భక్తి సారులు
కుంభ కోణమునున్.

వచ్చి యుండరి మార్గ మధ్యను
వ్యాఘ్ర పురమున బ్రాహ్మణోత్తము
లరుగు పై గూర్చుండి వేదా
ధ్యయనముం జేయన్.

భక్తి సారులు అదే మార్గము
ననుసరించుచు రాగ జూచిన
విప్రు డాతడు గాడటంచును
అధ్యయన మాపంగన్.

శూద్రుడను భావముతో పాఠము
నాపి నారని తలచె నాతడు
కొంత దూరము బోయి నిలిచెను
బ్రాహ్మణుల్ మరలన్.

వేద పఠనము మొదలు పెట్టగ
ముందు తామెచ్చుటను నాపిరొ
అదియె మరచియు మదన షడగను
సందియము దీర్చన్.

నల్ల ధాన్యపు గింజ గైకొని
గోళ్ళ తో జీల్చి యును జూపగ
వ్రీహినాం నఖ నిర్భినంబను
వేద వాక్యంబున్.

గుర్తునవగా భక్తి సారులు
జీల్చి జూపిన నతని ప్రజ్ఞకు
నందరాశ్చర్యంబు నొందిరి
అంత రంగ మునన్.

భక్తి గల్గిన వారు బ్రాహ్మలు
భక్తి లేనిచొ శూద్రులవుదురు
భక్తులే భాగవత విప్రులు
కులపు తలపేలా.

అనుచు సాష్టాంగంబుగా పడి
భక్తి సారుల భక్తి గదరగ
పూజజేసీ సాగనంపిరి
భూసురోత్తములున్.

భక్తి సారులు ఉంఛ వృత్తిని
జీవంబును గడుపు చుండగ
కుంభ కోణము నందు ఆలయ
ప్రాంగణంబందున్.

యజ్ఞ మొక్కటి జరుగు చుండగ
భిక్షమునకై భక్తి సారులు
ఇంటినింటికి దిరుగు చుండగ
వింత గననయ్యెన్.

అచటి స్వామీ శార్ జ్ఞపాణియు
భక్తిసారుల కభిముఖుండై
ఆయవీధుల కభిముఖంబుగ
తిరుగగా జొచ్చెన్.

అర్చకుండా వింత గనియును
యజ్ఞ దీక్షితునకు జెప్పగ
దీక్షితుండపు డెదురుగా జని
గౌరవాదరమున్.

భక్తి సారుల ప్రేమ మీరగ
యజ్ఞ శాలకు దోడి తెచ్చీ
హరియె నీస్వాధీనుడంచును
అధిక శ్లాఘించీ.

అగ్ర పూజనుచేయ దలచన
గ్రాస నంబున అధివసింపగ
దీక్షితులు అర్చించిరప్పుడు
చిత్తముప్పొంగన్.

అచటి బ్రాహ్మణు లాగ్రహించీ
బ్రహ్మ వాదుల మధ్య శూద్రుని
కగ్ర పూజను జేసి మాకవ
మాన మొనరింతే.

నీదు యాగము ధ్వంస మైనది
మూఢ యాగం బొనర జేసితె
అనుచు నిందించంగ జూచీ
సోమయాజనియెన్.

భక్తి సారా! మహానుభావ!
రాజ సూయము నందు కృష్ణున
కైన అవమానంబు జరిగెను
నేనె అపరాధిన్.

నాకు దుస్సహనంబు నియ్యది
కృష్ణు వోలెను మీర లిప్పుడు
మహిమ వీరికి చూప గావలె
బుద్ధి చెప్పవలెన్.

పాంచ జన్య సుదర్శనాదీ
పంచ ఆయుధముల ధరించీ
శేష తల్పము పైన హరినీ
శిరో మధ్యమునన్.

సోమ యాజులు కోరగానా
భక్తి సారులు జూపిరప్పుడు,
అచటి వారలు సంభ్రమంబున
పదములంబడిరీ.

నింద జేసిన వారలందరు
సర్వ అపరాదము క్షమింపను
వేడి బ్రహ్మరథంబు బట్టిరి
భక్తి భావములన్.

వారలను దీవించి స్వామియు
కుంభ కోణము వెడలి పోయిరి,
శార్ఙ పాణిని తనివి దీరా
సేవ జేయుచునూ.

దివ్య మునునగు ద్రవిడ భాషా
గాథ గానము జేయ శార్ఙా
పాణి ఎంతో సంతసించీ
లేవ బోవంగన్.

స్వామి శ్రమ నొందుటను నోర్వక
వలదటంచును భక్తి తోవా
రింప నపుడు త్తాన శయనుడు
శార్ఙ పాణయ్యేన్.

భక్త సారులు శార్జ్గపాణిని
ద్రవిడ భాషా పాశురములతొ
కీర్తనంబును జేయగా ఏ
ర్పడెను గ్రంథబుల్.

నాన్మగన్ అందాది యొక్కటి
రెండు శ్రీతిరు చంద విరుత్తం
శ్రీకుడైన్దక్కిడం దానల
సేవ సేయుచునూ.

తమదు అంశకు మూల కందం
బైన చక్రము నందు లీనం
బైరిభక్తీ సారులుంధర
జనులు బొగడంగన్.

వీరు ద్వాపర యుగము చివరను
ఆరువేలా వత్సరంబులు
ఒక్క వేయీ ఏండ్లు గడిపిరి
కలియుగంబాదిన్.

భక్తియే సారంబుగా గల
భక్తి సారుల చరిత చదవను
విన్న వారలు జనుదురట్టీ
విష్ణు సాయుజ్యమ్.

శ్లో ॥ మఖాయాం మకరే మాసే
చక్రాంశం భార్గ వోద్భవం
మహీసార పురాధీశం
భక్తి సార మహంభజే.

మకర మాసము మఖానక్ష
త్రంబు చక్రాంశోద్భవులునూ
మహీసారపురాధి పతులును
భార్గవోద్భవులున్.

నైన భక్తీ సారులను హృ
త్పంజరంబున భక్తి నిల్పీ
దాస భూతుడనై దొసంగుక్ష
మింప వేడితినీ.

శ్రీ తిరుమళి శై యాళ్వార్
దివ్యతిరుకది గళియే శణమ్



ఓం శ్రీ లక్ష్మీ హయగ్రీ వాయనమః
శ్రీ మతే రామానుజాయనమః

# శ్రీ కుల శేఖరాళ్వారులు

శ్రీ కరంబగు కేరళంబున
కోళి పట్టణ మొకటి గలదది
కుక్కుటా నగరం బటంచును
పెక్కు ప్రఖ్యాతిన్.

సర్వ శోభ సమన్వి తంబును
సర్వ సంపద్భాసురంబును
అట్టి పట్టణ మరయ అమరా
వతిని తుల దూగన్.

ఇంద్ర పురి సమ సుందరంబిది
ఇంద్ర సముడా దృఢ వ్రతుడును
వైభవంబున సాటి లేరని
కవులు బొగడంగన్.

చేరవంశోద్భవుడు క్షాత్రకు
లాభరణుడు దృఢవ్రతుడు తా
ధర్మ మార్గంబునను రాజ్యము
చక్కగానేలెన్.

చాలా కాలము వరకు పిల్లలు
కలుగ నందున హరిని గూర్చి
ఉపాసించను స్వామి ప్రీతితో
పుత్రునొక నొసగెన్.

కాల క్రమమున కౌస్తు భాంశతో
పరాభవ సంవత్సరంబున
కుంభమాసా శుక్ల పక్షా
గురువు వాసరమున్.

దశమి పునర్వ సున క్షత్రం
బందు బాలుడు జనన మొందెను
రామ చంద్రుని వోలె బుడతడు
కులము వెలయంగన్.

పుత్ర జననో త్సాహమునతా
దాన ధర్మము లెన్నొ జేసికు
లశే ఖరుండను పేరు బెట్టిరి
కులము వర్ధనుడౌ.

అన్ని సంస్కారముల జేసీ
క్షత్రియో చిత విద్య నేర్పీ
వేద శాస్త్రాల్ ధనుర్వేదం
బభ్య సింపగన్.

గురువరేణ్యులు నామ మాత్రము
ఔరయనగా నన్ని నేర్చీ
రాజ నీతీ, ధర్మపాలన
దక్షతం గల్గన్.

అప్పుడా దృఢ వ్రతుడు పుత్రుని
పాలనాసామర్థ్యముంగని
రాజ్య భారము నుంచి ఏగెను
తపో వనమున కున్.

ప్రజా పాలన మందు రాముని
పాలనను తలపింప జేసెను
శత్రు భీకరుడయ్యు రాజ్యము
దుర్భే ద్యముగ నేలెన్.

దుర్బలులకును బలము రాజే
యనెడు మాటయె సార్థకంబవ
దుష్ట శిక్షణ శిష్ట రక్షణ
చక్కగా జేసెన్.

భగవ దాజ్ఞకు బద్ధులయ్యును
వేత్ర హస్తులు వేగ వచ్చి
పంచ సంస్కారములజేసీ
మంత్ర మంత్రార్థాల్.

రాజ శేఖరుడైన యాకుల
శేఖరులకుప దేశమొసగీ
వైష్ణవంబగు దీక్ష నొసగీ
ఏగె విష్ణుపురిన్.

దాన మది ఉద్బుద్ధ మవగను
జ్ఞానతేజము ప్రజ్వలింపను
రాణ్మణీకుల శేఖరులు హరి
భక్తి గలవారల్.

భాగవతులతో భక్తియలవడ
దైవసంబంధ పరుల యెడల
గౌరవాదరణములు పెరుగన్
భక్తి రెట్టింపన్.

ఎందు జూచిన భక్తి హీనులు
దేహ మందభిమాన శాలురు
అర్థమందా పేక్ష శాలురు
దుష్టగాములునూ.

అట్టి జనముల మధ్యనుండుట
కిచ్చ గింపక చరలొ నుండిన
విధముగా భావించి భగవ
ద్భాగవత సేవన్.

మనసు లగ్నం బవను భగవ
త్కృపను లబ్ధం బైన రాజ్యము
భాగవతకైంకర్యమునకే
అర్పణంబంచున్.

రాజ్యమంతయు భాగవతులా
ధీనమొనరించా విభీషణు
వోలె శ్రీరామ చంద్రః మమ
శరణమని తలచీ

విభవ అవతారములలో శ్రీ
రామచంద్రుని యందు, అర్చా
మూర్తులందున వేంకటేశుని
యందు హృదయంబున్.

మగ్న మవగా వేంకటేశా
ఆలయంబున మెట్టునైపగ
డంబు వంటీ పెదవిగలనీ
మోము కడు భక్తిన్.

జూచి నేతరియింతు నంచును
భక్తి నీ శ్రీ రంగ ధాముని
క్షేత్ర మాహాత్మ్యంబు వినగను
అందు నిట్లుండున్.

నారదా శ్రీ రంగ క్షేత్రము
వెళ్ళినా తావెళ్ళ దలచిన
ఇహపు సంసారంపు బంధము
తొలగు నని వినియున్.

అట్టి మాటలు గట్టి గామది
యందు నాటగఐహికంబుల
నేవగించీ భువిని భోగము
లతః పథుజేయున్.

అనుచు సింహాసనమునందున
తాను గూర్చొదగదటంచును
దివ్య మౌశ్రీరంగ యాత్రకు
వెడలు చున్నటులన్.

రాజ్య ప్రజలకు తెలియజయన్
టముకు ద్వారా చాటజేయన్
ప్రభువు వృత్తాంతంబు వినినా
మంత్రు లిట్లనిరీ.

ప్రభువునాపుట మహాకష్టము,
ఆపుటే కర్తవ్య మిప్పుడు,
అచటి కేగిన మహారాజులు
మరలి రాకుండున్.

శేషశయనుని చతుర్భుజునీ
లక్ష్మి భూనీళాధినాథుని
దివ్యభూషాంచితాగాత్రున్
పద్మపత్రాక్షున్.

కోటి సూర్యప్రకాశమానుడు
రంగ ధాముడు రంగ నాథుడు
అతని జూచిన తిరిగి రాడూ
ముక్త పురుషునిగన్.

దుష్ట శిక్షకుడగు ప్రభుండా
రాజ సింహాసనము గూర్చుని
సింహమోలెను రాజ్యమేలిన
రామ రాజ్యముగున్.

రాజు లేనిచొ రాజ్యమేమగు
రాజ్యమంతనరాజ కంబగు
ప్రజా క్షేమము గోరి తామీ
రాజు నాపవలెన్.

తెల్లవారెన రాజు ఆగడు
అతని నిష్ఠ నెరుంగు మంత్రులు
స్వాములను దర్శించి వారల
తోడ నిట్లనిరీ.

పరమ భాగవతోత్తములును, మీ
రనిన మనప్రభు దైవ మూర్తులు
మీదు మాటను దాట నేరడు
కాన మామాటన్.

చిత్తగించీ రాజు నాపుడు
దేశ క్షేమమె రాజు క్షేమము
బ్రాహ్మణుల్గద గోరు వారలు
అనుచు ప్రార్థింపన్.

అస్తుయనితా మభయ మిచ్చిరి
అందరిండ్లకు నరిగి నారట
ప్రాగ్దిశాంగన నుదుటి తిలకము
వోలె రవి బింబమ్.

ఎట్టి నయ్యేను సార్వభౌములు
స్నాన సంధ్యా వందనంబుల
జపతపంబులు పూర్తి జేసీ
రంగ యాత్రకునై.

సపరి వారంబుగను వెడలగ
వైష్ణ వోత్తము లెదురు వచ్చిరి
ఎదురు వచ్చిన స్వాములంగని
పొంగి తబ్బిబ్బై.

ఆహా! ఎంతటి భాగ్యమబ్బెను
కంటి నిందర స్వాములన్నిట
ఎంత భాగ్యం బెంత భాగ్యం
సేవ లభియించెన్.

కోట్లు నాణెము లొసగ దొరుకున,
విష్ణు భక్తుల పూజ కన్నను
వేరు పురుషార్థంబు గలదా
వీరి సేవింతున్.

భగవదా రాధనను మించీ
భాగవత ఆరాధనంబే
మిన్నయని కుల శేఖరుండును
కోటకున్ మరలెన్.

వేద వేదాంతములు నేర్చియు
లోక కళ్యాణమును గోరుచు
స్వామి కైంకర్యమున నిరతులు
అచటి వైష్ణవులున్.

అట్టి వారల తగిన గృహమున
విడిది చేయించచట తృప్తిగ
పంచ భక్ష్యంబులతొ విందును
వారు దనివారన్.

బ్రేవుమనుచును తినగ వారల
భోజనంబులు పూర్తియవగా
వారి శేష ప్రసాదముందిని
తగిన సత్కారమ్.

బొనర జేసీ జన్మసార్థక
మయ్యె రేపే జేర బోదము
రంగదాముని పట్టణంశ్రీ
రంగ నగరముకున్.

అనియు నాకుల శేఖరుండట
స్వాములతొపరమార్థముల్వాని
జన్మ చరితార్థంబటంచును
మదిని తాతలచెన్.

కొంత కాలంబిటుల గడచెను
మంత్రి వర్యుల తంత్ర ఫలితము
ధర్మ మార్గ పరాయణుల్లై
పాలనముజేయన్.

రామ పాదు కలకును ప్రాధా
న్యంబు భరతుని పాలనంబున
నొందె ప్రాధాన్యతను ముద్రిక
కోళి పట్నమునన్.

ఒకటి కుల శేఖరులు పొందిరి,
అధిగతా పరమార్థ అర్థా
పేక్ష మానసులైన వైష్ణవ
నిత్య సాంగత్యం.

బునను లభ్యం బయ్యె రాజుకు
దివ్యక్షేత్రాద్యాది విభవము
లెన్నొ తెలిసె ప్రవచన మందున
భక్తి విషయంబుల్.

చక్కనీ పండిత ప్రకాండుని
ద్వారా రామాయణపుగాథను
వినుచు ఆయారసములందు
లీనతన్నొందున్.

సుఖము దుఃఖము వీర కరుణా
రసములందా ననుభవించను
ఒక్క నాడారణ్య కాండలొ
రాముడొంటరిగన్.

అసురు లౌఖర దూషణులతో
పోరుఘట్టము వినుచు వెంటనె
సేనా నాయత్తంబు జేసెను
రామ సాయముకున్.

బోవశస్త్రాస్త్రంబు కవచము
దాల్చి ఉద్యుక్తుండు నవగను
అల్ప కాలము నందె రాముడు
అసురులందునుమస్.

ఋషులు సంతస మొందిరప్పుడు
సీత కౌగిలి జేరెయప్పుడ
టంచు పౌరాణికుడు జెప్పగ
రాజు శాంతించెన్.

మరల నొకనాడదేవిధమున
రామకథప్రవచనము సాగన్
రాజశేఖరు హృదయ మెరిగిన
పండితుండేమో.

కష్టమైనా ఘట్టముల నవ
జయపు ఘట్టములన్ని వదలీ
సుఖ తరంబౌ ఘట్టములనే
చెప్పువాడతడున్.

కాని నూతన పండితుండా
పండితునకును తనయు డౌటను
రాజు తత్వ మెరుంగ లేకను
ఇటుల ప్రవచించెన్.

రోహిణిని బుధుడప హరించిన
విధము దశకంఠుండు సీతను
(నూరు) వంద యోజన దూరముంగల
లంక యందుంచెన్.

అప్పుడా సీతమ్మ తల్లీ
శోఖమును వర్ణింపదరమా?
రామచంద్రా! లక్ష్మణాయని
కేక లిడుచుండన్.

పుష్ప కంబున నుంచి లంకకు
సీత నాదశ కంధరుండున్
చెరను బట్టియు బల్మి మీరన
శోక వనమందున్.

ఉంచి నాడని నుడువి నంతనె
ప్రభువు కులశేఖరుల వారున్
దుఃఖ సంతప్తుండునైతా
లంక ముట్టడికిన్.

సైన్య మాయత్తంబుజేసీ
ఖడ్గ కవచాదులను బూన్చీ
రావణాసుర వధకు వెడలెను
లంక కభిముఖుడై.

ముందుగా నారాజశేఖరు
డతని వెంటన్ సర్వ సైన్యము
శంఖ భేరీ భూరి ధ్వనులతొ
సాగె దండిట్లున్.

రాజునాపుట కష్టతరమని
రాజు కెదురుగ చెప్పలేకను
అందరున్నిశ్చేష్టితులునై
అనుసరింపగన్.

ముందు సంద్రము గోచరింపగ
గుండెల దరగ బెండు వడిరీ
ప్రభువు కేమి జరుంగు నోయని
వ్యాకులంబడిరీ.

పిచ్చి ప్రభువును రక్ష సేయగ
రాముడే గతి యంత కన్నను
దిక్కు లేదని తలచు నంతలొ
జొచ్చె సంద్రములోన్.

జనులు హాహా కారమెత్తిరి,
సురలు ఆహా ఓహొయనిరీ,
ఏమి చిత్రము వెనుక జూడక
జలధి లోనేగెన్.

కుతుక లోతున బోవు చుండగ
ఆగుమోకుల శేఖరాయిక
ముందు నకు రాబోకు మీవును
పురమునకు బొమ్మా.

రావణాసురుపుత్ర మిత్రస
బాంధవంబుగ సంహరించీ
సీత నుంగొని దెచ్చి నాడను
ఇదిగో నీ తల్లీ.

ఇదిగొ లక్ష్మణ స్వామి గనుమా
ఆంజనేయుండిదో చూడూ
సర్వ వానర సైన్య మిదిగో
చూడు చోద్యముగాన్.

యుద్ధమవసర మిపుడు లేదూ
నీదు భక్తిని మెచ్చి నాడను
అందుకే ప్రత్యక్ష మైతిని
నన్ను గనుమయ్యా!

అనగ నాదృష్యంబు గనియును
జన్మ సార్థక మైనదంచును
పొంగి పోవగ రామభద్రులు
రాజుతోననియెన్.

రాజశేఖర రాజధానిని
జేరిరాజ్యము నేలు మింకను
ప్రజాపాలన రాజధర్మం
బనుచు తానేగన్.

రాజతత్వం బెరిగి పౌరా
ణికుడు రావణ మరణ ఘట్టము
రాము నీ పట్టాభిషేకము
గ్రుక్కలోజెప్పెన్.

మోదమందున ఖేదమొదవెను
కలలో గాంచిన పెన్ని దట్టుల
కలిగె సాక్షాత్కార మింతయు
ఇదియు సుకృతంబే.

కోళి పట్టణ ప్రజల నేలుచు
రాజు కులశేఖరులు భాగవ
తోత్తముల పరిచర్యజేయుచు
కాలముంగడుపన్.

ప్రభువువారా ధర్మ వేత్తలు
నీతి విదుడున్ సజ్జనుండున్
దాసదాసుడననెడు భ్రాంతి లో
భ్రాంతుడై పోయెన్.

సమయ సందర్భములు లేవిక
రాజపుంగవు చుట్టు నుందురు
రాచ కార్యం బెట్టి దైనను
గడ్డి పరకయ్యేన్.

వైష్ణ వుండెవడేని వచ్చిన
ఎదురుగా తామేగి తెత్తురు
అడగ కున్నను ధనమునిత్తురు
అంత వైష్ణవమే.

ధనా గారము బోసి పోయెను
ప్రజా సంక్షేమంబు లాగెను
అసలుకే మోసంబు నౌనన
మాత్యులుందలచీ.

అదనుకై జూడంగ చిత్రిన
రామ నవమరుదెంచ కోళిన
బహు విధాలంకరణములతో
శోభలీనంగన్.

తీర్చి దిద్దిరి, పట్టణంబున
ముత్యములతో ముగ్గువేసిరి
రాజమందిర వైభవంబిక
తరమ వర్ణింపన్.

దేవతా మందిరము లెంతో
దీప్తి తో వెలుగంగ జొచ్చెన్
రాజ గోపాలునకు తిరుమం
జనములంజేసీ.

పట్టుబట్టలు, వజ్రముత్తెపు
రత్న హారములచట పేర్చిరి,
విలువకట్టుట కలవి గానీ
స్వర్ణ భూషణముల్.

పురుష శ్రీ సూక్త్యాదులతోనా
రాజగోపాలునకు నభిషే
కంబు జేసీ పసిడి వసనము
బాగుగా గట్టీ.

వైజ్రవైఢూర్యాది నగలలో
విలువ గల ముత్యాల హారము
కానరానీ కతము నన్నా
అర్చ కోత్తములున్.

భీతి తోకుల శేఖరులకును
విన్న వించిన కుపితుడైతన
మంత్రులందిలకించి చోరుని
బట్టుడని నుడివెన్.

రాజు నాజ్ఞాపించతప్పదు
కనుక పరిశీలించి నట్టుల
నటన జేసియు ప్రభును జేరియు
ఇటుల తామనిరీ.

ప్రభువరేణ్యా! దొంగ లెవరో
దొరక లేకున్నార లిచ్చట,
ఎవడొ పై వాడెట్లు దీయును
బాగ పరికించన్.

నీకు నిష్టులు నంతరంగులు
అర్చకులు వైష్ణవుల నొక్కడు
దైవద్రవ్యం బపహరింపగ
వీలు గలవారల్.

మీకు కోపము వచ్చు నంచును
భీతితో జెప్పంగ నేరము
వీరి కెట్టి శిక్ష వేతురొ
మీదె భారంబూ.

అనెడి మంత్రుల మాటలన్విని
ఆగ్రహోదగ్రుండు నయ్యెన్
మంత్రులారా! మీదువాక్కులు
కర్ణ శూలంబుల్.

భాగవతనిందయును పాపము,
నింద జేతురె వందనీయుల
ప్రభువులంపెడ దారి కీడ్చెడు
మంత్రి పుంగవులా?

నింద జేసిన వారి, మరియా
నింద లన్నిట విన్నవారలు,
రౌర వాదీ నరక కూపము
శిక్ష లొందుదురే.

విష్ణు కన్నను విష్ణు భక్తులె
శ్రేష్టులంచును చెప్పశాస్త్రము
వారు చౌర్యము జేయలేదని
ఋజువు జూపింతున్.

అనియు కుండలో కాల సర్పము
వంటి విషసర్పంబు నుంచియు
స్నాన మాడీ నీరు గారెడి
వస్త్ర యుక్తముగా.

నరుగు దెంచీ వైష్ణ వుల్ని
ర్దోషులంచూ సర్పరాజము
తనకు నెట్టీ హాని జేయద
టంచు శపథంబున్.

జేసికుండలో జేయి బెట్టియు
బుసను గొట్టెడి పాము లాగగ
పడగ విప్పీ ఆడి నాగము
ప్రణతు లొనరించెన్.

సిగ్గు నొందిన మంత్రులప్పుడు
ప్రభువు పాదములంటి వేడిరి
వైష్ణవుల తిరువడుల కొరగియు
శరణమని కోరీ.

దాచి యుంచిన హార మొసగగ
వైష్ణవ ద్వేషులలో నుండుట
కన్న దావాగ్నులలో నుండుట
శ్రేష్టమనియెంచీ.

రాజ్యమేలా? భోగమేలా!
మానవుల సాంగత్యమేలా!
రాజ్య పాలన నరక మార్గము
నాకు వలదంచున్.

సుతుని దృఢవ్రతుడనెడి వానిని
రాజ్యమందభిషేకునిందగ
జేసి నిష్ఠుల వెంట నిడుకొని
నేగే శ్రీ రంగం.

రంగ నాథుల దివ్యమంగళ
విగ్రహంబును గాంచి పొంగుచు
నీళ దేవ్యాంశమున బుట్టిన
దుహిత రత్నమునూ.

రంగ నాథుల రాణి జేసియు,
సొత్తునంతను అల్లునకు వర
దక్షిణ గతా నొసగి, స్వాముల
నిత్య కైంకర్యమ్.

చేసి తిరుక్కణ్ణపుర౦బున
శౌరి రాజస్వామి వారా
హపురమునవరహావ తారున్
సుందరాబాహున్.

చిదంబరమున సేవ జేసీ
రంగ నాథుల పరము పెరుమాళ్
తిరుమొళియునుముకుందమాలా
పుత్తముల్ర్వా సెన్.

వేంకటేశు పరంబు డెబ్బది
పాశురంబుల వ్రాసెరాజు
నవరసాభరితములు నవ్వీయు
నవ్య ధృమమాలల్.

కోరనీ సంసార బంధము
కోర ధనధాన్యంబు లన్నిట
కోరితీ మీచరణ దాస్యము
జన్మ జన్మములన్!

దివిని నొసగుదొ, భువిని నొసగుదొ
నరక మిత్తువొ మోక్షమిత్తువొ
నరకు నంతము జేసినావే
నన్ను దయగనుమా!

క్షీర సాగర తరగ చినుకులు
మంచి ముత్తెపుమాలనవగా
అందముగ శోభిల్లు శేషుని
పైన పవళించీ.

యోగ నిద్రతో వుండు వాడును
మధువనూ రాక్షసుని జంపిన
శ్రీ యః పతికిని వందనంబుల
జేయుచున్నాడన్.

అనుచు జ్ఞాన సముద్రులైతుది
బ్రహ్మదేశ పురంబునందున
రాజ గోపాల్ దేవళంబున
స్వామి తిరునాడున్.

జేరెకుల శేఖరుల వారీ
ధరను నరువది ఏడు ఏండ్లన్
బ్రతికి మానవ కోటి కెంతయో
భక్తి బోధించెన్.

కేరళంబున కోళపత్తన
మందు  కుంభ పునర్వసందున
కౌస్తు భాంశోద్భవులు కులశే
ఖరులనే గొల్తున్.

ఎవరి నగరము దినదినంబున
రంగ యాత్రని చాట బడెనొ
అట్టి కులశేఖరుల పదముల
శిరసు నేవంతున్.
అట్టి పట్టణ రాజు శ్రీకుల
శేఖరుల గొల్తున్.

-ఓం తత్సత్-



ఓం శ్రీలక్ష్మీ హయగ్రీవాయనమః

## శ్రీ పెరియాళ్వార్ చరితము

చోళ దేశపు దక్షిణంబున
పాండ్య దేశము నందు విల్లి
పుత్తురనునొక దివ్య క్షేత్రము
పుణ్యముల పంటా

విష్ణుమూర్తికి ప్రీతి కరమది,
ఆర్షనామము ధన్వి, నవ్యపు
రంబటంచును పలుక బడియతి
ఖ్యాతి నిగాంచెన్.

పాల సంద్రము నందు నుండగ
విసుగు నొందిన విష్ణుదేవులు
భక్త రక్షణ సేయనిటనా
పక్తి తో నిలచెన్.

సప్త సంద్రము లేక మయినిట
రమ్య మైనతి చిన్న సరసుగ
నగుట చేనట పుణ్య సరసును
సప్త సాగరమూ!

అనెడి పేరున పిల్వ బడెనది
క్షేత్ర పతి వట పత్ర శాయిని
భార్యలతొ నరుదెంచి గొల్తురు
బ్రహ్మ దేవేంద్రుల్.

శేషుడౌనారాయణుండే
దేవతాగ్రేసరుడు నౌటను
సురలు విష్ణుని గొలువ దలచీ
మనములు ప్పొంగన్.

నామ రూపంబులను మార్చీ
క్షేత్రమందున వెలసి నట్టుల
బ్రహ్మ దేవేంద్రాదు లెల్లరు
బ్రాహ్మణుల్నైరీ.

విల్లి పుత్తూర్ వైభవంబును
వేయి పడగల శేషు కేనియు
పొగడగానలవియును గాదన
నుడువ దరమౌనా.

పోకపనసా, అరటి కొబ్బరి
మంచి రసముల అమ్రతరువులు
మల్లె మొల్లలు మంచి జాజులు
ముద్దచామంతుల్.

వేద శాస్త్ర విదులు వారలు
ధర్మ పరులును, విష్ణు భక్తులు
నాల్గు వేదాల్ పుక్కిటన్నిడి
నలరు చుందురటన్.

అందులోనముకుందు డనియెడు
వైష్ణవాగ్రేసరుడు గలడూ
పురః శిఖబోదాయనసూత్ర
యజుశ్శాఖీయుల్.

భార్య పద్మాదేవి పతివ్రత
అతడు సంతానార్థి యైవట
పత్ర శాయిని అను దినంబును
భక్తి సేవించన్.

సేవ ఫలితము గలిగె వారికి
పుణ్యఫలమున పుత్రరత్నము,
ప్రేమతోడుత పేరు బెట్టిరి
విష్ణు చిత్తుండన్.

క్రోధనాసంవత్సరంబున
జ్యేష్ఠ శుక్లా భానువారము
తిధియు ఏకాదశియు స్వాతీ
అంశ గరుడాంశౌ.

విష్ణు దేవుని యందు చిత్తము
నుంచి యొక స్థానంబు బొందీ
జ్ఞానము అనుష్టానవంతుడు
కావలేనంచున్.

విష్ణుచిత్తుండనుచు పేరిడ
తండ్రి గారాశించెనట్లే
బాల ప్రహ్లాదునివలేగన
జన్మ వైష్ణవుడై.

భగవదవతారములు పదినా
విష్ణుచిత్తుల డెందమంతయు
కృష్ణునందున లగ్నమవగా
నిటుల దాదలచెన్.

ఎట్టి వాడా దేవదేవుడు
తానెవండూ ఆతదెవడున్
ఎట్టి బంధం బిరువురకును
ఎరుగలేనైతిన్.

శేషి ఆయన, తానుశేషుడు
తనదు శేషత్వంబు సర్వద
నిలచి యుండగదలచి తానే
సర్వ శేషికినీ.

ఏమికైంకర్యంబు జేయుదు
ఏదొనొక కైంకర్యమింపున
జేయగావలె నంచు మదిలో
నిటుల తాదలచెన్.

బ్రహ్మ ఈశా సనకదాదుల
జ్ఞాన ధ్యానములకునునందుని
సర్వ సులభుడు నందకులజుడు
భక్త సులభుండున్.

గోపికావస్త్రాపహారుడు
గోపికాంగన చిత్త చోరుడు
పాలు పెరుగుల వెన్న తరగల
భక్ష కుండతడే.

హాహ హూహూ యనెడియక్షులు
మద్ది చెట్లుగ పడియునుండగ
తల్లి రోలుకు గట్టి వేయగ
రోలు  నీడ్చుచునూ.

చెట్ల నడుమన రోలు జేర్చి
లాగ, నామద్దులును గూలగ
యక్ష పురుషుల కరుణ బ్రోచిన
రక్షకుండతడే.

దుష్ట కంసుని ద్రుంద జేయగ
మధుర నగరము జేరి యచ్చటి
కంసుభృత్యుడు తనదు భక్తుడు
మాలకరు నింటన్.

మాల కారుండొసగినట్టి
గంధ తులసీ పుష్పమాలల
ధాల్చి ధన్యుని జేసే నతనిని
నిదియె కర్తవ్యమ్.

మాలి కాకైంకర్యమేచా
లంచు దలచిన విష్ణుచిత్తులు
అచటి శ్రీవటపత్ర శాయికి
హారము ల్నొసగెన్.

నిత్య కైంకర్యంబు నదియే
ఇదం పత్రమ్మిదం తోయం
బట్లు భక్తుడొసంగునవియే
నాకు నిష్టంబౌ.

ననియు వటపత్రంబు పైననె
పవ్వళించెను భక్త వరదుడు,
దాసభూతుడనయ్యు దండల
నర్పణం జేతున్.

అనితలంచాతండు నట్టులె
మాలి కాసం సేవ నంబున
కూర్మి శ్రీవట పత్రశాయిని
గొల్చు ననుదినమున్.

మధుర రాజ్యమునందు జేరెను
విల్లీ పుత్తూరనెడు పట్నము
పాండ్య వంశోద్భవులు రాజులు
వల్ల భాదేవుల్.

చక్కనీ పరిపాలకుండును
గొప్ప విద్వాంసుడు వీరుడు (రసికుడు)
కన్న బిడ్డల వోలె ప్రజలను
గాంచు ననిశంబున్.

రాత్రులందున మారు వేశము
వేసి రాజ్యము నందు దిరుగుచు
ప్రజల క్షేమము నరయుచుండును
రాజు వలభుడున్.

ఒండు రాత్రిన పురము వీథిన
సంచరించగ నొక్క అరుగున
తీర్థయాత్రలు జేయు బాపడు
పండు కొని యుండెన్.

అతడు గంగా స్నానమాడీ
సేతు స్నానము చేయదలచీ
పోవుచున్నట అలసి సొలసీ
సేద దీర్చు కొనెన్.

రాజునాతని జేరి చర్చను
జేయు చున్నొక మంచి శ్లోకము
చదివి వీనుల విందు జేయన
నతడు విని పించెన్.

శ్లో॥ వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్
విశార్థమర్థం దివసంయతేత
వార్ధక్య హేతో ర్వయసానవేన
పరత్ర హేతోరిహజన్మనాచ.

వర్ష కాలము నందు దుర్లభ
మైన వానిని మిగత ఎనిమిది
మాసములలో గూర్చు కోవలె,
రాత్రి కొరకటులే.

పగలు యత్నము చేయగావలె
ముసలి తనమున వలయు వాటిని
యౌవనంబున పొందగావలె
పరము నుంగోరీ.

ఇహమునను సాధింపవలెనను
అర్థముంగల శ్లోకమును విని
రాజువల్లభ దేవుడిట్లని
తలచె మది యందున్.

మానవులకును రెండు ఫలములు
దృష్ట మదృష్టంబులను నవి
దృష్ట మిహలోకమున కదృ
ష్టంబు పరమునకున్.

కంటికగు పడునట్టి దొక్కటి
గోచరంబింకొకటి జూడగ
దృష్ట ఫలమును గూర్చి తలపను
ఇక నదృష్టమునున్.

గూర్చి యాలో చింపవలెనిక,
ఆఫలంబే మోక్ష ముంగన,
ఇంత వరకాచింత లేదే
ఎంత వ్యర్థుండన్.

మోక్ష ప్రదుడగు దేవుడెవరో
ఎవరినీ సేవింపవలెనో
ననెడి ఆలోచనలు రాజును
ఆవరించంగన్.

బ్రాహ్మ ణోత్తము సత్కరించీ
తాను అంతః పురము జేరీ
రాత్రి యంతర్మదనమువనా
వేదనతొ గడిపెన్.

తెల్లవారిన పిదపస్నానా
ద్యనుష్ఠానములన్ని దీర్చి
రాజు పౌరోహితుడు సంప
త్పూర్ణు నింబిలిచే.

శెల్వ పిళ్ళె పేరె సంప
త్పూర్ణులనియెడి మరో పేరున్
దేర్మ విధుడును, తత్వ వేత్తగు
బ్రాహ్మణోత్తముడున్. (బ్రాహ్మ నుండతడున్)

మోక్ష కారనమైన దెద్దీ
దేని ధ్యానము మోక్ష ప్రదమౌ
దేవ తాగ్రేసరుడెవండూ
తెలుపుడంచనగన్.

నీదుసంప్రశ్నంబు శ్లాఘ్యము
వేదవేదాంతముల నెరిగిన
పండితుల బిలిపించి వారితో
చర్చ సలపండీ.

చర్చ ద్వారా విషయమవగత
మౌన టంచు పురోహితుండును
చెప్ప వల్లభరాయలట్టులె
నిశ్చయించుకొనెన్.

చాటబంచెన్ రాజ్యమంతట
పండితులురావలెనటంచును
రాజునాజ్ఞచె పండి తోత్తము
లరిగి రా సభకున్.

వేద వేదాంగాదులనునా
పోశనంబుగ బట్టినట్టీ
దిగ్గజంబుల వంటి వారలు
అచటి భూదేవుల్.

అంత వల్లబు డపుడు లేచీ
వినయవినమిత గాత్రు డయ్యును
మీదు రాకచె మధుర నేనును
పూత చరితులమూ (ముదము నొందితిమీ)

పండితోత్తము లార యదిగో
తోరన స్థంబంబుగనుడీ
విలువ గలదా విద్యాశుల్కము
గట్టి యుంచితిమీ!

ఎవరు పరతత్వార్థ నిర్ణయ
మింపు మీరను జేయు వారలు
వారె విద్యా శుల్క ముంగొన
నర్హులయ్యేదరూ.

రేపు చర్చా దినమటంచును
రాజు చెప్పగ పండి తాళియు
సరియెనంచును నరిగి నారలు
తమదు విడుదులకున్.

అంతలో నొక వింత జరిగెను
విల్లి పుత్తూర్నందు చిత్రము
మఱ్ఱి యాకున పవ్వళించిన
స్వామి యిటు దలచెన్.

చేతనులు సంసార సాగర
మందు మునుగుచు కర్మ బద్ధులు
నయ్యు పరతత్వం బెరుంగక
తిరుగు చున్నారే.

ఇపుడు మద్భక్తుండు నిష్టుడు
అనవరత కైంకర్యచిత్తుడు
విష్ణు చిత్తుల ద్వార భువిపర
తత్వ నిర్ణయమున్.

ఒనర జేసియు చేతనుల ధర
గావవలసిన తరుణ మియ్యద
టంచు వటపత్రుండు నెంచీ
విష్ణు చిత్తులకున్.

నెదుట సాక్షాత్కార మయ్యెను
విష్ణు చిత్తా! మధుర కుంజని
విష్ణువేపరతత్వ మనుచును
స్థాపనంజేసీ

అచటి విద్యాశుల్కముంగొని
రమ్మటంచును హరియు బల్కను
భక్తుడౌనా విష్ణు చిత్తుడు
విన్నపము జేసెన్.

స్వామి శ్రీవట పత్రశయనా!
దిగ్గజంబుల వంటి పండితు
లుందు రాస్థానంబు నందును
నేను అర్హుడనా?

ఆవులించిన ప్రేవు లెక్కిడు
సర్వ శాస్త్రా పోసనుల్నాటి
హస్తిమ శకాంతరము నౌనే
నెటుల వాదింతున్.

స్వర్ణ సింహాసనము నెక్కగ
గ్రామ సింహము యుక్తమౌనా
తత్వ నిర్ణయ మెటుల జేయుదు
శుల్క మెటుగొందున్.

జ్ఞాన హీనుడనైననేనూ
నీదు కైంకర్యంబెనెరుగుదె
ఎటుల వాదింపంగనేర్తును
పరిహసించెదరే.

అనుచు భక్తితో విన్నవించెడు
విష్ణు చిత్తులగాంచి శ్రీవట
పత్ర శాయియు దరహసితుడై
ఆజ్ఞగానుడివెన్.

విష్ణు చిత్తా నీవెవండవు
ఇందు నీవునిమిత్త మాత్రుడ
వంతనేనడిపించు వాడను
అన్నిటను నేనే.

శంక వీడుము జంకు వలదోయ్
వెంట నంటీ నుండి యచ్చట
సర్వమును నే జూచు కొందును
నాదు అనసుమీ.

అనెడు స్వామితో మీదె భారము
ఆజ్ఞ నేతల దాల్చువాడను
సర్వమును సంరక్షజేసెడి
స్వామి నీవేనే!

అనుచునుండగ చనెను స్వామియు
స్వామి సాక్షాత్కారమునకును
వెరుగు పడెనా విష్ణుచిత్తులు
అంత తెలవారెన్.

కాల్య కరణీయముల దీర్చియు
స్నాన సంధ్యా వందనంబుల
జేసి శ్రీవట పత్రశయనుల
నాజ్ఞ మేరకునూ.

రాజ్య సభలో ప్రవేశించెను
సభలొ పండితజనములండిరి
మంత్రులును ప్రతి వాదులతోనా
సభయు వెల్గొందెన్.

పట్టు శాల్వాల గప్పుకొనియును
మకర కుండల సింహమూతుల
కడియములు, మెడ స్వర్ణహారాల్
మెరియుచుండంగన్.

వాదప్రతి వాదనలసల్పుచు
పండితోత్తములచటనుండిరి
వాద ప్రతి వాదనల వినుచును
అబ్బురం పడిరీ.

అట్టి సభలో నడుగు మోపెను
భక్తు డౌనా విష్ణు చిత్తుడు
అతని జూచిన వార లెల్లరు
అబ్బురం పడిరీ.

ముతక బట్టలు పట్టె నామాల్
తులసి మాలలు పురః శిఖయును
ఎట్టి ఆడంబరము లేనీ
విష్ణు భక్తుండౌ.

విష్ణు చిత్తుల వారు సభలో
రాగ అభ్యాగతః స్వయం
విష్ణు వంచును పాండ్య వల్లభ
శెల్వ నంబులునూ.

ఎదురు నేగియునతుల జేసియు
అర్ఘ్య పాద్యాదుల నొసంగియు
ఉన్నతాసన మందు వారిని
గూర్చొనంజేయన్.

అపుడు సభలో నున్న పండితు
లోర్వ లేకను ఇపుడు సభన
గ్రానసంబున గూర్చొ బెట్టిన
ఇట్టి బాపండున్.

వేద వేదాంగముల నేర్చెనె
తర్క మీమాంసములు చదివెన
సంధ్య వార్చుటనైన నెరుగమె
తగునె పూజింపన్.

ఇతని వృత్తిని నెరుగు వారము
తోట యందలి పూల చెట్లకు
నీరు వోయచు విరుల గోసియు
దండ లందముగన్.

అల్లి శ్రీవట పత్ర శాయికి
నొసగుచుం గాలంబు గడుపును
మాదు మ్రోలను శూద్రప్రాయుడు
ఎందు మము మించున్.

ఇతని సింహాసనమునందున
మీరు గూర్చొబెట్టి మమ్ముల
నిటుల నవమానించతగునా?
ఎటుల సైరింతుమ్.

ముందు వెనుకల నరయలేకను
జంకు గొంకుల వదలి విద్వ
న్మన్యులెల్లరు జేయు నిందల
మనము వ్యధనొందన్.

అపుడు సంపత్పూర్ణులెంతో
సహనమును బాటించి వారికి
బదులు పలుకక విష్ణు చిత్తుల
వంక జూచుచునున్.

విష్ణు చిత్త! మహానుభావా!
వేదముల ప్రతి పాదితంబౌ
తత్వ పరతత్వముల నిచ్చట
నిర్ణయించవలెన్.

కారు లాడిన పండితుల్నాట
అతని వాదన నొప్పు కొంచును
పాదములపై ప్రాలి వేడిరి
తప్పు క్షమియింపన్.

ఎంత యొక్కటి జరిగె సభలో
తోరణ స్థంభముకు గట్టిన
విద్య శుల్కము జారి పడెనా
భక్తవరు మ్రోలన్.

భగవ దాజ్ఞగ దలచి దానిని
పొంది రప్పుడు విష్ణు చిత్తులు
విష్ణువావేశించి యుండిన
విష్ణు చిత్తుండున్.

ప్రభువు వల్ల దేవ ప్రభువుల
సంతసము వర్ణింప దరమా!
చత్ర చామర పల్ల కాదుల
భేరి కాహళముల్.

భద్ర గజముల దెచ్చి వాటికి
స్వర్ణగంటల గొలుసులందెల
పట్టుజలతార్ వస్త్రములను
బారులను గట్టీ.

భేరి మర్దల కాహళంబుల
భద్రగజ ఘీంకార రవముల
వేద పండిత స్వస్తి పఠనాల్
భూరిగన్ నిండన్.

కూర్చొ బెట్టిరి భద్ర గజమం
బారి యందున, వీథి వీథుల
రాజలాంచన ములతో భక్తుని
త్రిప్పు చుండంగన్.

కనులు రెండును చాల కుండెను
అట్టి ఊరేగింపు జూడగ
నాడయోధ్యలో రామ భద్రుని
ఉత్సవంబనగన్.

దిక్కులన్నియు తేజ రిల్లెను
వీధు లన్నియు నిండె జనముతొ
విష్ణు చిత్తుల వైభవముతిల
కించి నారచటన్.

ఇసుక వేస్తే రాల నట్టుల
జనులు పరివేష్ఠించి యుండిరి
ఆమహోత్సవ వైభవముగన
నమరు లరుదెంచన్.

విష్ణుచిత్తుల వైభవముగన
భూమి నీళా సతుల గూడియు
శంఖ చక్రాధ్యాయుధములతొ
గరుధ వాహనుడై.

రెప్పవేయక నిత్య సూరులు
స్తోత్ర పరులై భక్తి తోడుత
ఎవరి సుందర విగ్రహంబును
గాంతు రాసక్తిన్.

అట్టి దర్శన భాగ్య మబ్బెను
అచటి జేరిన వారికెల్లను
ఆహా! ఎంతటి భాగ్య శాలురొ
అరయ వారెల్లన్.

కోటి జన్మలు కోరి నోమిన
దుర్ల భంబౌ దర్శనంబున్
అందరును సాష్టాంగ డిరా
ఆది నాథునకున్.

దివ్య మంగళ విగ్రహంగని
తన్మయత్వము నొంది, భ్రాంతితొ
మునిగి ఆనందంబు నొందియు
ఇటుల మది తలచెన్.

ధన్యుడనునేనైతి ననగా
జన్మ సార్థకమయ్యె నేడే
కోటి యజ్ఞ తపఃఫలంబును
కోరకే దొరకెన్.

ఎంత సుందరమైన వాడో
చూడ జూడను తనివి దీరదు
దృష్టి దోషము కలిగెనేమో
దృష్టి తీయుదునా!

అనుచు గజమునకున్న గంటల
రెండు చేతుల బట్టి నెత్తియు
గణగణం ధ్వనులుప్పతిల్లన్
మంగళము బాడెన్

కలువ రేకుల కనుల వాడా!
నీలమణి సదృషపుదేహా
లక్ష్మి వక్షస్థలము గల్గిన
వాడ పల్లాండున్.

కోటి సూర్య ప్రకాశ దేహా ?
సృష్టి స్థితిసంరక్షకుండా!
ధరను ధర్మము నిల్పువాడా!
నీకు పల్లాండూ.

మల్లులౌ చాణూరముష్టిక
అసురులను నంతంబు జేసిన
దృఢము లౌ బాహావుల గల్గిన
వాడ పల్లాండున్.

ఎఱ్ఱి తమ్ముల వంటి మీదగు
మృదు పదంబుల సోయగంబును
సర్వదా సుస్థిరము నుండగ
శెవ్వితిరు క్కాప్పున్.

నీదు కుడివక్షమున నుండెడి
శ్రీ మహా లక్ష్మకిని శేషుకు
గరుఢ విష్వక్సేనులకును
గల్గు పల్లాండున్.

శంఖ చక్రాధ్యాయుధములకు
నిత్య సూరీ భక్తీ వరులకు
మాదుస్వామీ భక్త వరదా
సతము పల్లాండూ!

పదియు రెండుల పాశురంబుల
మంగళాశాసనము జేయుచు
తనువు మరచిన విష్ణు చిత్తుల
స్వామి దీవించెన్.

విష్ణు వంతర్హితుడు నవగా
విష్ణు చిత్తులు తేరుకొనిరీ
ఎల్ల వారలు తెప్పరిల్లరి
అంత రాజేంద్రుల్.

విష్ణు చిత్తుల శిష్యుడయ్యెను
తగిన సత్కారముల జేసియు
విద్య శుల్కము నొసగి గురువుల
సాదరంబుననూ.

విల్లి పుత్తూరునకు బంగరు
పల్లకిన గూర్చుండ బెట్టీ
వెంట మందీ మార్బలంబుల
గూడ దానంపెన్.

విల్లి పుత్తూరందు శ్రీవట
పత్ర శయనుడు అర్చకులగని
ఘనముగా స్వాగతము నొసగుచు
నిటకు తెండనగన్.

అర్చక స్వాములు నునపుడే
శేషవస్త్రాల్ తీర్థముంగొని
విష్ణు చిత్తుల కెదురు జనివిన
యంబు నిట్లనిరీ.

స్వాగతంబో విష్ణు చిత్తా !
స్వామి పంపిన స్వాగతంబిది
ఇదిగో తీర్థము శేషవస్త్రము
లింపునంగొనుమా.

అనగ భక్తితొ వానినింగొని
ఆలయంబున స్వామినింగని
పసిడి పదముల వ్రాలి యచ్చటి
గాథ వినిపించెన్.

మధుర వల్లభదేవుడొసగిన
విద్య శుల్కము స్వామి కొసగియు
నమమ సంప్రదదేయటంచును
సర్వ మర్పించెన్.

రాజ దర్బారందు శృతి స్మృతి
ఉపనిషద్యితిహాసములతో
చక్కగా పరతత్వ నిర్ణయ
మతడు సల్పుట చే.

భట్ట నాథుండనెడి బిరుదును
అట్టి సభలో బొందె నాతడు
విష్ణువును మదినుంచు కతనన్
విష్ణు చిత్తుండూ.

విష్ణువును దీవించి నట్టిదె
తిరుప్పల్లాంనెడి పదములు
పెరియ ఆళ్వార్ తిరుమొళి యను
పేరవింకొకటి.

నంద వ్రజమున బాలకృష్ణుని
చిన్ని చేష్టలు మనము నిలువగ
భక్తి భావము పొంగ(పొరలగ) కృష్ణుని
లీలలంబాడెన్.

అరయగా నారాయణునకే
మంగళాశాసనము జేయగ
పెరియ ఆళ్వారంచునతనిని
అందరుంగొల్వన్.

హరిః ఓం యని సంస్కృతంబును
తిరుః పల్లాండనుచు ద్రావిడ
పఠనమును మొదలిడదురయ్యది
అతని మహిమంబే.

ధన్విపురవట పత్రశయనుని
పూల మాలల నలర జేయుచు
ఆడి పాడీ అందరుంగన
అతనిలో జేరెన్.

గరుడి నంశచె జ్యేష్ఠ స్వాతీ
ధన్వి పుర సంజాతులై హరి
మామయౌపురః శిఖులు విష్ణూ
చిత్తు సేవింతున్.

వేద వేదాంగముల నెవ్వరు
గురువులేకయె విష్ణు కృపతో
పొంది మామగ పిలువ బడిరో
అట్టి భూసురులౌ.

విష్ణు చిత్తుల దివ్య తిరువడి
గళిని నే సేవించి వ్రాసితి
చదువు వారిని, విన్న వారిని
విష్ణు వేఁబోచున్.

ఓం తత్సత్ శ్రీ యువం జ్యేష్ఠ బ॥
ఇందు 26.6.1995



ఓం శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః
శ్రీ శూడి కొడుత్తనాచ్చియార్
(శ్రీ గోదాదేవి)

శ్రీ కరంబగు విల్లి పుత్తూర్
ధన్వి నగర మటంచు బరగును
అందు శ్రీవట పత్ర శాయీ
వరదుడై యుండెన్.

విష్ణు చిత్తుండనెడు బ్రాహ్మడు
కాంత మతియను సతిని గూడియు
సంతసంబున గడుపు కాలము
నను దినంబుననూ.

ఉషః కాలమునందె లేచీ
స్నాన సంధ్యల దీర్చు కొనియును
మాలికా సంసేవనంబున
మాధవుంగొల్చున్.

తోట కేగియు మడులగట్టియు
వటపెరుం గోయిలుని దలచుచు
నీరు వోయుచు విరుల దురిమియు
హారముల గూర్చున్.

హరియు నాదేశించె ధరణిని
ధరణి పాదున పాప గానయి
పారు నింటను పెరుగ గోరియు
పాదు నందుండెన్.

నిత్య కృత్యము పొరునకునున్,
ఒక్కనాడొక త్రవ్వ్ గోలతొ
తులసి మొక్కకు పాదు జేయగ
పాప గనిపించెన్.

పాదు నందున పట్టి దొరకెను
పొరుడతి మోదమున నింటికి
జనియు కాంతా మతిని జీరియు
బాలికన్నొసగెన్.

సంతు లేదను భ్రాంతి వీడుమ
కంతు జనకుని వరఫలంబౌ
పాపనికనీ కంటి పాపగ
సాకు మీా వింకన్.

లక్ష్మి భూదేవ్యాంశగల్గిన
పట్టి మన పుణ్ణెముల పంటా
కంటి నింటికి నెంతో వెలుగౌ
కాంత గమనింతే.

శుక్ల పక్షాషాఢ కర్కట
పూర్వ ఫల్గుణీ భౌమవాసర
శుభ దినంబున ప్రభవమొందెను
మనను తరింయింపన్.

వైష్ణవుల కాహ్వాన మంపెను
వారి నందర బిల్చిముదమున
మంగళోత్సవములను జేసియు
గోదయని బిల్చెన్.

కోరు సంపద లొసగు నట్టిది
కోరినంతనె  వరములొ సగున
టంచు వల్కియు బాల సారెను
గోద పేరిడియెన్.

యాగ భూమిన సీత దొరకను
జనకుడెంత ముదంబునొందెనొ
అంతటా నందంబు నొందెను
విష్ణు చిత్తాళ్వార్.

లాల పోసిరి జోల పాడిరి
పాల బువ్వల బువ్వబెట్టిరి
విష్ణు చిత్తుల తనయ కబ్బెను
భక్తి భావంబున్.

ప్రాకునప్పుడు కూర్మ రూపుని
తప్పటడుగులు వేయ వామను
పండు కొనవట పత్రశాయిని
భక్తితో దలచున్.

విష్ణు చిత్తులు నిష్ట తోడుత
పంచ సంస్కారముల జేసిరి
నాట నుండా చార్య నిష్టతొ
నామె వికసించెన్.

బాల భక్త్యా దులను జూచీ
అంద రాశ్చర్యంబు నొందగ
వచ్చి రానీ మాటలతొనా
బాలమురిపించున్.

తల్లి దండ్రీ పెంపకంబున
పిల్ల పెరిగీ పెద్దయయ్యెను
కనులు రెండును చాల వాయెను
ఆమె దిలకించన్.

పూర్ణ చంద్రుని మోము, కలువల
రేకులంబోలియును కన్నులు,
భ్రమర కుంతల పద్మ గంధీ,
పద్మినీ జాతీ.

అట్టి గోదాదేవి తండ్రికి
నను దినంబును దండలల్లుట
యందు సాయము జేయుచుండున్
హరి హరీయనుచున్.

ఆట పాటల మాటలందున
శ్రీహరీ సంకీర్తనంబే
జేయు తండ్రియు ముదము నొందును
బాలికంగాంచీ.

స్త్రీలకేవిరులనిన నిష్టము
బాలికల కత్యంత ప్రీతీ
కాన నా గోదామ తల్లీ
ఇటుల మదిదలచెన్.

మల్లె మొల్లావిరుల దండల
స్వామి వట పత్రునకు వేయగ
శోభతోనత డెంతో మెరయును
చూడ సొంపౌనే.

అట్టి దండల సిగల ముడిచీ
గళము నందున వేసి యద్దము
నందునం దనసొగసు గాంచీ
అర్పణం జేతూ.

నంచు నట్లే దాల్చి నద్దము
ముందు గాదానిల్చి, యందున
కృష్ణనింగని వెఱుగు పడితా
నిట్లు గొనియాడున్.

సొగసు గాడా ! కృష్ణ దేవా !
నేను దాల్చిన దండలివిగో!
ప్రేమ భక్తియు పొంగి పొరలగ
నీకు నర్పింతున్.

పాలు పెరుగుల ద్రావినాడా!
కుబ్జ గంధము గొన్న వాడా!
మల్లులను ఖండించు వాడా
మమ్ముబ్రోవగదే.

యనుచు మురియుచు దాల్చుదండల
తండ్రి జూచను భయము గదురను
దండలన్నియు విప్పిబుట్టలో
ఎప్పటిన్నుంచున్.

భట్ట నాథులు భక్తితోడుత
దేవళంబున కేగి వటప
త్రేశు గాంచియు స్తుతుల జేసియు
పాశురాల్ పాడున్.

ఒక్క నాడా దండలందున
కేశ పాశము గాంచి చాటున
గోద కృత్యము గనియు వ్యధతో
కూతుతో ననియెన్.

తగున నీకిది నాదు తనయా
తగదు నిర్మాల్యంబు నొసగుట
నిగమ సంచారునకు నిట్టుల
జేయ తగునమ్మా!

నీవు శ్రీ లక్ష్మ్యాంశ జాతవు
నీవె యిట్టుల జేయ తగునా!
వేదవేద్యున కెటుల నొసగుదు
నీదు నిర్మాల్యమ్.

ఇదియు నపచారంబు సుమ్మా
స్వామి కర్పనజేయకేమన
మెట్టి వస్తువు గొనగ దగదు
ఆతడే మనునొ.

తెలియకేజేసితివి నీవు
తెలియకే వేసితిని నేను
తెలియకే జేసినందోషము
తెలియనేరండా!

ఇట్టి దోషమ్మెపుడు జేయకు
దాను దోషము దండముకుసరి
నేడే స్వామికి మాల సేవను
మాని వేసెదనూ.

మాలి కార్చన మాని వేయగ
స్వామి శ్రీ వట పత్ర శాయికి
మాలి కాడుపవాసమవగా
మదిన నిటు దలచెన్.

గోద సంగతి నెరుగ డీతడు,
నాథ లీలల తెలియ నేరడు,
బాదు నొందుచు నుండె నీతని
బాధ మాన్పెదనూ.

నంచు పెర్యాళ్వార్లతోననె
ననుది నంబును క్రమము దప్పక
పరిమళంబుల గుప్పు దండల
తెచ్చి వేయుదువే.

ఏలమాలితి వయ్య నేడున్
నీదు దండల కెదురు జూచితి
క్రమము దప్పుట న్యాయ మేనా !
తెమ్ము దండలనూ.

అనెడు స్వామితో విష్ణు చిత్తులు
బాధ తప్తా హృదయు లయ్యును
స్వామి! శ్రీవట పత్ర శయనా !
నేను క్షంతవ్యున్.

నిత్య విధి  కైంకర్యమునకై
కూర్చి యుంచిన మాలలన్నిట
అభము శుభముల నెరుగనట్టీ
పట్టి ధరియించెన్.

తప్పు జేసెను నాదు దుహితయు
తప్పు నీవు క్షమింపవయ్యా!
పాపరేణిబరుండు వాడా
భారము న్నీదే.

మాలలన్నియు శేషముల్నవ
మాలలెటుల నొసంగ వాడను
మలిన మౌనా మాల లెట్లుస
మర్పణం జేతున్.

ఖిన్న వదనుడు నయ్యు బల్కెడు
విష్ణు చిత్తుల జూచినగుచును
నాదు భక్తా! విష్ణు చిత్తా!
బాధ యేలనయా!

నీదు కూతురు గోద దేవీ
ధరిణీయంశజురాలు, గానా
ఆమె కొప్పున ముడిచి విడిచిన
వానినే దాల్తున్.

వాటి గంధమెమంచి గంధము,
వాటి అందమె అందమరయను,
అట్టి వానినె నాకొసంగుము
నరయనే దాల్తున్.

ఇందు నీదపచారమందువ
అందు వాడను నేనె గానా
సందియము వలదంచు వటప
త్రుండు వాక్రుచ్చెన్.

విష్ణు చిత్తులు ముదము తోడుత
నింటి కరుదెంచియును ప్రేమతో
అమ్మనాతపమును ఫలించెను
నీదు జన్మమునన్.

విరుల దండల హరియు దెమ్మనె
పరమ ప్రీతిని దాల్తు తాననె
నిరతమునునా విరుల మాలల
దాల్చి నాకొసగన్.

వానిగొనినే వేతు నతనికి
ననుచు తండ్రియు జెప్పగోదయు
తనచె నాముక్తంబు లొనవె
నర్పణంజేసెన్.

నాటి నుండా ముక్త మాల్యా ద
యనెడి పేరను పిల్వబడియెన్
ఏమి వింతో శేషి శేషము
దాసునకు గ్రాహ్యమ్.

ఇచట నిదివ్యత్యస్తమైనది
సర్వశేషికి గ్రాహ్యమైనది
శేష భూతీ గోద శేషము
హరికి గ్రాహ్యంబున్.

గోద శ్రీ భూనీళ యంశయో
హరికి పరమై కాంతురాలగు
ఉరము నందలి సిరియొ మరినే
నెఱుగ నితరంబున్.

భక్తి భావము పెంపునొందెను
యుక్త యౌవన మందు కొనియా
సక్తి శ్రీ హరి యందు రక్తిని
భక్తినిం గల్గెన్.

యౌవనా విర్భావ మొదవిన
యువతి సౌందర్యంబు సురలకు
బొగడ తరమా! ఇంక మనుజుల
కలవి ఎటులౌనూ!

హరిని నురమున కరము నిలుపుచు
కామనాశృంగార తలపుల
నింపి నాతని యందె తలపును
నిలుపు చుండెపుడున్.

పురుషునకు పురుషునకు ప్రేమయు
స్త్రీకి స్త్రీకిని గలుగు ప్రేమయు
మెరక కెక్కెడు నీటి వోలె ప్ర
యత్న సాధ్యంబౌ.

పురుషునకు స్త్రీ యందు ప్రేమయు
స్త్రీకి పురుషుల యందు ప్రేమయు
మిట్ట నుండీ పల్లమునకును
జారు ఝురివోలెన్.

నంద వ్రజమున నంద యాదవు
పుంగ వులకును గల్గు ప్రేమయు
మించి కృష్ణుని ప్రేమ నించిరి
గోపి కాంగనలున్.

అనుచు వ్యాసుడు చెప్పినట్టుల
కృష్ణ విరహము దుస్సహంబవ
నతని నెట్టుల పొందు దనుచును
గోద యెదతలచెన్.

నల్లనయ్యకు నీళ జోడున్
నీళ స్థానము నెటుల పొందుట
పాణి గ్రహణమటంచు జరిగిన
హరితో జరుగవలెన్.

కొంత కాలం బిటుల గడచెన్
తండ్రి భాగవతంబు జెప్పగ
తన్మయత్వము నొంది వినగా
నందు నిటులుండెన్.

భర్తగా శ్రీ కృష్ణు గోరిన
గోపి కాంగన లెల్ల కాత్యా
యనిని గొల్చి తరించి నారలు
ఋతువు హేమంతమ్.

శ్రవనముల కమృతోపమానము
నవగ గోపిక భావముంగని
చెలుల నందర బల్చి వారితో
ముచ్చటించుటలున్.

మార్గ శీర్షము వచ్చె గనుడీ
మంచి దౌనీ ధనుర్మాసము
మగువలారా తానమాడీ
హరిని గొల్చె దమా!

నీల ఉరమున తలను మోపీ
హాయిగా పవళించి యుండును
జాలమేలా! చెలియరమ్మా(లారా)
తూర్పు దెల వారెన్.

బలియు నణచెడి పాదముంగని
బ్రహ్మ భక్తిని కడిగె గంగతొ,
అట్టి నీటిని స్నాన మాడగ
అమ్మలూ! రండూ!

నీల మేఘుని దేహమందున
మెరయు నాభరణముల వోలెను
మెరయుచును గురియుచును నున్నా
మేఘునిం గనరె.

కాల్వలందున నీరు పారెను
కలువ లన్నియు విచ్చి యుండెను
కలువ కంటీ! కొలువ రాగదె
కలువ కను వానిన్.

ద్వార పాలకు లార వినుడీ
నంద నందను గొల్వ వచ్చితి
మందరము, ముదమొందస్వామికి
విన్నవించండీ.

చెలుల గూడియు చెలువు మీరను
ధనువు నందున వ్రతము జేయుచు
పాశురాల్ ముప్పదుల జెప్పెను
భక్తి పొరలంగన్.

నాచ్చి యార్ తిరుమొళి యటంచును
నూటనలువది మూడు పాశుర
ములను జెప్పెను దేహధారుల
జన్మ తరియింపన్.

చంటి బిడ్డకు తల్లి పాలెటు
దేహ పోషక, మటుల నాత్మకు
రుచి కరము చైతన్య మైనవి
ఉభయ తారకముల్.

నాట నుండియు ధరను నెల్లరు
మార్గ శీర్షము నందు వ్రతమును
విష్ణు వాలయములను జేతురు
వైష్ణవుల్ భక్తిన్.

గడిచె కాలము నీడు వచ్చెను
అడిగి నారలు నచటి వారలు
కూతు పెండ్లిని ఎపుడు జేతువ
టంచు దినదినమున్,

వంత నొందెను స్వాంత మందున
చెంత జీరెను గోద దేవిని
శిరము మూర్కొని బుజ్జగించుచు
అమ్మ! వినుమమ్మా!

ప్రాయమా అరుదెంచె నీకును,
నీదు భావం బెరుగ నైతిని
కాకులౌలోకులను గనుమా
తలపు నెరిగింపూ.

తండ్రి మాటలు వినియు గోదయు
చింత వలదో తండ్రి వినుడీ
నాదు మనమూ! మాధవునకే
నర్పణం జేతున్.

అతడె నావల్లభుడు తండ్రీ
వ్యాకులము మానియును గోకుల
బాలకుని పాలకుని నమ్మిన
నతడె నన్నేలున్.

అనగ భక్తితొ విష్ణు చిత్తులు
దివ్య దేశములందు వెలసిన
భవ్య రూపుల గుణ గణంబుల
పాడి వినిపించెన్.

వరుని రూపము కన్య గోరును
నూట నెనిమిది దేశములలో
వెలసి యుండిన వారి జూపుడు
తనివి నొందెదనూ.

తనయ కోరిక వినన భక్తుడు
భక్తితో ప్రార్థించె స్వాముల,
వారి భక్తిని మెచ్చి నొసగిరి
దివ్య దర్శనమున్.

వివిధ రూపుల వెలసి యుండిన
విష్ణు వపుడట నటుల నగుపడ
అందరిని దర్శించి రంగని
అందముంగాంచెన్.

అంగరంగా వైభవుండౌ
మంగళాంగుడు రంగ నాథుని
యందు చిత్తము హత్తు కొనగను
మోహపరవశమై.

యుండ తక్కిన స్వాములంతట
అందరము తా మొక్కరేయని
స్తుతులనందుచు నవ్వు కొనుచును
మాయమైరచటన్.

పురుషులకె మోహమును గూర్చెడు
అంద చందవి రాజితుండౌ
రంగ నాథులు గోద దేవిని
మోహపరచియునూ.

మాయ మవగను మదికినేకా
లంబ మాయెను రంగ నాథుడు (ధాముడు)
అతడు రాడే? కరము బట్టడె
వెతయె నిండారెన్.

నిదుర రాదే, తిండి తినదే!
మదిని నెప్పుడు పొదలు వ్యథతో
తోట కేగియు విరుల తోడుత
ముచ్చటించునుగా.

మదన జనకుని మదిని దోచిన
మగువ మదనుని శరము జిక్కియు
చిక్క గొంచిన భట్ట నాథుడు
మదిన నిటు తలచెన్.

క్షుద్రుడను నతి పేదయౌనే
సిరికిమగడే నతనికొసగుదు
నాదు పట్టిని సాధ్యమేనా?
పెండ్లి ఎటు జరుగున్.

ఇటుల దలచియు నేగెగుడికిని
స్వామి వట పత్రులను జూచుచు
కనుల కన్నీరొలుకు చుండగ
స్వామి యిదొ వినుమా!

ఇచట నీవు సుఖంబు నుంటివి
రంగడందు సుఖంబు నుండెను
నాదు తల్లియు బాధ నొందెను
ఇటుల తగునయ్యా?

అనుచు కన్నీర్నించు నతనితొ
నగుచు స్వామియు ననియె, భక్తా
విష్ణు చిత్తా! చింత వలదో
ఇంటి కేగు మికన్.

రంగ నాధుడు తగినవరుడే!
ఆమె కడుసుగుణాల రాశీ!
ఆయనోగుణ క్రీతు డౌనే
నరయ క్షుద్రుండన్.

అతడు బ్రహ్మో శాదులకును
యోగులకు దేవాదులకును
అందనట్టిదసాధ్య ఫలమౌ
నాదు సాధ్యంబా.

ఎటుల నొనగూడునును నిద్దీ
ఏమి సేతువొ రంగ నాథా!
ఇటుల దలచుచు భట్ట నాథులు
ఇంటి కింజనియెన్.

రంగ నగరము నందు రంగడు
అర్చకులతో ననియె నిట్టుల
ఛత్ర చామర స్వర్ణ ఆందో
ళికల గొని పొండూ.

విల్లి పుత్తూ ర్నకును వెంటనె
రాచమర్యాదలతొ గోదా
విష్ణు చిత్తుల తెండి, వేగమె
యనగ వెన్వెంటన్.

రత్నమయపల్లకిని గొంచును
స్వామి యానతి నర్చ కోత్తము
లరిగి నారటు భట్టనాథుల
నింట ముందు గనున్.

విషయమెరిగిన విష్ణు చిత్తులు
అవధి లేనీ ముదము తోడుత
ఎదురు నేగీ ఎల్ల వారికి
స్వాగతం బొసగన్.

చేసిరెన్నియొపిండివంటల
తృప్తిగా వారారగించగ
రంగనీయానతని దెల్పిరి
వినయ వినమితులై.

వెంటనే మధురాధిపతికిని
ఇట్టివార్తను దెల్పిరమ్మని
చెప్పు డంచును బంపె శిష్యుల,
గుడికి తాజనియెన్.

స్వామి! శ్రీవటపత్రశయనా
రంగ నాథుడు రమ్మననియెన్
విన్న వించగ వచ్చె దాసుని
విన్నపము వినుమా?

అనగ స్వామియు అస్తుయనియెను
పాండ్య వల్లభు డేగు దెంచెను
ఇట్టి వార్తను వినిన వారలు
పోవసిద్ధమవన్.

రథ గజాతురగాది చతరం
గంబులును వెన్నంటి రాగా
పట్టు పీతాంబరము గట్టియు
నెక్కె పల్లకినీ.

అందరంతట బయలు దేరిరి
విల్లి పుత్తూర్నుండి శ్రీరం
గమార్గంబయ్యె మార్గము
అద్భుతంబవగన్.

మార్గమధ్య వితానశాలలు
చలువ మంటపములును వెలసెను
పయన మందునలోపమొక్కటి
లేని యుండటులన్.

గోద శ్రీ రంగేశు పెండ్లిని
గాంచి ధన్యుల మగుద మంచును
చోళ పాండ్యా దేశ ప్రజలతో
ఎల్లెడన్నిండెన్.

రంగ ధాముని పంపునన్నట
పట్టణంబును తీర్చి దిద్దిరి,
చల్ల బడియెను ప్రాంగణంబులు
ముత్తయపుముగ్గుల్.

వేయ బడియును దిద్ద బడియెను
గృహములెల్లయు సుందరముగా
ఎచట జూచిన నెచట విన్నను
గాన మాధురులే.

పట్టు చీరల రెపరెపలునూ
నీల వేణుల మల్లె మొల్లలు
అగరు ధూమ సువాననలునట
నావరించెనటన్.

రంగనాధుడు మనుజ కన్యా
రత్నమును చేపట్టు దృష్యము
ఎంతొ వింతోజూత మంచును
అందరును జేరన్.

నిచుళ పురమును విడిది జేసిన
లగ్న సుముహూర్తంబు కాగను
బంగరుం బల్లకిని నెక్కను
బాల పొంగుచునూ.

భేరి కాహళ మర్దళంబులు
భూరిగా మ్రోగింపబడియెను
నట్టు వాంగన లెల్ల రాడిరి,
స్వస్తి వాచనముల్.

చదువు చుండిరి బ్రాహ్మణుల్నట,
వేద పారాయణము జరిగెను
వైష్ణవుల్ దివ్యప్రబంధము
వాసిగా చదువన్.

గాయకులు గానంబు జేసిరి,
విరుల వర్షము గురి సెనంతట,
గోపుర ప్రాకారములనెగ
బ్రాకి నారచటన్.

బ్రహ్మఇంద్రేశానులందరు
గరుఢవాహను వెంట నుండగ
పార్వతీ వాగీశ్వరీశచు
లపుడు వరయూరన్.

మేల మాడుచు మేలి ముసుగును
దిద్ది నారలు, తరలి వచ్చిరి
అంబరా చుంబితములోయన
నచటి పందిళ్ళున్.

ప్రాగ్దిశాంగన ఫాల తిలకము
వోలె భానుడు పొదలె నింగిన,
వేదవిదులౌ బ్రాహ్మణుల్నట
మంత్రముల్జదువన్.

స్వర్ణ పల్లెర మందు రంగని
బంగరుం బాటదముల గడిగెను
పొంగెడెందము, జన్మ చరితము
విష్ణు చిత్తులదౌ.

రంగ నాథా ! పాణి గ్రహణము
జేయు గోదాదేవి దిచ్చట
అనను శ్రీరంగేశుడట్టులె
కరము జేపట్టెన్.

గాంచి రచ్చటి వారలెల్లరు
కాంచ నాంబర ధారి సొగసును
సొగసు జూడగ చాల వేయని
సర్వులను కొనిరీ.

పాణి గ్రహణము జేసె స్వామియు
హర్షపులకిత యయ్యె గోదయు
శేషహోమాంతంబు వరకును
కార్యక్రమమయ్యెన్.

మహా దాశీర్వచనమైనది
గోద సంకల్పంబు దీరెను
సంతసంబును వెల్లివిరియగ
అంజలిన్మోడ్చి.

రంగ నాథుల కరము బట్టి
గర్భ గుడిలో నేగి యచ్చట
శేష తల్పము నెక్కి అప్రా
కృతము రూపమునౌ.

దివ్య మంగళ విగ్ర హంబున
లీన మవగను విష్ణు చిత్తులు
మోద ఖేదము లొందు చుండెను
ముద్దు బిడ్డకునై.

ముద్దు బిడ్డయదృష్యమైనదే!
ఎపుడు జూతునటంచు దలచియు
కనుల జలజల నీరు రాలన్
బాధ నొందుచునూ.

అమ్మ! గోదా! తగునటమ్మా!
వలదు నన్వీడగను! ధర్మమ!
పెంచి నాడనె ప్రేమ తోడుత
పేదనేనయ్యున్.

రంగ నాథా! న్యాయమాయిటు
లంగనను గోని పోవతగునా!
మంగళాంగా! నెటుల నోర్తును
పొంగు శోఖంబున్.

అనుచు విన్నదనంబు నొందిన
విష్ణు చిత్తుల గాంచి యిట్లనె
ఓ మహాత్మా నాకు మామవు
పాల సంద్రుని గా!

రసమయంబుగు సమయ మియ్యది
నాదు సన్నిధి నీదు కూతురు
గోద సుఖముల ననుభవించను
శోఖముందగునా!

నీదుమది మము జూడగోరియు
నపుడు మేమరు దెంతు మటకును
హాయిగా సౌఖ్యంబు లొందుదు
మచట నల్లుని గాన్.

భట్టనాథా! ఏగు మింకను
విల్లి పుత్తూరునకు, శ్రీవట
పత్ర శాయికి పూలమాలా
సేవ జేయు మికన్.

అతడెనేనూ! వలదు శోఖము
అనుచు బంగరు శాల్వ గప్పియు
శ్రీశఠారీ పుష్పమాలా
లంకృతింజేసీ.

ఆజ్ఞ నొసగను విష్ణు చిత్తులు
వల్లభారాయనితొ పట్టపు
టేను గెక్కియు విల్లి పుత్తూర్
జేరెకడుముదమున్.

మధుర జేరెను వల్లభుండు
అష్ట మావరణంబు నందున
రమ్యమగు నొక నాలయంబును
నిష్ఠ మైనటులన్.

కట్ట జేసిరిరంగ నాథులు
అంద మౌనా దేవళంబున
దివ్య సుందరి గోద నటనా
విష్కరించియునూ.

తనకు వలెనే ధూపా దీపా
నిత్య ఉత్సవములను జేయగా
శాసనంబును జేసే స్వామియు
నాడు మోదలుకొనీ.

దివ్య తిరుపతులందు నిత్యము
దేవి గోదా! విగ్రహమునకు
స్వామి కెట్టుల పూజ జరుగునో
అటులనే జరుగున్.

కలిచె దోషా దూషితంబౌ
ఈజగత్తును బ్రోచెనాండాళ్,
అటులె ఆముక్తంపుమాల్యద
యనియు పేరొందెన్.

పాండ్య దేశమునందు తులసీ
వనమునందున పూర్వ ఫల్గుణి
కర్కటంబున ధరణి యంశను
జనన మొందినయా!

రంగ నాయకి గోద దేవిని
చిత్త మందున భక్తి పొరలగ
తలచి సాష్టాంగంబునను నే
సాగిలంబడుదూ.

మంగళము మా తల్లి గోదా!
మంగళము శ్రీ రంగ నాయకి !
మంగళము శ్రీ నాచ్చియారే!
మంగళము సతమున్.

-ఓం తత్సత్-



శ్రీ లక్ష్మీ హయగ్రీవాయనమః

# శ్రీ తొండరడిప్పొడియాళ్వార్

సకల సస్య శ్శోభింతంబై
భ్రాంతి కాశ్మీరంబు వోలెను
చోల దేశంబునకు మండం
గుడియు వెలుగొందున్.

కలదు కావేరికిని నుత్తర
తీరమందున గ్రామ మందున
నేడు వందల బ్రాహ్మణులతిరు
మాళిహల్ నుండెన్.

అందు ఋక్శ్యాఖీయులుండిరి
యజుస్సామా ధర్వ నీయులు
నాల్గు శాఖల నభ్యసింతురు
నను దినంబచటన్.

అందరును పరతత్వ చింతవి
చారణా పారీణులేయట
ధర్మ విధులౌ పురశ్శిఖులే
నచటి భూసురులున్.

వారిలో గల డొండు విప్రుడు
సంతు లేకను చింత వడియును
భార్యతో నారాయణాద్రికి
పయనముంజేసెన్.

నేటి కర్నాటకలొ గలదా
మేటి తిరునారాయణాపురి
మేలు కోట యెదాని పేరున్
మేలి కొటయదీన్.

శెల్వ పిళ్లై పేర నొప్పిన
అచటి సంపత్పుత్ర దేవుని
వేడె కొమరుని కోరి, మండం
గుడికి నిన్మరలెన్.

శెల్వ పిళ్లై వరము వలనను
పుత్ర రత్నోదయము నవగను
వేద అధ్యయనమున విప్రుడు
విప్రు గావలెనన్.

మరియు నారాయణుని కృపచే
పుత్రుడొదవిన కారణంబున
విప్ర నారాయనుడటంచును
పేరునుం బెట్టెన్.

జనన కాలము కలియుగంబున
నూట ఎనిమిదివత్సరంబులు
గడచి పోయిన పిదప ప్రభవను
నామ వత్సరమున్.

ధనుర్మాసా జ్యేష్ఠ నక్ష
త్రంబు శ్రీరంగేశు గళమున
వెలుగు వనమాలికయెనిట్టుల
ధరను జన్మించెన్.

అన్న ప్రాశన చౌలముపనయ
నాక్ష రాభ్యాసములు జేయగ
తండ్రి శిక్షణ యందు బాలుడు
సర్వమున్నేర్చెన్.

అన్న ప్రాశన మరయ భగవ
ద్గుణములనునను భవముగాగా
చౌల మైహిక విషయ రాహి
త్యంబుగా నవగాన్.

అక్షరాభ్యాసంబు నా పర
బ్రహ్మతత్వ విచార మవగా
పంచ సంస్కారోపనయనము
పరిణమించినవీ.

విప్ర నారాయణునకు విదిగను
మిగత నాళ్వారులకు వలనే
జేసే విష్వక్సేను లనరగ
పంచ సంస్కారాల్.

ఆళ్వారాదులు భగవదంశల
నవతరించిన వారు గానన్,
వారలందరు పాంచరాత్రా
గమ ప్రవర్తకులున్.

పాంచ రాత్రాగమా ప్రతి పా
దులకు తాపోర్ధ్వపు పుండ్రాల్
నామ మంత్రాయాగ మనియెడు
ఐదు సంస్కారాల్.

లేనిచో వైష్ణవము పూర్తిగ
రాదుగానను భగవదాదే
శమున విష్వకేస్సులరుదెం
చతని కింజేసెన్.

జ్ఞాన వైరాగ్యములు భక్తీ
భావములు నధికంబులవగా
పెండ్లి యెడవైముఖ్యుడునునై
తలచె మది నిటులన్.

రంగ నాథుని సేవజేయని
చూడనీ కైంకర్య భాగ్యము
నోచనీ జన్మంబదేలా
నేగుదటకనుచున్.

తల్లి దండ్రుల యానతింగొని
చేరె శ్రీరంగంబు నచ్చట
సప్త ప్రాకారముల చుట్టి ప్ర
దక్షణము జేసెన్.

గర్భగుడిలో రంగ నెదుటను
బోరగిలి ప్రణమిల్ల నప్పుడు
కుళాలిళిగర్ వాయలళిగర్
రూపముల జూపన్.

అట్టి దివ్యాంగంపు శోభను
తనివి దీరను గ్రోలి, భక్తియు
పొంగి పొరలగ నొందు చుండెను
పార వశ్యంబున్.

విష్ణు చిత్తుల భాతి తానును
విరుల దండల గూర్చి రంగని
కర్పణను జేయందలంచెడి
తలపునుంగల్గీ.

సుందరంబు పసందు మాలల
నందముగ తానల్లి రంగని
ఉరము శోభిలు నటుల వేసీ
తనివి తీరటులన్.

దివ్యమౌ దివ్యాంగ శోభను
రెప్ప వేయక జూచి భక్తీ
పారవశ్యము పొంగి పొరలగ
భక్తి గొనియాడున్.

సప్త ప్రకారముల తిరుగుచు
ఆర్తితోనా స్వామి జేరియు
సుప్రభాతము పాడు చుండును
భక్తి పొంగారన్.

మేలు కొనుమో రంగ నాథా!
మేలుకో కావేటి రంగా!
మేలుకో కస్తూరి రంగా
మేలు కోవయ్యా!

మూడు కోట్లా దేవతలునూ
భక్తితో సేవించ వచ్చిరి
భక్త రక్షా! పరమ పురుషా
తూర్పు తెలవారెన్.

భక్తి పొంగీ పొరలి పారగ
భిక్ష మెత్తియు కుక్షి నింపును,
తోట పనిలో మగ్నుడై, విరు
లెన్నో పూయించున్.

మల్లెమొల్లలు జాజి పొగడలు
పొన్నలును కనకాంబరంబులు
రంగు రంగు గులాబి పూలును
తోటలో పూయున్.

పొంగు విప్రుడు, పొంగు పూలును,
పొంగు రంగడు, పొంగు జగమును,
అంగ రంగా వైభవము గని
సర్వము ప్పొంగున్.

ఇవ్వి దింజిత సంగుడై పూ
జితాత తరంగుండు నైరా
జితాత తరంగుండు నున్నా
సంగ విజితుండై.

పుచ్చు చుండెను కాల మిట్టుల
కలదు శ్రీ రంగమున కనతిని
నిచుళ పురమను పురము గలదు
అదియె వరయూరున్.

నాట్య సంగీతాది కళలర
సజ్ఞుడతీ భక్తుండు వీరుడు
చోళ భూపతి యేలు చుండును
ధర్మ మార్గమునన్.

దేవ దేవను వేశ్య కన్యక
నృత్య కైంకర్యంబు జేయక
దంబ పురమందుండు ఉత్తమ
స్వామి సేవకునై.

నిర్ణయింపంబడియు నెదుటను
ననుదినంబును నాట్య మాడును
పదియు నవతారముల జూపును
వివిధ భంగిమలన్.

చంద్ర రేఖయె జారిపడెనా?
చుక్క తెగియే నేల వ్రాలెన?
రతియెమన్మథు వీడి వచ్చెన?
అతి లోత్తమయా?

అనెడి భావన గలుగ జేయును
వేశ్యకన్యక దేవదేవియు,
అప్సరసయే శాపవశమున
నవని జన్మించెన్.

ఆమె వారాంగనల వంటిది
కాదు భూలోకాప్సరాంగన,
ఆమె నిచుళా పురము జేరెను
అక్కతో గూడీ

నృత్య గీతా వాద్యములతో
మదను బాణము వంటి చూపుతో
హావ భావ విలాసములతో
చోళు మెప్పించెన్.

ఆమె చాతుర్యమును మెచ్చియు
రత్న ఖచితా భరణ ములనూ
మేలికనకాంబరము లొసగీ
రాజు కొనియాడెన్.

అమిత గర్వము తలకునెక్కెను
అక్కగూడి కరంబపురముకు
బయలు దేరిన సుందరీమణి
అలసి శ్రమ దీరన్.

విప్ర నారాయణుని ఆశ్రమ
వాటికను దరి జేరి చూడగ
ఆమె శ్రమయే మాయమయ్యెను
ఆశ్రమము జూడన్.

పుష్ప కాంతారమున కాంతా
రత్నము న్విహరింప దలచీ
పుష్ప ఫలభరితంబు శుకపిక
మధుర కూజితమై.

పుష్ప సౌరభ మారుతంబై
మత్త భృంగారవము ఖరితము
నృత్య శిఖిగమి విలసితంబై
అపర నందనమై.

యున్న యావనమందు సఖులతో
విసుగు నొందక తిరిగి తిరిగీ
వృక్ష ఛాయను విశ్రమించగ
దలచి నరుదెంచెన్.

కుండతో జలములను దెచ్చుచు
చెట్టు మొదలను బోయుచుండెడి
వైష్ణ వుండొక డచట నగుపడె
వేశ్య రత్నముకున్.

ధౌత వస్త్రము బవిరి గడ్డము
తెల్లనీయజ్ఞోప వీతము
తులసి తామర పూసమాలలు
ద్వాదశోర్ధ్వములున్.

అట్టి వ్యక్తిని గాంచి గౌరవ
భావములతో దరికి జేరియు
వందనం బొనరించ, నతడును
చూడడా తరుణిన్.

దాసురాలను దేవ దేవిని
వందనం బోనరించుచుంటిని
మీదు ఆశీస్సులను గోరితి
కృపతో నొసగండీ.

ఉలుకు పలుకులు లేక యుండిన
సోదరింగని నిట్టులనియెను
అక్కరోమగ వాడు గాడా
పిచ్చి వాడౌనా?

అందమందున నందె వేసిన
సుందరీమణి నైన నన్నున్
వందనం బొనరింపజూడడు
అక్కజంబయ్యెన్.

చూపులకు బ్రభాజ మానుడె
ఇతడు భజగోవింద మాత్రుడె
వందనం బొనరింప దండగ
పోదమింటి కనన్.

చెల్లెమాటలు వినియునవ్విన
అక్కయలివేణనియె, చెల్లీ ,
పెద్దలను నిందింప గూడదు
తగునె నీకిటులన్.

రంగనీ కైంకర్య చిత్తుడు
అన్య మెరుగని పరమ భక్తుడు
ఎవరినీ కన్నెత్తి చూడని
పరమనైష్ఠి కుడున్.

ధనము నందాశయును లేదు
భోగముల మదినిచ్చగించడు
తరుణులను తలనెత్తి చూడని
సజ్జనుండుతడున్.

అక్క పలుకులు వినియు నగుచును
అక్కరోనీవెంత బేలవే
ధనము కన్నను మిన్న యౌవన
మౌను ధరలో నన్.

ఇతడు ఋశ్యశృంగు మించునె
యౌవనారంభమున నుండెను
అగ్ని దరిగల నేతి వలనే
నితని కరిగింతున్.

హావ భావవిలాసములతో
అంగనా మోహమున ముంతును
పూల బాణుడె నాకు తోడౌ
నటుల కాదేనిన్.

నీకు నే నూడిగముజేయుదు
నారు నెలలంతియనె కాదు
నాదు సర్వము నీకొసంగుదు
నిదియె నాప్రతినౌ.

అనగ నలివేణనియె నిట్టుల
నాదు ప్రతినయు నీవిధంబే
ననుచు జేరెకరంబ పురమును
చెలులతో గూడిన్.

నగల నన్నిట తీసివేసియు
నదిన స్నానం బాచరించియు
జేగురుం గుడ్డలను గట్టియు
ఊర్ధ్వ పుండ్రములన్.

పెట్టి సాత్విక వేషముగనా
విప్ర నారాయణుని జేరియు
వంగి అడియేన్ దాసు రాలిన
టంచు ప్రణ మిల్లెన్.

అపుడు విప్రుడు ఆమె జూచియు
ఎవర వీవిట కేల వచ్చితె?
కారణం బెరిగింపు మనగా
వనిత యిట్లనియెన్.

పూర్వ జన్మపు పాపవశమున
వేశ్యగా జన్మించి యుంటిని
ఇంత కన్న నికృష్ట జన్మము
ఎందు లేదరయన్.

ఇట్టి వృత్తిని నాచరించిన
పుట్ట గతులుండవును నీకున్
ఇకను వైష్ణవ సేవ జేయుము
సద్గతింగల్గున్.

అనుచు పుణ్యాత్ముండొకండుం
జేసెనుపదేశంబు నాకున్
పడుపు వృత్తిని సేవగించితి
వదలి తన్నిటినిన్.

మోక్షకాముకు రాలనైనీ
శరణు గోరియు వచ్చితిటకును
నీవు నిష్కాముడవు గానన్
నీదు సన్నిధిలోన్.

కాలమును నేవెళ్ళబుచ్చుచు
మాలికలనే గూర్చు చుందును
వనము కాపల గాయుదానను
నన్ను దయగనుడీ.

ఆకులలములు కాయగసరులు
దినుచు గాలము గడుపు చుందును
భుక్త శేషంబింత నొసగితె
అదియె భుజియింతున్.

దాసురాలిని దీనురాలిని
తమదు సన్నిధి పాప ప్రక్షా
ళనము కొంతయు జేసుకొనుచును
నేను తరియింతున్.

అనుచు వాక్చాతుర్యముననా
వైష్ణవుం గరిగించె భామయు
"ఆడు వారలు ఎంతకైనను
జాలు వారలహో.

తమదు రూప విలాసములచే
పురుషుల న్మోహమున ముంతురు
ఆరు పాలన్నిటను నధికులు
ప్రళయ కారకులున్.

అభము శుభముల తెలియనేరని
లోక వంచన మెరుగ నట్టి
విప్ర నారాయణుడు వేశ్యకు
స్థాన మొసగెనటన్.

ఆమె మాటలు నమ్మి విప్రుడు
తోట కాపల కాయ బెట్టెను
ప్రతిన నెరవేరింక ననుచును
అమ్మయను కొనియెన్.

అచట గల కావేరి నదిలో
మూడు మారులు తానమాడియు
నారబట్టలు దాల్చి నుదుటను
దిద్దు నెలవంకన్.

తులసి మాలల దాల్చి చూడను
ఋష్య వాటిక కన్య వోలెను
వినయ వినమిత గాత్రి నయ్యును
నాజ్ఞ స్వామి యనున్.

ఎట్టి కైంకర్యంబె జెప్పిన
నట్టి కైంకర్యంబె జేయును
శేష భుక్తం బొసగ నదియే
తృప్తి భుజియించున్.

సహజ నటనా చతురు రాలును
కుహన భక్తితో మెలగు చుండగ
సహజ భక్తని స్వామి నమ్మెను
కాలముంగడవన్.

భాగవత కైంకర్యమహిమ చె
భుక్త శేషాశనము చేతను
పూర్వ జన్మపుకృతము దొలగను
ఆమె మార్పొందెన్.

ఇంత వరకును జేసినట్టివి
పాదు త్రవ్వియు నీరు బోయుట
కపట నాటక కారణంబే
ఇప్పుడటుగాదే.

కపట భావము తొలగి భాగవ
తోత్తముని కైంకర్య భావమె
భావ మందు జనించ నామెకు,
తెలియకే జరిగెన్.

తనదు ప్రతినను దీర్చు కొనుటకు
దుర్భరంబగు పాట్లు బడుచును
ఎండ వానల నెండి తడచుచు
వడవడన్వడకున్.

ఈమె కైంకర్యంబు నిష్ఠను
బాధలను భరియింపు నోర్పును
కనగ నిధి యొక విధతపంబని
నతడు రంజిల్లెన్.

పగలు కాలము గడచు పనితో
రాత్రి మాత్రము కాళ రాత్రమే
మదిన గ్రుచ్చిన ముల్లు ప్రతినవ
ఒక్క రాత్రమునన్.

రంగ రంగా! దేవదేవా!
నీచురాలను, గర్వముననే
ప్రతిన జేసితి, నావిలాసము
నతడు గనడయ్యెన్.

ఇనుప కచ్చడములను దాల్చిన
మౌనులైనను నన్ను గాంచిన
భ్రష్ఠులై నాకొంగు పట్టుక
తిరుగు వారు గదా!

ఋష్య శృంగుని మించె నీతని
బ్రహ్మ చర్యం బెంత గట్టిదొ
ఆరు నెలలో నొక్క నాడును
నన్ను చూడడుగా!

కటిక చీకటి లోన నొంటిగ
బయట నిద్రను బోవునన్నున్
ఎచట నుంటివి ఏమి తింటివ
టంచు నడగండే!

ఎంత నిర్దయు, డెంత ధీరుడు
మొగము చూడుడు పనుల నడుగడు
రంగ నాథా! ప్రతిన జేసితి
నీవె శరణమయా!

నాదు ప్రతినయె వ్యర్థమౌనా ?
ఏల జేసితి నిట్టి ప్రతినను
ఈ మహామహు నెటుల గెలుతున
టంచు ప్రార్థించెన్.

దేవ దేవు కృపార్ద్ర దృష్టులు
దేవ దేవికి కలిగె నోయన
రాత్రి మేఘాలావరించెను
ఆకసంబంతన్.

కొండ లట్టుల నుండి వర్షము
దండిగా మెరుమురుములురుముచు
ఢఢఢ ఢామ్మని పిడుగు పడగను
పుడమి వేల్పుపుడన్.

అబల వర్షము నందు దడియుచు
భీతి నెంతే బొందే నేమో!
పాపమని మది జాలి నొందీ
తలుపులందెరచీ!

చిమ్మ చీకటి లోన నుండియు
వర్షమందున దడియు చుంటివి
దేవదేవీ ! రమ్ము లోనిక
టంచు బిల్వంగన్.

ధన్యురాలను స్వామి యనుచును
లోని కరుదెంచియును పదముల
సన్నిధే పెన్నిధి యటంచును
అచటె గూర్చొనియున్.

ఏమి కైంకర్యమును జేయుదు
స్వామి! యని పాదముల నొత్తుచు
మెల్లగా సల్లాపములను
నతని తాదింపెన్.

చల్లనీ మృదు కరస్పర్శము
తేనె సోనల పలుకు సోకను
తెలియనేరని లోకములలో
తేలె నాభృవుడున్.

ఎదుట సర్వాంగంపు సుందరి
సమయమా! ఏకాంత మయ్యది
పంచ బాణుడు బాణమేసెను
అతని హృదినాటన్.

హరుడె సుమశరు శరము నోడెను
అతని ధాటికి నిలువ దరమా?
గతిని దప్పెను నతని మనసును
తనువు వడకంగన్.

రెండు భుజముల బట్టి నెత్తియు
గాఢమౌ కౌగిటను గ్రుచ్చి
సురత క్రీడల దేలి మన్మథ
విజయముంగాంచెన్.

నాటి రేయి నోల లాడిరి
సురత క్రీడల వారలిరువురు
నొక్క రాత్రిలో నెరిగె నాతడు
కామ శాస్త్రంబున్.

ఎన్ని యెన్నియొ రాత్రులేలిరి
వన విహారము లెన్నొ జేసిరి
సరసులను క్రీడించి మురిసిరి
వృక్షలతలటులన్.

ప్రతిన నెరవేర్చితినటంచును
దేవ దేవియు మార్చేవేషము
యోగి వేషము మార్చి భోగిని
వేషమున్ మార్చెన్.

చీని నీనాంబరము గట్టెను
స్వర్ణ భూషణములను దాల్చెను
తనకరంబపురంబు జేరెను
కామినీ మణియున్.

రంగ నాథుని సేవవదలి,క
రంబ పురమున వేశ్యయింటను
సుష్ఠ గాతిష్ఠంబు వేసియు
తనను తామరచెన్.

తల్లి ధనమం దాస గలది
ధనము లేనిదే తనువు లేదను
భావమును గల వృద్ధ వేశ్యయు ( వేశ్య మాతయు)
దుహితతో ననియెన్.

అమ్మ! మా బంగారు తల్లీ!
వేశ్యలకు ధన మేను ముఖ్యము
ధనము గల్గిన నంత వశమౌ
నదియె లేకున్నన్.

ఎవరు మనవై పైన జూడరు
అతని తొలగించిచటి నుండి
కోరి యుండిరి కోట్ల ధనికులు
పేద బాపండే.

పూర్వ వాసన లన్ని మరచిన
దేవ దేవియు నొప్పనందున
నింట నిర్బంధించి విప్రుని
బయటకుందరిమేన్.

విప్ర నారాయణుని వదలియు
దేవ దేవియు క్షణము బ్రతుకదు
ఆమె తోడిదె లోక మతనికి
నిరువు రీతిన్.

బాధ నొందుచు దినదినంబును
యుగముగా గడుపందొ డంగను
వీధి యరుగున వ్రేలు చుండెను
విప్రుడారాత్రిన్.

శీత బాధతొ వడకు చుండియు
దేవదేవిని స్మరణ జేయుచు
కాంత విరహపు బాధ చేతను
భ్రాంతుడై యుండెన్.

నాడు శ్రీరంగేశుడును శ్రీ
రంగ నాయకి గూడి పురమున
సంచరించుచు నటకు రాగను
అమ్మ జూచెనటన్.

అతని జూచియు నడిగె జాలితొ
దైన్యమున నుండిత డెవండౌ
ఇటుల నుండను కారణంబును
ఎరుగ జేయుడనన్.

అంత శ్రీరంగేశుడాతని
కథను వివరించంగ వినియును
కరుణతో నాజగన్మాతయు
నాథుతో ననియెన్.

నీదు లీలల నెరుగ దరమా?
నాకు గూడన నూహ్యములునౌ
అంత రంగిక భక్తుడితడే!
ఇటుల తగునయ్యా!

మాయలో బడవైచి వేశ్యా
లంపటుని జేసితివి స్వామీ!
నీ కృపాపాత్రునిగ జే (సియు)
దయతొ బ్రోవగదే.

రంగ నాయకి పురుష కారము
జేయ శ్రీరంగేశు డిట్లని
విప్ర నారాయణుని కొరకును
పన్నె వ్యూహమునున్.

విరహ వేదన గ్రుంకు చుండగ
అర్ధరాత్రము తలుపు నెవరో
తట్టి తలుపును దేవ దేవియు
తెరచి చూడంగన్.

ఎదుట నుండెను వైష్ణవుండును
ఎవర వీవని యడుగ ఉశ్శని
మెల్లగా మాటాడు మనుచును
సైగ జేయుచునున్.

బట్ట మాటున దాచి యుంచిన
మేలి బంగరు పాత్ర నొసగియు
మాదు గురుపుంగవులు బంపిరి
దీని గైకొనియున్.

మాదు గురువుల ప్రేమ జూడుము
ధనము శాశ్వత మరయ గాదే!
వెదకి దెత్తునటంచు బల్కగ
వేశ్య యిట్లనియెన్.

విప్ర నారాయణుని యెడబా
టయ్యె దినమొక యుగము నిజమున్,
తల్లి ధనవ్యామోహమున నిట
నింతయుం జరిగెన్.

కాన విప్రా ! నాదు స్వామిని
వెంటనే గొనిరమ్ము వారిని
వదలి యుండుట దుర్భంబున్
నిమిసమొక యుగమున్.

అనగ నాతడు సరియె ననియును
విప్ర నారాయణుని జేరియు
రంగ దాసుండనెడి వాడను
దేవ దేవంపెన్.

నీదు పంటయు పండె నేడున్
నిన్ను జూడను వాచి వేచెను
విరహపరవశ మేలనయ్యా!
వేగ జనుమటకున్.

విప్ర వర్యుని ముఖము విచ్చెను
అమృతపు సోనలను బోలిన
మాటలను విని నతడు పరుగున
వేశ్యయిలు జేరన్.

దేవ దేవియు చేయి సాచెను
ఆమె యొడిలో వ్రాలె విప్రుడు
నాటి రాత్రము మదను డచ్చట
విజయమున్ బొందెన్.

పట్టు పరుపున పవ్వళించిరి
దొరల వోలెను వారలిరువురు,
చిలువ దొరపై కులికి, స్వామియు
సిరితో నిద్రించెన్.

తెల్ల వారెను ఆలయార్చక
బృందములు తాళంబుదెరచి
గర్భ గుడిలో నేగి వారలు
అచట గాంచంగన్.

స్వర్ణ పాత్రములందు మిక్కిలి
వెలను గలిగియు పెద్ద పాత్రౌ
శుద్ధ జల పాత్రంబు గానక
మేను వనకంగన్.

తెలియ జేసిరి యచటి యధికా
రులకు వారలు, చోళ రాజున
కిట్టి వార్తను నంద జేయగ
నతడు నరుదెంచెన్.

దండ తాడిత భుజగమట్టుల
క్రుద్ధుడై అర్చకుల, పాచక,
భృత్యులందర త్రాళ్ళ తోడుత
గట్టి వేయించెన్.

ఎవరు మీలో పాత్ర చోరులు
దైవ ద్రోహము చేయువారలు,
నిజము చెప్పుడు లేనిచోమీ
తలల దీయింతున్.

అనుచు వారల భటుల చేతను
గొట్టు నట్టుల నాజ్ఞ నిడనా
దెబ్బలను సైచకను వారలు
మొత్తుకొనుచుండన్.

ఎట్టి పాపం బెరుగ మంచును
విలవిలంబడి మొత్తు కొనగను
గొట్టు చుండిరి భటులు వారిం
రేణి యానతిఏన్.

వేశ్య పరిచారిక యొకర్తుక
ఇట్టి వార్తను వినియు జూడగ
బాధితులలో నుండె విటుడును
విలవిలన్నాడెన్.

దండ నాథుని కడకు తాజని
వినయమున తావిన్నవించెను
దండ నాథా! కలదు పాత్రము
మాదు గృహమందున్.

నిన్నరేతిరి విప్రనారా
యణుడు మాదౌ దేవ దేవకి
స్వర్ణ పాత్రము నిచ్చె ప్రేమతొ
కనుడు నటనుండున్.

ఇట్టి మాటల విన్నవింటనె
దండ నాథుడు జనియె నటకును,
అచట వెదకను లభ్యమయ్యెను
అట్టి పాత్రంబున్.

దండ నాథుడు వారలందర
చోళ రాజుల మ్రోల నుంచగ
దేవ దేవియు తల్లి వడకిరి
రాజు కోపముకున్.

దేవ దేవీ! దైవ ద్రవ్యం
బనియు తలపక పాత్ర పొందితె,
దోషురాలవు, నిన్ను నిచ్చట
దండనంజేతున్.

అనెడు భూవిభు మాట వినియును
గాలి తాకున వడకు గడ్డిని
పోలి ప్రభువుల పదము వ్రాలియు
వినయము న్ననియెన్.

దేవరా! పాదంబులానా
దైవ ద్రవ్యంబంచు నెరుగను
రంగ దాసుండనెడి శిష్యుచె
ఇతడె నాకంపెన్.

తెలియకే పాత్రంబు పొందితి
ఇంతకన్నను వేరెరుంగను
తమదు పాదములాన దేవా!
అనుచు బలుకంగన్.

విప్రనారాయణుడు రాజుతో
దూత యను వాడెవడులేడే
పాత్ర విషయము నాకు దెలియదు
ఇదియు బూటకమౌ.

అనుచు నిశ్చలు డయ్యు బలుకగ
నీవె నొసగితి వనియు వేశ్యయు,
కాదు నేనేవిషయ మెరుగను
నీవు నీవనుచున్.

ఇరువురును వాదించు కొనగను
క్రుద్ధుడై గద్దించె ప్రభువులు
విప్రనారాయణుని జూచుచు
నిటుల తాననియెన్.

ఓయి! విప్రా! ఎంత జ్ఞానివి
ఎంతకును దిగజారినావే
జార చోరుడవైతె! నిన్నిపు
డెటుల శిక్షింతున్.

అనియు చెరలో బంది జేయగ
నచట జ్ఞానోదయము నయ్యెను
ఎచట బుట్టితి నెచట పెరిగితి
నిపుడు నేమయ్యెన్.

పుట్టితిని బ్రాహ్మణుల యింటను
సర్వ శాస్త్రాల్ చదివి నాడను
ఎట్టి ఉత్కృష్టంపు కైంక
ర్యంబు జేసితినీ.

ఎంత యోగము సంభవించెను
ఎంత దుర్యోగముకు జారితి
మీసములపై తేనె వంటిదీ
సాని సంపర్కమ్!

రంగ రంగా! అంగ నామణి
పొందు గోరియు నిన్ను వదలితి
ఇటను బొంకూరంకులాడీ
మాయలో బడితిన్.

వలను చిక్కిన లేడివలెనిట్లు(చెర)
చిక్కు కొంటిని దిక్కు దోచదు
రంగ రంగా! చాలు బ్రతుకిక
నన్ను బ్రోవగదే!

అనుచు కారాగారమందున
మూర్ఛ నొందెను భూసురుండును,
రంగ నాథులు నతని జూచుచు
నవ్వు లొలికించెన్.

పరమ భక్తుండితడు నాథా!
భావ్యమా చెరలోన నుండుట
నేరమేమీయు జేయలేదే!
జాలిలేదాయెన్.

ఇతడు శిక్షలనను భవించిన
లీలగా నీకుండ నోపును
భక్త జనులను బాధ నొంచిన
బరగు ఫలమేదీ.

త్వరగ విడిపింపితని చెరనున్
నీదు సన్నిధిలోన నుండును
నాదు మదికిది వ్యథగ నుండెను
ఇతడు చెరనుండన్.

అనుచు శ్రీయును హెచ్చరించగ
నవ్వు చుందల యూచి సరెననె
చోళ రాజేంద్రునకు స్వప్నం
బందు గన్పించి.

చోళ రాజా విప్రనారా
యణుడు నిర్దోషెరుగడితరము
రంగదాసుండడనెడు పేరున
పాత్ర నొసగితినీ

కర్మ శేషం భనుభవింపక
తప్పు దెంతటి వారికైనను
నాదు పన్నాగంబు నిదియే
కర్మమును డొల్లెన్.

నీదు దండన మింక నాపియు
ఉచిత సత్కారంబు జేసియు
అతనికిందగు విధము జేసియు
ధన్యుడవు గమ్మా!

స్వర్ణ పాత్రము నాదిగానా
నాదు పుత్రున కొసగి యుంటిని
వేశ్య ధనమదియిపుడుగానన్
దానినేనొల్లన్.

అతడు పుణ్యాత్ముండు భక్తుడు
నాదు కైంకర్యంబు రతుడున్
గాన నాతని నేర్పరింపుము
నన్ను సేవింపన్.

ఇటుల శ్రీ రంగేశు డనగను
అటులె స్వామీ యనియె రేడున్
అంత అంతనార్థాన మొందెను
ఆది నాథుండున్.

చోళ రాజేంద్రులును మేల్కొని
స్వామి ఆదేశంబు మేరకు
విప్ర నారాయణుని బిల్చియు
పదముల న్రాలెన్.

భక్త వర్యా భూసురోత్తమ
తెలియకేనేరంబు జేసితి
నేను క్షంతవ్యుండ స్వామీ!
నన్ను దయగనుమా!

అనియు సత్కారంబు జేసియు
నంపె శ్రీరంగమున కతనిని
విప్ర నారాయణుడు భక్తిని
చేరె శ్రీ రంగమ్.

భ్రష్టుడై పెడ దారులంజని
తిరిగి తిరిగీ శీలవతుడై
ఇల్లు జూచ్చిన పుత్రునింగని
మనములుప్పొంగన్.

మురియు తల్లీ దండ్రులట్టుల
రంగ నాథుండతిగ మురియుచు
రమ్మనీ చేసాచి పిలిచెను
ఎంత ధన్యుండో.

దరికి జేరియు విప్ర నారా
యణుడు సాష్టాంగంబుగాప్రణ
మిల్లి స్వామిని వేవిధంబుల
భక్తి గొని యాడెన్.

ఎంత మలినములయ్యె దేహము
ఆత్మ ప్రకృతులు మనము లన్నియు
ఇట్టి మాలిన్యంబు తొలగుట
కేమి చేయవలెన్.

వేరు మార్థం బేమీ లేదే
భక్త జన శ్రీపాద తీర్థము
పాద రజమున శిరోధార్యము
శాస్త్ర సమ్మతమున్.

భాగవతజన పాదరజమున
భక్తితో తల దాల్చు ప్రాయ
శ్చిత్త మింకొకటరయ లేదే
ధరిణి గాంచంగన్.

ఇటుల మదియం దునను దలచియు
విప్ర నారాయణుడు ననుదిన
మవ్విదంబున జేసి మురియును
ధన్యుడన్నంచున్.

ఒక్క దినమున రంగ నాథుడు
విప్ర నారాయణుని బిలిచియు
నీలొ లోపం బేమి లేదే
మందు నా చెంతన్.

నీదు సర్వా భీష్టములను
దీర్చు వాడను, ఇచ్చువచ్చిన
వరము కోరుము నొసగువాడను
వీడు సందియమున్.

పెరియ పెరుమాళ్ళిటుల బల్కను
రంగ నాథా నీదు దర్శన
భాగ్య మొదవెను ధన్యుడునునే
విదియె సరిపోవున్.

చాల దిదియని తలతువేమో
అటుల నైనచొ గోరుచుంటిని
నీదు భక్తుల పాద ధూళను
వరము నీయగదే.

విప్ర నారాయణుని కోరిక
వినిన స్వామియు మంద హసితా
ననము నన్సరి యనియె అటులనె
గాలముంగడచెన్.

భక్త అంఘ్రీ రేణువవియును
తొండరడిప్పొడి యనెడు పేరులు
ద్రవిడ భాషలొ పిలువ బడియా
ళ్వార్ల వర్గమునన్.

చేర తొండర డిప్పొడీయా
ళ్వార్లటంచును పిలువ బడియెను
అదియె సార్థక మవను వారలు
అటులె పిలువ బడెన్.

విప్ర నారాయణుల మహిమను
అనుభవించిన దేవ దేవియు
నిరపరాధికి దొంగ తనమును
నంట గట్టితినే.

పాప ఫలితము నెటుల నుండునొ
ఎవ్వరెరుగుదు రీశ్వరేచ్ఛని
సర్వ సంపద లొసగె శ్రీరం
గేశు సన్నిధికిన్.

తల్లి బంధు సమాగమంబుల
సర్వ బంధములన్ని త్రెంచియు
భాగవత పాదార్చనంబే
ముఖ్య పరమార్థం.

బంచు నెంచియు స్వాములందర
భక్తి గొల్చుచు వారలొసగిన
శేష భుక్తంబుననె కాలము
వెళ్ళ బుచ్చుచునూ.

రంగనీ ఆలయము నూడ్చుచు
నీరు చల్లుటముగ్గు వేయుట
భాగవత దాస్యంబు జేయుచు
జేరె సాయుజ్యమ్.

పుష్పమాలా గుంఫనంబును
జేసిరంగని కొసగుచుననస
మాన భక్తీ భావములతో
రంగనింగొల్చి.

తమదు జన్మకుమూల కందం
బైన శ్రీవన మాల యందున
చరమ దేహము వదలి జేరిరి
భక్తి తత్పరతన్.

వీరి రచనలు రెండు, నందున
నొకటి తిరుమాలైయు, రెండును
తిరుపళ్ళియ యెళుచ్చియులున్
భక్తి గ్రంథంబుల్.

ఇతర మూర్తుల గొల్వ బోవక,
పాడబోవక రంగ నాథుల
నేక లక్ష్యంబుగను బూనియు
రచనల వ్రాసెన్.

ఆది నుండియు చివరవరకును
రంగనాథుల గొల్చి నట్టీ
భక్త అంఘ్రిపాదపద్మము
భక్తితో గొలున్.

దశరథేశుల పూజలందియు
రంగ నగరము నందు శ్రీరంగే
శుడై వెలు గొందు చుండిన
రంగ నాయకులన్.

మేలు కొల్పును పాడె తిరుప
ళ్ళియయేళుచ్చునెడి దౌశ్రీ
దివ్య గ్రంథము వ్రాసి నట్టీ
విప్ర వరు గొల్తున్.

విప్ర నారాయణుల చరితము
భక్తితో విన్నట్టి వారలు
రంగ నాథుల కృపకు నెంతో
పాత్రు లౌతావుదురిలన్.

మంగళము శ్రీ రంగ నాయక!
మంగళము శ్రీ తొండరడిప్పొడి
మంగళము శ్రీ మాన్య చరితా
మంగళము నీకున్.



ఓం శ్రీ లక్ష్మీహయగ్రీవాయనమః

శ్రీ తిరుప్పాణాళ్వారులు

విప్ర నారాయణుల జన్మ
స్థలము నిచుళా పురమె, కనగా
తిరుప్పాణాళ్వార్లకునునది
జన్మస్థలమయ్యెన్.

వీరుముదలా ళ్వారులట్టుల
నయోనిజ సంభవులు బ్రాహ్మణ
క్షేత్ర మందున పంట పొలమున
ధాన్య గుచ్ఛమునన్.

జన్మమా కార్తీకమాసము
రోహిణీ నక్షత్ర మందున
విష్ణు వక్షస్థలము వెల్గెడు
మచ్చ శ్రీ వత్సమ్.

బిట్లు జన్మం బొందె కంకిన
పాణనింగొని పోయి పెంచెను
పంచముండొక డింట ప్రేమతొ
ప్రాణ ప్రదమవగన్.

ద్రావిడంబున పాణననగా
పంచముండని పేరుగల్గుట
గాన బాలుడు పాణ ననుచును
పిలువ బడుచుండెన్.

పుట్టుకయె అత్కృష్టమవగను
నతడు వైష్ణవ సంప్రదాయము
విధివి భగవద్గుణములను భవ
రూపమగు నటులన్.

పాట లెన్నియొ పాడు కొనుచును
ఊర్ధ్వ పుండ్రా ధారణంబును
తులసి నలినా క్షాది మాలల
ధారణం జేయున్.

భాగవత లక్షణము గల్గియు
సాత్వి కాహరముతో హరిదా
సుండునై హరి దాస వృత్తితొ
గడుపు దినదినమున్.

కులము యొక్కయు ఉచ్చనీఛాల్
వ్యావహారము మానవులకే
కాని భగవదృష్టిలోనను
అందరున్నములే.

భగవ దంశను జనన మందిన
మనువు స్మృతి నొక దాని వ్రాసెను
అందు కౌలిక లౌకి కంబులు
ధర్మ నిర్ణయముల్.

గలవటంచును ప్రాజ్ఞు లందురు
లోక కళ్యాణమున కవ్వియు
కారకంబులు గావలెన్విధి
హాని గారాదే.

మానవులకును సేవ సేయుట
మాధవుని సేవయును నొగద,
తినుట తినకుండకను నుండుట
దేహ ధర్మంబుల్.

హరిని గొల్చుట, హరిని బాడుట
అతని గుణ శీలముల బొగడుట
ఉత్కటంబగు భక్తి తావులు
పొందరానివిగా!

ఎవడు భక్తిని గల్గియుండుయు
సర్వమును కృష్ణార్పణంబని
తలచి తామర ఆకుపై గల
నీటి బిందువుగన్.

ఇహము నంటక పరము గోరియు
నుచ్ఛ నీచంబులను దలపక
దూషణంబుల భూషణంబుల
సమముగన్నెంచున్.

అట్టి వాడే ధరను భక్తుడు
అట్టి భక్తుడె పాణ నరయను
భక్త ప్రహ్లాదునిగ నితడును
పుట్టువైష్ణవుడే.

అంశయా దివ్యాంశమతనిది
పుట్టుకయునతి స్వచ్ఛమైనది
గుణము పెంచెను పెంపకంబును
పెరుగెనట పాణన్.

తండ్రి పాడెడి హరిగుణంబుల
పాటలుగ తాపాడుచుండును
అతడు భగవద్ధ్యాన పఠనా
పటిమ నున్నొందెన్.

ఇతడు విష్వక్సేను చేతను
పంచ సంస్కారంబు బొందెను
పంచ సంస్కారముల ముఖ్యము
తాప సంస్కారమ్.

తపము జేయని వారికినినిది
తపోరూపంబయ్యి నిలచును
పుండ్ర మాలాధారణంబున
నిదియు భూషణమౌ.

చక్రముచె దేహంబు తప్తము
కానివాడా పరమ పదమును
పొంద నేరండనుచు వేదము
నుడువు చున్నుండున్.

శ్లో॥ నేమినా అతప్త తనుః నత దశ్నుతే
ఋణ్యోప్య పీడ్యః శ్వపచోప్య బాధ్యః
చోరోప వధ్యః పశురస్య హింస్యః
యోహ్యంకితో వైష్ణవ లాంఛనేన

శంఖ చక్రాద్యాది వైష్ణవ
లాంఛ నాల్గలి గున్న వారలు
చోరులును మాంసంబుతినువా
రలుఋణగ్రస్తుల్.

పశువులను పీడింపచంపగ
బాధ నొంచగ, హింససేయగ
కూడదంచును చెప్పె సంస్కా
రంపుమహిమంబున్.

ఇకను జ్ఞానాద్యనుష్ఠానము
లకును నర్హుండైన మానవు
విషయముంజెప్పంగ వలెనా?
జెప్పనలవౌనా?

సూత్రవతి నాధులచెనాతడు
పంచ సంస్కారంబు జ్ఞానము
పొంది భగవత్పరజ్ఞానము
పరప్రీతులతోన్.

పెరుగుచుం గాంధార రాగం
గాన పద్ధతి కైశికీవృ
త్తనెడి రీతిని నాశ్రయించీ
తంబురన్మీటీన్.

రంగనాధుల స్తుతుల జేయుట
అతని కైంకర్యంబు నిరతము,
నిత్య విధియున్నితర మెరుగని
నిర్మలుండితడున్.

పూర్వమందు కురంగ నగరపు
వాసియౌమాతంగు డొక్కడు
తనదుకైశికిగాన ఫలమును
ధార వోసి యునున్.

యజ్ఞ లోపము చేత విప్రుడు
బ్రహరాక్షస జన్మ మెత్తగ
గాన ఫలమున రాక్షసునకును
ముక్తి జేకూర్చెన్.

భగవదనుభవములను జేయుచు
దూరముగ తానిలచి యుండీ
మూల వరులను జ్ఞాన దృష్టితొ
జూచి ముదమొందెన్.

ఆలయంబున జొచ్చువారికి
మూలవరులను జూచువారికి
స్పర్శ నంబును జేయువారికి
అలవి గానట్టి.

అమిత బ్రహ్మానందమునునత
డనుభవించెను జ్ఞాన దృష్టితో
గాని అస్పృశ్యుండనంచును
అతడు మది తలచున్.

ఇటుల నుండగ నొక్క(నాడున) దినమున
రంగనాథుని తీర్థకైంక
ర్యంబునకు కావేరి యందున
స్నానమునుజేసి.

వైష్ణవ బ్రాహ్మణుడు సారం
గముని యనుపే రొందు నాతడు
బిందెతో తీర్థంబు దెచ్చుచు
పాణనటజూచి.

ఓయి, పాణా! తొలగు దూరము
స్వామి కైంకర్యార్థ మియ్యది
మలినమౌ నీవీడ పోకిన,
తొలగు దూరము గాన్.

బాహ్య స్మృతి గోల్పోయి భగవ
ధ్యాన మందున మున్గి నిష్టతో
రంగనీ చరణంబులందే
అతడు మదినిల్పెన్.

బ్రాహ్మణోత్తములచట జేరీ
తొలగు తొలగని కేకలిడగను
బాహ్మస్మృతి గోల్పోయి పాణన్
వినగ లేడయ్యెన్.

అంత వారలు కోపగించుచు
రాళ్ళురువ్విరి యతిని పైనన్
రక్త సిక్తంబయ్యె దేహము
కదల డిసుమంతన్.

కాని జీవన్ముక్త స్థితిలో
చలన మున్లేకుండ నుండియు
కైశికీ గానంబు మాత్రము
అటులె కొన సాగన్.

అంద రాశ్చర్యంబు నొందగ
కొంత తడవుకు గాన మాపియు
పాణ నేమి నెరుంగ నట్టుల
ఆశ్రముంజేరెన్.

కోపతాపము కల్గకుండెను
ఎవరినీ నిందించ కుండెను
దేహబాధను తలచ కుండెను
ఎట్టి సద్గుణుడో.

తీర్థము స్సారంగముని గొని
ఆలయంబున కేగి జూడగ
భయము సంభ్రమ ములను గల్గిరి
అందరచ్చోటన్.

విరగ బూసిన మోదుగట్టుల
రంగనాథుల దేహముండెను
దేహమెల్లడ గాయములునై
రుధిరమున్గారెన్.

రంగనీ దివ్యాంగములనుం
డవిరళంబుగ గారె రక్తము
అర్చకుల్యాచకులు పరిచా
రకులు పురజనులున్.

ప్రభువులున్నట జేరిజూచెరి
ఏమి అపచారంబు జేసితో
స్వామి యెడ నంచవుడు భూవిభు
డమిత భయమొందెన్.

అంత అదృశ్యమున స్వామియు
ననియె సారంగముని నాదగు
భక్తుడగు పాణన్నుగొట్టెను
రాళ్ళ రప్పలతోన్.

ఓయి ! ముని సారంగ వినుమా!
అపర ప్రహ్లాదుండు పాణన్
గాన మునకును పరవశడనై
అతనిలోనుంటిన్.

గాన దెబ్బలు నాకె తగిలెను
నాదు ఒడలే రక్త మయ్యేను
అంట రాని తనంబు వీడియు
నతని గొని తెమ్మా!

అనియు రంగం డాజ్ఞనొసగను
స్నాన సంధ్యాద్యాది కర్మల
దీర్చి పాణ న్నాశ్రమంబును
వెదకుచుం జేరెన్.

రక్త సిక్తాంగుండునయ్యును
ఆమహాభాగవతు డుండెను
ధ్యాన మగ్నుండయ్యు నిశ్చల
స్థితిలొ నుండంగన్.

అపుడు సారంగుండు గనియును
అతని భక్తికి వెఱగు నొందియు
"పాణకుల రవిచంద్రమా" గొను
నాదు వందనముల్.

నీదు విధమును తెలియ నేరక
జేసి తపచారంబు నీయెడ
దోషమున్నొనరించి నాడను
నేనె అపరాధిన్.

రంగ నాథుడు నిన్ను గొనితె
మ్మంచు నుడివెను గాననాతో
స్వామి సన్నిధి కరుగు దెండిది
రంగ నాజ్ఞసుమీ!

బయలు దేరుము నాతో ననగను
ఓమహాత్మా! నేను కడుగడు
నీచకులజుడ! నంటతగనే
నెటుల నరుదెంతున్.

నేను శ్రీ రంగముకు వచ్చిన
నాదు పదస్పర్శంబు కతనను
నదియు నపవిత్రంబు నౌగద
నటులనే జేయన్.

పాణుడును సారంగుతోనన
ఓ మహాభాగవత శ్రేష్ఠా
పాణ! నిది శ్రీ రంగ నాజ్ఞా!
మీరదగదయ్యా!

దేనినైననతిక్రమించుట
ధర్మ మౌనే మోనుగానీ
రంగ నాజ్ఞ నతి క్రమించుట
దురతి క్రమమౌనే.

పాద స్పర్శము కష్టమగుచో (నిష్ఠమననిచో)
నాదు భుజముల మీదగూర్చొను
అచటకే నేజేర్చు వాడను
ననుచు ప్రార్థించెన్.

పాణనుడు సంధిగ్ధస్థితిలో
భగవ దాజ్ఞను మీరలేకను
ఎదురు మాటల పారతంత్ర్యము
చెడును తన కంచున్.

తలచి తిరుప్పాణరులు సారం
గముని భుజముల ద్రొక్కి నెక్కగ
గరుడుడా నారాయణుని వహి
యించి నటులుండెన్.

అటుల బుజముల మోయుచునునా
ముని వరేణ్యుడు పాణనుంగొని
చనియె శ్రీ రంగమున కెంతయో
మనము నుప్పొంగన్.

ఎంతొ అపురూపంబు నియ్యది
బ్రహ్మరథ ఉత్సవము గాంచగ,
రంగ నాధుండుర్చకులకా
దేశమున్నొసగెన్.

పాణనిట కరుదెంచునప్పుడు
ముందు వెన్కల భూసురోత్తము
లెల్లరున్వేదంబు ద్రావిడ
వేదపఠనంబున్.

జదువవలెనంచనగవినియా
అర్చకులు తమ రాజుతోనన
నతడు నట్టులె నాజ్ఞ నిడనా
వేద పండితులున్.

పాణను స్సారంగముని గొని
అటకు రాగను ముందు వెన్కల
జేరి జేయం దొడగినారలు
పండి తోత్తములున్.

ముక్తు నతి వాహనుడు నెట్టుల
మోయుచు నైకుంతపురమున
శ్రీ మహామణి మంటపంబున
జేర్చు విధముగనున్.

తిరుప్పాణాళ్వార్లనట్టులె
జేర్చె సారంగముని శ్రీరం
గేశు సన్నిధి సప్త ప్రాకా
రాది వైభవమున్.

తనివి తీరగ గాంచి చుట్టుప్ర
దక్షణంబుల జేసెనెన్నో
మార్లుపిదపను రంగ నాథుల
సన్నిధిన్ జేర్చెన్.

పెరియ పెరుమా ళ్ళంతకరుణతో
తిరుప్పాణాళ్వార్ల బిలిచియు
దివ్యమంగళ విగ్రహముద
ర్శింపగా జేసేన్.

అతని దృష్టియు మొదట శ్రీరం
గేశు పదముల, జంఘములపై,
ఉదర, వక్షస్థలము, కంఠము
వరకు ప్రసరించెన్.

పాణనాళ్వార్లపుడు భక్తితొ
స్వామి దర్శనమును భవానం
దంబు పొంగగ మధురముల్నగు
పాశు రాల్పాడెన్.

అమలనాది పిరా నటంచును
పదియు పదముల దివ్య కవితై
పూత రేకుల వంటి కవితతో
పూతమై యుండెన్.

తిరుప్పాణాళ్వార్లు రంగని
తిరుముఖంబును జూచుచుండియు
నాడు గోదాదేవి వోలెను
స్వామిలో గలిసెన్.

రంగనాథుని యందు సాయు
జ్యంబు నొందిరి పాణనాళ్వార్,
నాడు మొదలగు దేవళంబుల
అమల నాది పిరాన్.

చదువ బడునతి భక్తి యుతముగ
స్వామి సన్నిధి నను దినంబును
నేటి వరకాచార మట్టులె
నాచరింపబడున్.

నాడు సారంగముని భుజముల
మోయు కతనను నతడు మునివా
హనుడటంచును పిలువ బడియెను,
పాణనను పేరున్.

కులము బట్టియు వచ్చియుండెను
స్వామి కరుణకు పాత్రుడగుటచె
పాణ నాళ్వార్లనెడి పేరను
పిలువ బడుచుండెన్.

భగవ దాదేశంబు చేతను
స్వామి దివ్యాంశలచె ధరణి న
నవతరించిన ఆళ్వారాదుల
పుట్టుకులమొకటె.

భక్తి యొక్కటె యుక్త మిద్ధర
కులము తోడనె ముక్తి రాదని
లోకులకు నుపదేశముసగుటె
పాణనవతారమ్.

మంగళము మాపాణ నాళ్వార్
మంగళము శ్రీ వత్సరూపా
మంగళము శ్రీ గాయకేంద్రా
మంగళము మీకున్.

నక్షత్ర తనియన్

శ్లో॥ కార్తికే రోహిణీజాతం శ్రీ పాణం నిచుళాపురే
శ్రీ వత్సాంకం గాయకేంద్రం ముని వాహన మాశ్రయే.

శ్లో॥ ఆపాద చూడమను భూయ హరింశయానం
మధ్యేకవేర దుహితుర్ముది తాంత రాత్మా
అద్రష్టృ తాం నయనయో ర్వి షయాంత రాణాం।
యోనిశ్చికాయ మనవై ముని వాహనం తం॥

శ్రీ తిరుప్పాణాళ్వార్ దివ్య తిరువ డిగళేశరణం
-ఓం తత్సత్-

  

ఓం శ్రీ లక్ష్మీ హయగ్రీవాయనమః
శ్రీ మతే రామాను జాయనమః

# శ్రీ తిరుమంగయాళ్వారు

ఉద్భవించెను నక్కజంబుగ
నా అగస్త్య కమండ లంబున
నుండి కావేరీ నదీ బహు
విభ్రమాభ్రములన్.

కాంచ కాంచన గంగ నూపుర
గంగ మొదలగు పేర్లతో భూ
దేవి గళమున వెలయు మౌక్తిక
హారముల వోలెన్.

ఎన్నొ వనముల పట్టణంబుల
దాటి ప్రజలకు జీవనంబిడి
బిల్వవ వనమును దాటి కలియును
దక్షణాంబుధిలోన్.

కలదు కాంచన గంగ చేరువ
చోళ ప్రభు పాలితపు దేశము
సిరుల గల్గియు కొరత లేనిపు
రంబు నన్యానమ్.

అట్టిదౌ నన్యాన నగరపు
పాలకుండొక దండనాథుడు
అతడు చోళుని ప్రాతి నిధి గను
నియమితుం డయ్యేన్.

అతడు శైవుడు భక్తి పరుడును
అవి నాడడయా రటంచును
పేరుగల్గియుః దేవ బ్రాహ్మణ
పూజ తత్పరుడున్.

అతని కొక్కకుమారు డొదవెను
అంశ నారాయణుని శార్ఙ్గము,
నీలననుచును నామ కరణము
జేసె పుత్రునకున్.

జనన కాలము కలియుగంబున
రెండు వందల పదియు నేడులు
నలను, కార్తిక పూర్ణిమయుగన
కృత్తికాతారన్.

జాతినాలవ జాతి యతనిది
గుణము ముఖ్యము జాతి గాదే
విద్యల న్రాజ్యాంగ నీతుల
ప్రజ్ఞ గ్రాహుండై (సర్వ ప్రజ్ఞుండై)

నిండు యౌవనుడయ్యేనీలుడు
రాజ సేవలో జేరె నాతడు
అతని పాలన దక్ష తెరిగియు
అధిపతింజేసేన్.

ఒక్క రాష్ట్రమునకును నతడును
పాలకుడుగా నుండి, ధర్మము
తప్ప కుండను ప్రజలు సుఖపడు
నటుల పాలించెన్.

చోళ ప్రభువీతనిని నమ్మెను
కాని నీలుడు మారి పోయెను
అధి పత్యము జిక్కునరికిన్
అన్ని అలవాట్లున్.

దురల వాట్లను గాగ నాతడు
గ్రామ సౌఖ్యము జూడ బోకను
గ్రామ సుఖముల మరగి నెంతో
భ్రష్ఠుడై పోయెన్.

పండితుల గోష్ఠులను వదలియు
మునిగె వారాంగనల పొత్తున
వారి సంగీతమున వశమై
శీలమున్వదలెన్.

కాని యవసర మగుచొ నాతడు
కదనరంగమునకును గదలియు
అరులు తరతర లాడు నట్టుల
రణమునుం జేయున్.

సవ్యసాచీ వాయు సుతులతో
సముడనంగను అనింగనపడు
నతని తో సరి వీరు లానా
డరయ లేరెందున్.

నాగపురమును నీలుడేలును
అట్టి పురముకు క్రోసుదూరము
శ్వేత ప్రాదమను క్షేత్రముండెను
మహిమ గలదదియున్.

శాంత మూర్తియు అచట నారా
యణుడు స్వచ్ఛము, పూర్ణ ప్రదమై
సార్థకంబగు అచటి సరసున
జలకమాడంగన్.

అప్సరసలట కరుగు దెంచియు
కొలనులో జలక్రీడ లాడుదు
రొక్క నాడొక అప్సరసయును
పూలు గోయుచునున్.

మిగిలె నచ్చట, మిగత రమణులు
దివికినిందామెగిసి పోయిరి,
కుతుకమున నాదేవ వేశ్యయు
మాన వాంగన గాన్.

మారి ఆసరస్త్రీర మందున
తిరుగు చుండగ, నోషదులకై
నావనంబున తిరుగు వైష్ణవ
బ్రాహ్మణుడు గాంచి.

ఎవర వీవును ఒంటిగానీ
వనము నందిరు గాడ నేమి,
నందియము వలదించు కంతయు
విందు నీ చరితన్.

వైష్ణ వుండను, భూసురుండను
ఓషదులకై వెదకు చుంటిని
నాకు సంతతి లేదు నిజమిది
నాదు చరితంబున్.

అంత అమ్నుల మిన్న తన కథ
అతవికివ్వివి పించి నాకును
ఎవరు లేరిప్పుడిచట, వత్తును
దయతొ గొని పొమ్మా!

మీరలేనా తల్లి దండ్రులు
మీదు బిడ్డగ నుండు దానను
కన్న ప్రేమను మించు పెంచిన
ప్రేమ నిజము గదా!

అంత వైద్యుడు సంత సించుచు
నట్టు లేయని వెంట నిడుకొని
ఇంటికింగొంపోయి నింతికి
కన్యకను జూపెన్.

అందమైన ముఖారవిందము,
అందచందంబులను గాంచీ
పుట్టి నింటికి మెట్టి నింటికి
ఖ్యాతి జేకూర్చున్.

ఇట్టి కన్యక యంచు నెంతో
నాదరంబును జూపుచుంగడు
గార వంబున పెంచు చుండిరి
కన్న బిడ్డ వలెన్.

ఆమె గృహమును జేరు వేళను
కుముదమును ధరియించు కతమున
కుముదవల్లీ యంచు బిల్వగ
నదియె పేరయ్యేన్.

రంభ మేనక ఊర్వ శాదుల
ధిక్కరించెడి విధము నుండెను
ఆమె యందము జెప్ప నలవా!
అవని నేరికినీ.

బిష గ్వర్యుని గాంచి నెంతయొ
భక్తి గౌరవములను గల్గియు
వందనం బొనరించె వినమిత
గాత్రుడై నిల్సన్.

నీలు గాంచియు సంభ్రమంబున
అతిథి సత్కారముల జేసియు
ఉన్న తాసనమందు నతనిని
గూర్చొనం జేయన్.

కుశల ప్రశ్నల వేయుచున్నా
తరుణి వివరంబులను నెరిగియు
కుముద వల్లిని జూచె యాదృ
చ్ఛికము నచ్చేటన్.

పంచ బాణుడు వేసె బాణము
నీలు కోర్కె పులుంగు రెక్కల
విప్పి రెపరెప కొట్టుకొనుచును
ఎంతొ ఎత్తెగిరెన్.

విన్నదానికి ఎన్నొ రెట్టుల
మిన్న అన్నుల మిన్న సొగసును
ఇట్టి పుత్తడి బొమ్మ నింకను
వదల వలదంచున్.

తనదు భావము తెలిపె వెజ్జుకు,
తనయ పరిణయ చింత దెలుపగ
అంత నీలుండనియె నతనితో
స్వామి తమకూతున్.

అగ్ని సాక్షిగ బెండ్లి యాడెద
మీరు దయతో సమ్మతించిన
పేద వానికి పెన్ని దట్టుల
నేను తరియింతున్.

కుముద వల్లి కులంబు తెలియదు
మాదు ఔరస పుత్రి గాదే!
ఐన మాకును ప్రాణ ప్రదమే
మాదు పుత్రికయే.

అనెడి బాపని మాటలను విని
కులము గోత్రము మాకు వలదే!
కులము కన్నను గుణము మిన్నొ
గుణము గోరెదనే!.

మీరలామోదించు డనగను
ఇతని జాతి చతుర్థ జాతీ,
కుముద వల్లిది ఏకులంబో
ఏమి సేయుదునే,

తెలసి వలచి వరించి వచ్చెను
ఇతడు పట్టిన పట్టు వీడడు
రాజు పిదపను రాజు నీతడు
వైరముందగదే!

ఇటుల దలచియు భార్య తోడుత
కార్య మాలోచించి అస్తని
యనెను భూసుర శ్రేష్ఠు డప్పుడు
పొంగె నీలుండున్.

భూరి భూషణ అంబరములతో
భార్య భర్తల సత్కరించెను
కుముదవల్లిది నెరిగి తండ్రిని
బిలిచియిట్లనియెన్.

ఆశ్రయంబును లేని నన్నున్
మన్ననతొదరిజేర దీసీ
తల్లి దండ్రుల కన్న మిన్నగ
పెంచితిరి తండ్రీ.

మీదు మాటను దాటనేరను
నీలునే పరిణయము నాడుదు
నొక్క నియమము నాకు గలదున్
దాని వినిపింతున్.

ఎవరినో నేనెరుగ నైతిని
మీదు పెంపక మందు పెరిగితి
పంచ సంస్కారముల బొందియు
వైష్ణ విన్నైతిన్.

చూడగా నిత డవైష్ణవుడును
పంచ సంస్కారముల బొందీ
వైష్ణ వుండిత డగుచొ నితనిని
పతిగ గ్రహియింతున్.

ఇదియెనా అభిమతము జనకా!
అతనికిందెల్పుండ నంగను
దాని వినియానీలుడును అం
గీకరించి జనెన్.

నాగ పురమును జేరి యచటికి
చేరువంగల శ్రీనివాస
స్థలమునకు జని పూర్ణులనియెడి
వైష్ణవాచార్యున్.

ఆశ్రయించియు పంచసంస్కా
రముల బొందియు భుజములందున
శంఖ చక్రాద్యాది ముద్రలు
వెలయు చుండంగన్.

కంఠమున నళి నాక్ష తులసీ
మాలలును వ్రేలాడు చుండగ
పరమ వైష్ణవ శీలుడై జనె
కుముద వల్లి గనన్.

గృహము నందున వచ్చి నిలిచిన
నతని గాంచియు ముదము నొందియు
వందనం బిడి ఆసనం బిడి
నిట్టులన్ననియెన్.

కర్మ జ్ఞానా జాతుల నియెడు
రెండు మానవ జన్మకుంగల
వట్టి కర్మ న భేదముంగల
దరయ జ్ఞానమునన్.

భేదముండదు, కర్మ జాతియె
జ్ఞాన జాతిగ మారునప్పుడు
పర్వముమ భగవత్స్వరూపము
అగుచు గన్పించున్.

స్పర్శ వేదిన ఇనుము స్వర్ణము,
పుటము బెట్టిన ఔషదంబును,
ఎటుల గుణవంతంబు నగునో
అటులె మనుజులకున్.

తామ సాఆహారము ల్దిన
సత్వరజములు పెరుగుచుండును
శత్రులార్గురు దాగి యుందురు
సతనిలో సతమున్.
(ఆహార శుద్ధౌ సత్వశుద్ధిః)

శుద్ధమౌ నాహారముంగొన
మానసికమౌ శుద్ధిగల్గును
భోజనంబున దేహమే పరి
ణామమున్నొందున్.

నీదుదేహము తమోమయమౌ
రెండు దినముల లోన మారదు
నియమములు లేనట్టి వాడౌ
అన్నిటన్వెనకే.

రోగి రోగము పోవడముకై
కఠిన పథ్యము వెజ్జుచెప్పును,
వైద్యుడే సడలించెనేనీ
రోగి సడలించున్.

దాన రోగము వృద్ధి చెందును
కాన నీకొక కఠినమౌ నొక
నియమమునునే బెట్టు చుంటిని
దాని వినుమయ్యా!

ఒక్క వత్సరకాలముననుు
వెయ్యి ఎనిమిది మంది స్వాముల
కీవు భోజనములను బెట్టియు
పాద తీర్థంబున్.

స్వీకరించుచు భుక్త శేషము
తినుటచే పరిశుద్ధుడగుదువు
అపుడు శ్రీ వైష్ణవుడ వయ్యెదు
భార్య నయ్యెదనేన్.

ఆమె చెప్పిన విధము జేయగ
కుముద వల్లియు పెండ్లి యాడెను
వైష్ణ వుండును పొంగి పోయెను
నీలుడున్ మురిసెన్.

కుముద వల్లీ సహితుడై యత
డరిగె తనదౌ రాజధానికి
పరమ భాగవ తోత్తమునిగను
మారె నాతండున్.

ధనా గారము వట్టి పోయెను
చోళు కప్పం బట్టు లుండెను
కుముదవల్లీ మాట నెగ్గెను
కాని నీలునకున్.

వెయ్యి మందికి తదీయారా
ధనము జేసెడి భాగ్యమబ్బెను
అదియెనలవాటయ్యెవతనికి
మాన లేకుండెన్.

కప్పమునకై నున్న ద్రవ్యము
కర్పూరము వలె కరిగి పోయెను
రేపు మాపని గడుపు చుండియు
త్రిప్పు చున్నుండెన్.

కప్పమును పంపుటను మానెను
తదీయారాధనయు సాగును
లోటులేకను సాగు చుండెను
వారి వైష్ణవమున్.

కొండలైనను కరిగి పోవును
కోరి రాళ్ళను నూడ లాగిన
దండి గుండెతో వైష్ణవులకును
భోజనాల్నిడిరీ.

అంత చోళుండాగ్రహించీ
నీలునిన్బంధించి దెండన
భటులనంపగ వారలుంజన
వారలంజూచీ.

దండతాడిత భుజగ మట్టుల
బుసలు గొట్టగ బెదరి పారిరి
తోక త్రొక్కిన త్రాచు వోలెను
చోళు డపుడయ్యెన్.

యుద్ధ భటులను ఆరువేలను
పంపె నీలుని గట్టి తేగను
వారు కమలా పురమ్ము జేరిరి,
అచట భోజనముల్.

స్వాములందరు జేయుచుండిరి,
సైనికులగని కినుక తోడుత
ముక్కు ముట్టియు వారి నెల్లర
ముక్కు నడగించెన్.

పదియు నాలుగు వేల అమరుల
ఖరుడు దూషణులనెడు వారల
రాము డొక్కరు డెట్లు నరికెనొ
నటులె తానరికెన్.

మరణ మొందిన వారు కొందరు
కాలు చేతుల దెగిన కొందరు
చావగా బ్రతికున్న కొందరు
చోళునకు దెల్పన్.

అతడు నేను దీయకను సైన్యము
పెంపుమున సైన్యాధిపతితో
బంపినను నపజయమెకూరెను
రాజశేఖరునకున్. (చోళునకున్)

వింత యానొక విషయముండెను
తదీయారాధనము జరిగెడు
సమయమున కరుదెంచు సైన్యము
రణమునట పారున్.

వైష్ణవుల భయ భీతు లగుచును
విలునకు విజయమ్ము గోరుచు
మంగళాశాసనము జేతురు
మదిని సతతంబు.

అరరె! ఎంతటి పాపుడనునే
చోళుడా శ్రీవిష్ణు భక్తుడు,
రాజ్య మొసగిన దాత, సజ్జన
త్రాత ధర్మ్ముండున్.

ఇదియు జరుగుట కేనే మూలము,
ఇతని యెడలను కృతఘ్నుండను
నమ్మక ద్రోహంబు జేసితి
ఎంత నీచుండన్.

కుక్క ముట్టదు కృతఘ్నునిదౌ
మేని మాంస మటంచు నందురు
వీర మరణంబుచిత మిప్పుడు
నాకు నిష్కృతియున్.

ఇతని చేతిలో మడయుటేనా
కుచిత మంచును తలచి నెత్తిన
ఖడ్గమును క్రిందునకు జార్చగ
చోళుడది గాంచీ.

నీలుడా హరియించె ద్రవ్యము
రాజద్రవ్యము నపహరించుట
నేరమే యౌగాని యితడున
వద్యు డెటులైనన్.

అనుచు నడిదము డించి బింకము
తొలగ కుండగ నీలు తోననె
నాదు ధనమును నిచ్చికదలుము
నిన్ను క్షమియింతున్.

అనగ వినెనా నీలుడప్పుడు
అతడు భాగవతోత్తముండును,
జ్ఞానభక్తివి రాజతుండును
మాట గడుసరియున్.

రాజచంద్రమ! నీదు సైన్యము
నన్ను చంపగ వచ్చె నంచును
భ్రాంతితో యుద్ధమును జేయగ
వారు హతులైరీ!

ప్రాణ రక్షణ కొరకనేనా
నరునివలె యుద్ధమును జేసితి
నిందు నేను నిమిత్త మాత్రుడ
కాలమును మూడెన్.

మాట చతురత నేర్పడంగను
నీలు డట్టుల ననగ వినియా
చోళు డప్పుడు కినుక తోడుత
ననియె తానిటులన్.

ఆపు వాచా లత్వమింకను
నక్క వినయము లింకనేలా!
ధన మొసంగిన పిదప తిండీ!
నిన్ను చెరనుంతున్.

వీర భటులారా వినండీ
ఇతని నిర్బంధమున నుంచుడు
ధనము నిచ్చు వరకును మీరలు
ఇదియు నా ఆనా!

మూడు దినములు ఉపవసించియు
చోళు నిర్బంధమున నుండెను,
మదియు భగవధ్యాన్న మందుని
మగ్నమయి యుండెన్.

నీలు స్వప్నంబునను కంచీ
వరద రాజులు కాను ఓంచీ
వేగవతి నదిలోన ధనమును
కలదు గొనుమయ్యా!

అంచు నుడువను అతిగ పొంగుచు
కంచి వరదుల నించి మదినను
మించు భక్తిని సంచితుండై
నెంచె తెలవారన్.

తెల్లవారిన పిదప నీలుడు
ఓహో రాజోద్యోగులారా!
నాదు ధనమును భూమి యందున
దాచి యుంచితినీ.

ధనము నందారవపు భాగము
ధరను నిక్షిప్తంబు జేయుట
విధియు మానవునకు గానను
ధనము దాచితనీ.

నన్నునటకును గొంచు బోవుడు
ధనమొసంగుదు మీకు నేనట
అనగ వారలు నటుల జేసిరి
లేదు ధనమచటన్.

భటులు కినుకతొనింద జేయుచు
మరల నిర్భంధమున నుంచగ
చింతతో నీలుడును నుండగ
రాత్రి కలలోనన్.

కంచి వరదులు కాను పించీ
ధనముగల గుర్తులను దెల్పగ
మరల రాజోద్యోగులతొ నన
వారు గొంపోవన్.

వేగవతిలో వెదక నతినికి
అమిత ధనమును లభ్యమవగను
రాజద్రవ్యము భటుల కొసగను
నీలు నిన్వదలీ.

వెడలి నారలు రాజు కడకును
ద్రవ్య మొసగుచు తెలిపి రెల్లను,
చోళుడున్వెర గందె నప్పుడు
ఇచట నీలుండున్.

తదీయారాధనకు మిగిలిన
ధనము గొనియును నాగ పురమును
జేరి యచ్చట పూర్వ విధమును
తదీయా రాధన్.

జేయుచుండగ చోళ రాజుకు
దెలిసె నీలుని స్వప్న మందున
వరద రాజులె ధనము దెల్పిన
కథయు విషదము గాన్.

అంత చోళుండిట్లు తలచెను
నీలుడా సామాన్యుడెట్లొ
కంచి వరదుల కరుణ బొందిన
ఘనుడు వీరుండున్.

భాగవత తత్వమ్ము పూర్తిగ
భావగత మొనరించు కొనియెను
మహా మహితాత్ముండి తండును
మాన్యు డితడు గదా!

గరుడ వాహను కరుణ నితనికి
పూర్తిగా నండగను నుండెను,
తొల్లి కురురాట్సభను ద్రౌపతి
పరిభవింపబడిన్.

కృష్ణ శరణాగతిని నొందీ
హరిచె సంరక్షణను బొందీ
కౌరవుల నిర్మూలనమునకు
కారణంబయ్యేన్.

ఈ మహాభాగవతు శరణము
వేడుటే కర్తవ్య మిప్పుడు
అనుచు రాజోచితపు గౌరవ
ములతొ బిలిపించీ.

ఓహో! భాగవతాగ్ర గణ్యా!
నాదు అపరాధము క్షమింపుము
తెలియకే నొనరించి యుంటివి
నన్ను దయగనుమా!

నీదు చరితము కడును వింతౌ
తదీ యారాధనము నెంతయొ
భాగవతులకు జేయు చుండిన
పరమ పుణ్యాత్మా!

నీకతంబున నేతరించితి
ననుచు నీలుని కౌగిలించియు,
బహు విధాభరణముల నంబర
ధనము నుమ్నొసగెన్.

సత్కరించియు నంపె నీలుని
నీలుడిచ్చిన ధనముతో దా
భాగవత సంతర్పణంబును
భక్తితో జేసెన్.

నీలుడే పరకాలుడన బడె
భాగవత యోగంబె యోగము
దాని మించిన యోగ మింకొక
టరయ లేదెందున్.

భాగవతు లొకరు కలసిన
యపుడు భగవద్గుణములను సం
ధాన మొనరించుచును తమదౌ
దివ్య అను భూతుల్.

చెప్పు కొనుచును హరిని చిత్తము
నందు నిలిపియు నాట పాటల
స్తోత్ర మొనరించుచును దినముల
వెళ్ళ బుచ్చుదురే.

ఒక మహా యోగంబు నియ్యది
యోగ మాధుర్యంబు ననుభవ
పూర్వకంబుగ నెరుగ వలెనౌ
వినిన తెలియదుగా!

కొన్ని సంవత్సరము లిట్టుల
వేల వైష్ణవులకును తదీయా
రాధనమును జేసి పొందెను
ఇట్టి మాధూర్యమ్.

ఎన్ని కష్టము లెన్ని యాటం
కములు వచ్చిన వదల నట్టీ
స్థితియు వచ్చెను వైష్ణవారా
ధనము నెటు సాగున్.

చేత కాసులు నిండు కొనియెను
బెల్ల ముండిన చీమలుండును,
తలపు మాత్రము తాత పెండిలి
జరిపి తీరుదునే.

ననెడి భావము గలడు నీలుడు
మిత్రు లందర బిలిచి వారితో
మారు వేషము వైచి రాత్రుల
దోపిడుల జేయన్.

తనదు తలపును నెరుగ జేయగ
వారలందరు సరియె ననిరీ
దారి దోపిడి మొదలు పెట్టెను
ఆప్త మిత్రుల తోన్.

నీటి మీదను బోవు నొక్కడు
నోటి గాలితొ గడియ దీయును
నొకడు నొదగును చెట్టు తొఱ్ఱలొ
ఒకడు చెట్లెక్కున్.

కఠిన తరమౌ కార్యముల నవ
లీల గానింకొక డొనర్చును
ఇట్టి శిష్యుల తీర్చి దిద్దెను
వారలైదుగురే!

పరమ భాగవతులును వీరలు
దారులును పట్టణము పల్లెల
కొల్ల గొట్టుచు భాగవతులకు
విందులం జేసెన్.

దొంగ లందరు నీతి పరులే
వైష్ణవుల తిరుమాళి హాళలో
దొంగతనముల జేయ రాదను
నియమ సంచారుల్.

యముడు దూతల కాజ్ఞ నిడెనట
విసర బోకుడు మృత్యు పాశము
విష్ణు భక్తుల మీద నెప్పుడు,
ప్రభువు నే గానే.

వారి ప్రభువా హరియు నేనున
వైష్ణవులపై నాధి పత్యము
గల్గి నాడ నటంచు దెల్పిన
విధము నీలుండున్.

యముడు: శ్లో॥ పరిహర మధు సూదన ప్రపన్నాన్
ప్రభు రహమన్య నృణా మవైష్ణ వానాం!

అటులె నీలుండాన తిచ్చెను
విష్ణు భక్తుల దోచ బోకుడి
వైష్ణ వుల తిరుమాళిహాళను
జేర బోకండీ.

కుముద వల్లియు నెంతొ భక్తితొ
తదీయా రాధనను జేయుట
నిత్య విధిగా జరుపు చుండెను
భక్తి భావము తోన్.

ఒక్క దినమున నీలు డొక రా
త్రంబు వైష్ణవ గృహము కేగెను
నింటి వారలు భాగ్య వంతులు
పరమ నైష్ఠికులున్.

వారు తిందురు స్వర్ణ పాత్రల,
త్రాగుటకు వాడుదురు (పాత్రల) నట్టివె
వారి యిల్లును స్వర్ణ మయమే
అధిక శ్రీ మంతుల్.

తెలియకే పరకాలు డచ్చట
జేరు నంతనె కుండ పోతగ
కురియు చుండెను వర్షమప్పుడు
రాత్రమున్నయ్యేన్.

రాత్రి భోజన మైన పిదపను
పాత్రలను శోధించు టకునై
గృహిణి బయటకు నరుగు దెంచనె
రామ బాణము గన్.

దూసుకొనిజని పాత్రలంగొని
పారు నంతనె నామె నోటను
వెడలె అస్మత్ గురు భ్యోన్నమ
మనెడి పద జాలమ్.

మంచి చెడులును జరిగి నప్పుడు
బలుక తగదశ్లీల వాక్యము
రామ రామా హరిహరీయనొ
యనుట పరిపాటీ.

అటులె ఆచార్యులను నిష్ఠతొ
గొల్చు వైష్ణవులెల్ల గురువుల
నను దినంబును గొల్చు చుందురు,
కాన గృహిణనియెన్.

అరరె! ఎంతటి దొసగు జేసితి
నిది ప్రపన్నుల గృహము గావలె
వీరి ద్రవ్యమె తస్కరించితె,
ఎంత నీచుండన్.

అనియు నాల్కను కరచుకొని తా
స్వర్ణ పాత్రల విసిరె గృహమున
ముసుగు నిడుకొని వెడలి పోవగ
నబ్బురం పడియున్.

వైష్ణ వప్పుడు జెప్పె భర్తతొ,
అంత నాతడు మందలించుచు
మూఢు రాలా! అతడె వండో
ఎరుగ నేరవుగా!

వచ్చిరా పరకాలు లిటకును
వారు సాక్షాత్ స్వామి సములును
శ్రీ మహాభాగవత తదియా
రాధనా పరులున్.

నీవు నేమియు బలుక కుండిన
నతడు బంగరు పాత్ర గొనునే,
నాడు రామాయణము నందున (నందలి)
ఉడుత పాత్ర వలెన్.

మనదు బంగరు పాత్ర తదీయా
రాధనలో వినియోగ మయ్యెడి
దట్టి అవకాశంబు లేదిక
ననుచు చింతించెన్.

గృహిణి గూడను ఖిన్ను రాలవ
మందలించిన ఫలిత మేమని,
ఆమె నోదార్చియును భగవ
ధ్యాన మొనరించెన్.

ఇవ్విధిన్ పరకాలు డట్టుల
భాగవత ప్రపన్న ప్రతి ప
త్తినిని వీడక వ్యగ్రుడై కమ
లాపురంబందున్.

ఉండ నొకనాడొక్కవింతగు
సంఘటనమును జరిగె నచ్చట
నాడు పరకాలుండు వెడలెను
దారి దోపిడికై.

దారి దోపిడి కార్యక్రమమున
తనకు సాయము గాను కొందర
వెంట నుంచుక వెడలి అడవిన
పొదలొ దాగుండెన్.

చూచి చూచియు విసుగు వచ్చెను
బాట సారులు నెవరు రారే
ఏల వత్తురు తెలసి తెలసీ (జొత్తురు)
మృత్యు గహ్వరమున్.

ముసుగు దొంగొక డేపు మీరను
దారి దోపిడి జేయు చుండెను,
ఎవరు బోయిన వారి నెల్లర
కొల్ల గొట్టతడున్.

ఇట్టి వార్తను వినిన వారలు
అట్టి దారిన జనుట మానిరి
నిర్ధనుండై నీలు డెంతయొ
మదిని వ్యథ కల్గన్.

రాత్రి జేసిన పాప మంతయు
పగటితో నశియించు నట్టుల
రాత్రి సంపాదించు ధనమును
పగలె సరిపోవున్.

రొక్కమా మిగలడము లేదే
ఏమి చేయుట దోపకనుపర
కాలుడా దేశించె బంటును
చెట్టు నెక్కుమనెన్.

సాయకుడు నపుడెక్కె చెట్టును
దృష్టి నిగుడించపుడు జూడగ
దూర మందున పెండ్లి బృందము
రాక గనుపడియెన్.

అంత శ్రీ రంగేశు డాపర
కాలునింగరుణించె నెంతయొ
స్వామి కరుణయె పెండ్లి బృందము,
సూత్ర ధారతడే.

చెట్టు నెక్కిన వాడు గట్టిగ
ఓయి పరకాలుండ త్వరపడు
పెండ్లి బృందము వచ్చు చుండెను
సిద్ధముంగండూ!

కత్తులతొ సిద్ధముగ నుంచుమి
బెద్ద బేరమె తగిలె మనకును
అంత ఆపెరుమాళ్ళ దయయే,
కాల యాపనమున్.

జేయ బోకుడు వారలదిగో
రానె వచ్చిరి యడ్డ గింపుడు
అందరిని నిలబెట్టి దోచుడి
జాల మేలో హో.

అనుచు కేకను వేయు నంతలొ
పెండ్లి బృందము నటకు జేరగ
విచ్చు కత్తుల ఝుళం ఝుళలతొ
వారి నదలించి.

వరుసగా పరకాలు శిష్యులు
బంధువుల భూషణము లెల్లను
కొల్ల గొట్టుచు రాసులగ నట
బోయు చుండంగన్.

పెండ్లి కొడుకును దోచుపని పర
కాల స్వామియె బెట్టు కొనియెను
పల్లకిలో గూర్చుండి యుండిన
పిల్లవాని గనెన్.

అబ్బో! అబ్బో! ఏమి సొమ్ములు
వజ్ర వైఢూర్యాది నగలును
ఆకుబేరుని నిధులు తొమ్మిది
వీటి సమమౌనా!

విలువ గట్టుట నాదు తరమా!
ఇచటి సంపద నింత నుండిన
నింట సంపదయెంత నుండెనొ
దాని దోచెదనే.

ఇతని సంపద కొల్ల గొట్టిన
భాగవత సేవలను జేసెద
మేని ప్రాణములుండు వరకును,
మొదట వరుదోతున్.

అనుచు నావరు జేర బోయియు
కత్తి జూపుచు దోచె సర్వము
కాలి వ్రేలున నున్న బంగరు
టుంగరం బతడున్.

ఎంత గట్టిగ లాగు చుండిన
అంత గట్టిగ బిగసె వ్రేలుకు
పవనసుతు వాలంబు నెత్తని
పవనసుతు వోలెన్.

అయ్యో నాపరకాలు పనియట
పెండ్లి కొడుకపుడతని జూచుచు
నగుచు కలిని జయించి నావే
ఇంక చాలునులే.

రాసులకు రాసులను దోచితి
వింక దీనిని వదల రాదా!
ఇంత లాలస తగునటయ్యా!
వింత మానిసివే.

అనిన వోహో! వరుడ వినుమా!
ఒక్క దానిన నీకు వదలిన
లాభ మేమిటి? నాకు నిదియౌ
విస్తరాకులకున్.

అనుచు పండ్లతొ లాగ జూచెను
అతని యత్నము విఫలమయ్యెను
దోచి యుంచిన సొమ్ము లెల్లను
లేశ మాత్రంబున్.

కదలడము లేదనుచు శిష్యులు
జెప్పు చుండగ నదరి పడెనట
నరిభయంకర వీరుడాపర
కాలుడా వరునిన్.

గట్టిగా దాబట్టు కొనియును
పండ్లు పటపట గొరుకుచుననో
విప్ర వరుడా! ఏదొ మంత్రము
చదివి యున్నావే.

మంత్రమును ఉపసంహరింపుము
లేనిచో నాకత్తి నీదగు
కుత్తుకను తెగటార్చు నంచును
నెత్తె ఖడ్గంబున్.

ఓయి! కలివైరీ! వెనేర్చుకొ
అట్టి మంత్రము నీకె జెప్పెద
వినయ వినమిత గాత్రుడవునై
నిలువు నా మ్రోలన్.

అనియు నూతన వరుడనంగనె
నేను భాగవతోత్తములకే
తలను వంచితి నింత వరకును
వంచ నితరులకున్.

తప్పితే భగవంతునకునే
శీర్షమును నవనతము జేయుదు
ఏతని కెట్టుల మ్రొక్కు వాడను
ఏతడు దేవుండా!

అంజలిని బంధింపలేనే
వినయ మీయెడ జూపలేనే
గతియు ద్యోతక మగుట లేదే
ధనము గావలెనే.

అనువు గానిచో సధికులముమే
మనుట ధరలో పాడి గాదే
పెద్ద కొండయు నద్ద మందున
చిన్న నైయుండున్.

అంతయును మనమంచి కేయని
ఆర్య వాక్కిట సత్య మయ్యెను
ఇదియు నొక దానికిని మంచిదె
వినెద మంత్రంబున్.

ఈ ప్సితార్థము తీరునేమో
భాగవత కైంకర్య సిద్ధియు
అవిరళంబుగ సాగునేమో
మంత్ర రాజమునన్.

మంత్రముల కాధీనులమరులు
బ్రాహ్మణాధీనంబు మంత్రము
అట్టి బ్రాహ్మణు లెల్ల వేళల
మాదు దైవముగా!

ఇష్ట కైంకర్యంపు సిద్ధికి
నేనుపయోగించు కొందున
టంచు తనమది తలచి నాపర
కాల యోగీంద్రుల్.

వినయ వినమిత గాత్రుడునునై
అంజలిని బంధించి పల్లకి
లోన నుండిన వరుని ముఖమున
తనదు చెవి జేర్చెన్. (నొగ్గెన్)

పెండ్లి కొడుకొక మంత్రముపదే
శించ, నందున నాల్గు వేదము
లంత రార్థము గల్గియుండుట
మహా యోగీంద్రుల్.

సనక దాదులు బ్రహ్మ ఋషులును
ఇట్టి మంత్రము నాశ్రయించే
హరి పదంబును జేరబోదురు
అక్ష రాక్షరమున్.

మహా మహితార్థమును గల యీ
మంత్ర మాముష్మికము లైహిక
ఫలములను సాధించి ప్రాజా
పత్యమున్నొసగున్.

అట్టి శ్రీ కైవల్య సిద్ధికి
అనువు నష్టాక్షరియు ననియెడి
నాది నారాయణుని అష్టా
క్షరము మూలంబౌన్.

పెండ్లి కొడుకా మంత్రమును పర
కాలునకు మపదేశమొసగను
అప్పుడా పరకాలు డెత్తెను
తనదు శీర్షమునున్.

పెండ్లి కొడు కగు పడుట లేదే
పల్లకీ ఏమయ్యె నేమో
కనులు మిరుమిట్లపగ నుండెను
కాంతి పుంజంబున్.

అంతలో నాకాంతి పుంజము
గరుడ వాహనమెక్కి శ్రీరం
గేశు సాక్షాత్కార రూపున
మారి కన్పించెన్.

పెండ్లి కొడుకా రంగ నాథుడు
పెండ్లి కూతురు రంగ నాయకి
ఆ విధిని పరకాలునకునా
దివ్య మంగళుడున్.

దివ్య మంగళ విగ్రహంబును
చూపె దివ్య విభూతి నతనికి
నమిత ఆనందమున కందలి
తాంత రంగుండై.

పారవశ్యంబు నను మునిగియు
స్తోత్రమును జేయగ నశక్తుడు
నైన పరకాలునకు పదములె
నోట రాకుండెన్.

అంత శ్రీ రంగేశు డాపర
కాలు గాంచియు కరుణ తోడుత
ఓయి! భక్తా! కోరు వరముల
దీర్తు నేనగన్.

ఇంత కన్నమ దేని కోరుదు
కోరదగినది లేదు స్వామీ!
ఐన విన్నపమొండు జేసెద
అవధరించండీ.

ఇట్టి బిల్వారణ్య మందున
నీ స్థలంబున నిట్టి రూపున
భక్తులను బ్రోవంగ వెలయుము
దీని కోరెదనే.

నను చు పరకాలుండు కోరిన
మంద హాసము చిందు లేయగ
రంగ నాథుండన్తటంచును
అతని కరుణించీ.

ఓహో! కలి వైరీవుధన్యుడ
విచట నుండెద నీదు కోర్కెను
నేడు మన కిరువురకు జరిగిన
వింత ఘట్టంబున్.

ఇచట మరినా యితర దేవా
లయము లన్నిట దొంగ దోపను ( దోపుకథయ
పేర హరికథ నాట కములుగ
వార్షి కోత్సవమై.

చెప్పబడు చుండియును మనుజులు
ఇట్టిదానిని అనుభవించిన
వారలెల్లరు నాదు కరుణకు
పాత్రులగు వారల్.

అంత రంగేశుండు నాజ్ఞా
పించ పరకాలుండు నాజ్ఞను
శిరోధార్యంబంచు నెంచియు
కుముద వల్లిగనీ.

తమదు కమలా పురము నందున
మండి వైష్ణవ తదీయారా
ధనమ జేయగ నుండు మనియుమ
జేరె శ్రీ రంగం.

తదీయా రాధనా నందం
బందె మునిగెను పూర్వ మాతడు
నిత్య వాసము చేత గలిగిన
భగవదనుభవమున్.

రసము గంగా ఝరివిధంబున
స్వామి సాక్షాత్కారముననా
ద్రవిడ భాషా సాశురములుగ
వెడలె వాగ్రూపం.

బవియె దివ్య ప్రభంద షట్కము
నాల్గు వేద షడంగములు నౌ
శిక్ష వ్యాకరణము నిరుక్తము
జ్యోతి షాఛందస్.

కల్పముల వలె వీరి రచనలు
చిత్ర విస్తారాశు మధురము
లనెడి నాల్గు విధంబులొకవి
తలుగ వెల్వడియెన్.

కాన పరకాలుండు "చతుష్క
వీంద్రు డనియెడి బిరుదు కలిగెను
వెయ్యి మూడూ వందలరువది
సాశురాల్వ్రాసెన్.

రంగ నాథుల ఆలయంబున
మార్పులు నైంకర్యములతా
నెన్నొ చేయం దల్చి దృఢనం
కల్పముంగల్గీ.

శిష్యులందర జూచెనాతడు
వారలాతని వెంట నుండిరి
వీడ నట్టి మైత్రి బంధం
వారలందరిదీ.

సంప దాపద లందు వదలరు
జీవునకు పరమాత్మునకు గల
నవ విధము సంబంధ మట్టుల
స్నేహ బంధంబున్.

అట్టిదే గురు శిష్య బంధము,
సేవకుల యజమాని బంధము,
రాజు మంత్రుల స్నేహ బంధము,
వీరి బంధంబున్.

మూడు విధసంబంధముల్గల
వార లాపర కాల శిష్యులు
కష్ట సుఖముల భాగ స్వాములు
గాన వారలతో.

మంత్రులారా! మిత్రులారా!
పూర్వజన్మ మకృతము వలనను
మనదు అదృష్టంబు వలనను
రంగనాథులకున్.

సన్నిధిలో కాలంబు గడుపుచు
సేవ జేసెడి భాగ్య మబ్బెను
ఆలయా ప్రాకార గోపుర
మంటపము లెల్లన్.

సప్త ప్రాకారాది మంటప
ములను నిర్మించుటకు నైధన
మెంత యోగావలయుమనకది
ఎటుల సమకూరున్.

విత్తమును సాధించుటకు నతి
కష్ట సాధ్యంబైన గానీ
పాత పద్ధతి వదలి వేద్దాం,
ధనము కావలేనే.

ననుచు పరకాలుండు ఏకాం
తంబుగా సభ్యులను జేర్చి
మీకు మార్గం బేదితోచిన
దాని దెలపండీ.

అనగ తర్జన భర్జనలతో
కొంత తడవును చర్చ జేసిరి
చివర కందరు నేక కంఠం
బునను నిటుల నిరీ.

నాగ పట్టణ మందు వింతగు
బౌద్ధ దేవాలయము గలదట
అందుగల విగ్రహము పెద్దది
అంత పుత్తడియే.

అందు చొరరా దెరికైనను
నినిని విగ్రహ మెటుల గొంతురు
దాని నిర్మాణంబు జేసిన
శిల్పి యెట మండో.

అదియె లభ్యం బైనమన శ్రీ
రంగ నాథుల గోపు రాదులు
పూర్తి యౌ! మన మట్టి దానిని
పొంద జాలుదు మా?

సాధ్యమౌ ధర సాధనం:
అన్యథాశరనంబు నాస్త్ర
సర్వ సంరక్షకుడు రంగ
నాని భారంబే.

ననిరి వారలు మంచి సూచన
జేసి నారని వారి మెచ్చియు
నాగ పట్టణమునకు పరకా
లుండు తావెడలెన్.

తీర్థ సార్థకములుమ గల
టించు వెడలియు నాగ
స్వామి పుష్కరిణందు గృ
స్నానముమ జేసి.

అచటి సుందర రాజ స్వామిని
తన అభీష్టము దీర్చు మంచును
భక్తితో సేవించు కొనియును
వెడలె నట మండిన్.

బౌద్ధ దేవాలయము జేరిచ
దాని చుట్టును దిరిగి చూ
గోపురము నతి మన్న తం
నున్నగా నుండెన్.

ఆలయంపు ప్రవేశ ద్వారము
ఎంత దిరిగిన నెంత వెదకిన
గోచరము గాకుండ నుండెన్
పద్మ వ్యూహమనన్.

అంత నాపరకాల స్వామియు,
కొంత కాలము నచట గడిపియు,
శిల్పి ఎవడో చాల నేర్పరి
అతని నరయపలెన్.

అనుచు జాడలు దీయుచుండగ
దెలసె నొకనా డతని గూర్చియు
శిల్పి నేపాళమున గలడని,
నావనొక దానిన్.

నెక్కి నేపాళ్ దేశమందలి
శిల్పి నన్వేశించి కనుగొని
తనదు పని నెర వేరెనింకని
మదిని భావించి.

అచట చాలా కాలముండియు,
శిల్పితో పరిచయము పెంచియు,
పరిచయం బే మైత్రి గానవ
మాట చతురతతో.

శిల్పి కెన్నియు కట్టు కథలను
పిట్ట కథల పురాణ కథలన
వీన కథలను జెప్పి నాతని
వశము జేమకొనెన్.

శిల్పితో తాననియె నిట్టుల
అపర మయుడా! శిల్పి శ్రేష్ఠా!
అవధరింపుము ఒక్క కథనది
మాకు చెందినదౌ.

నాగ పట్టణ మనుచు చక్కని
పట్టణము మాప్రాంతమందున
కలదు బౌద్ధాలయము నొక్కటి
అట్టి ఆలయమున్.

ఎరిగి యుండవు నీవెపుండును
అట్టి ఆలయ శిల్ప వైభవ
మమరులకు బొగడందరంబే
చూడ వలసినదే.

భాషచాలదు దాని బొగడగ
ఏమహాశిల్పియును గట్టెనొ
ఇపుడు దేదీ ప్యముగ నుండెను
ఏంత శిల్పంబొ.

అంత ఎత్తగు గోపురంబును
భారతావని యందె లేదే
మనుజమాత్రుల కదియసాధ్యము
దేవ నిర్మితమొ.

ఏలననగా దేవళంబున
బుద్ధ విగ్రహ మొండు గలదట
అదియు చొక్కపు బంగరంబట
అది సురక్షితమొ.

చాల కాలంబటులె నుండెను
కాని చాలా ఓర్పు నేర్పుమ
కల్గి యుండిన దొంగెవండో
దోచె నద్దానిన్.

నిటుల నాకథ పూర్తి జేసియు
బాధ ద్యోతక మవగ జెప్పిన
శ్రోతగానున్నట్టి శిల్పియు
అదరి పడెనపుడున్.

మరల నొకపరి జెప్పు మనియెను
అంత పరకాలుండు జెప్పెను
కోపతాపంబులను బొందిన
శిల్పియిటులనియెన్.

నేనసంభవ మనుచు తలచిన
సంభవంబై నదియు నదియే
అరటి చెట్లా దేశముండుట
కొంప మునిగెనటన్.

అనగ పరకాలుండు చాలా
చతుర మతితో దాని గుట్టుమ
రట్టు జేసియు దాని నెరిగెను,
అదియు నెద్దనగా!

ద్వార ఆలయ గోపురపుపై
భాగమున నొక కంత గలదట
రాతి శికరము తోడ గలదట
మూత వేయబడెన్.

మనిషి దూరగ వచ్చు సులువుగ
దొంగ దూరిన వాని రెండుగ
సవ్య అపసవ్యముగ దిరిగెడు
చక్రముల్ నరకున్.

కంత మండియు క్రిందుదిగనవు
డట్టి చక్రాల్తిరుగు గిర గిర
దాన చిన్నా భిన్నమౌ నొడ
లందు దిగినపుడున్.

ఇట్టి యద్భుత యంత్రమందున (మునునే)
బౌద్ధ విగ్రహ రక్షణకునై
జేసి యుంచితి నెంతొ శ్రసుతో
అంత వ్యర్థమయెన్.

అరటి స్థంబంబులను చక్రము
నడుమ దూర్చిన, నార చుట్టుక
రెండు చక్రము లాగి పోవును
చొరగ సులభంబౌన్.

ఈ రహస్యము దొంగ యెవడో
నెరిగి ప్రతిమను దొంగిలించెను
చేతి కాలిన పిదప నాకులు
పట్ట ఫలమేమీ!

దాని గుట్టును రట్టు జేయుచు
శిల్పి పరకాలునకు జెప్పుచు
బాధ నొందుచు నుండనయ్యో
ఎంత సనిజరిగెన్.!

ఎట్టి యపచారంబు జేసిరొ
బౌద్ధులా విగ్రహము యెడలన
టంచు పరకాలుండు దుఃఖము
నెంతొ వెలిబుచ్చెన్.

కొలది నాళ్ళట గడిపి శిల్పిచె
ననుమతిని గొని శిష్య సహితము
వెడలె నావలొ నాగపట్నము
జేరగా దలచి.

పోక చెక్కలు సగము నిండను
బాట సారులు కొంద రెక్కను
పోక చెక్కల నెగునుతి కినై
విక్రయించుటకై.

పెద్ద వ్యాసారొకడు వాటిని
పడవలో గొని పోవుచుండను
సరససుధురపు భాషణములతొ
నతని మెప్పించెన్.

అందరాకర్షితులు నైరట
అతని మాటల చతురిమకునున్
అయస్కాంతమునకును నినుముగ
నచటి వారైరి.

అంత పరకాలుండు తలచెమ
పోక చెక్కలు చాల విలువౌ
నర్థభాగము పొంది రంగని
కర్పణముజేతున్.

రంగనీ కైంకర్య ఫలమును
సంక్రమించును కొంతనితనికి
స్వార్థ పరమార్థములు రెండును
సంక్రమించిచటన్.

పోక చెక్కల రాశినుండొక
పోక చెక్కను సగము జేసియు
సగము రాశిలో వేసి జూపెను
నచటి వారలకున్.

అంత నా వ్యాపారి తోనసె
సగము భాగము వేసినాడను
సగము నాకిచ్చెద నటంచును
వ్రాసి యిస్మయ్యా!

అనగ నా వర్తకుడు నిట్లనె
ఓయి సగమున  కేమీ కర్మా!
వలసి నంతయు పుచ్చు కొనుమిక
వ్రాత యెందులకూ?

వణిజుడిట్టుల పలుక పరకా
లుండు మాటల నేర్పు మీరను
అతని మదికరగించి , చెప్పిన
విధము వ్రాయించెన్.

అతడు నిజము చతుష్కవీంద్రులె
వాణి ప్రాపక మబ్బెనాడే
నేడు లక్ష్మీ ప్రాపక్రంబును
గూర్చు కొని యుండెన్.

తెల్ల వారెను ఓడ చేరెను
ఒక్క పట్టణ మోడ రేవుకు,
పోక రాశిలొ సగము భాగము
నొడ్డునకు జేర్చన్.

తనకు వారలు సాయ పడుచు
న్నారటంచును వణిజు డెంచెను
పోక చెక్కల గోతములలో
నింపి నెత్తించి.

ఓయి! వణిజా! బోయి వత్తును
సెలవయని పరకాలుడనగనె
పోక చెక్కల గొంచు బోయెద
విటుల తగునయ్యా!

పెరిగె నిర్వురి వాగ్వి వాదము
నలువు రచ్చట జేరి యడిగిరి
పోర కారణమపుడు వణిజుడు
చెప్పె సర్వంబున్.

ఇరువుర భియోగంబు వినినా
వర్తకుడు వ్రాసియు నొసంగిన
పత్రముంగని పెద్దలందరు
చెరిసగంబనిరీ.

అంత పరకాలుండు నచ్చటి
వర్తకుల కాపోక లమ్మియు
సొమ్ము జేమక బయలు దేరెను
నాగ పట్నముకున్.

అర్థరాత్రము నందు వలసిన
సాధనంబుల గొనియు బౌద్ధా
లయపు గోపుర మెక్కి శిష్యుల
సాయముతొ దానిన్.

పెల్లగించుయు జూడ దానిలొ
చక్రముల్దిరుగుటను జూచియు
అరటి స్థంబంబులను వానిని
తిరుగుట న్నాపెన్.

తొంగి జూడగ బౌద్ధ ప్రతిమయు
మంత్ర పూతము నైవెలుంగను
అట్టి దానిని జూచి పరకా
లుండు వచియించెన్.

రాతితో రాగి తో కానీ
కంచుతోరాతితో గానీ
కర్రతో సీసముతొ వెండితొ
చేసినం జాలే.

ఇంత బంగారమును వ్యర్థము
నవగ విగ్రహ మెంతొ నేర్పుతొ
చక్కగా నిర్మించి నారలు
మూఢులొ బౌద్ధుల్.

ఇట్టి మాటలు వినిన విగ్రహ
మెంతొ వడవడ వడకుచున్నట
గిరగిరం దిరుగాడు చుండెను,
దింపెలోపలకున్.

బావ మరదిని, అతడు నెంతో
విగ్రహంబును బట్టి జూచెను
అదియు వానికి నందకనునట
మూలలను దిరుగన్.

బావగారూ! విగ్రహమునా
చేతి కందుట లేదటంచన
నోయి నురదీ! మంత్ర పూతం
బైన విగ్రహమొ!

దాని మోమున జల్లు మూత్రము
నపుడు నీచే జిక్కునదియన
బావ మరదియు నటుల జేయగ
శక్తి భంగంబై.

నిశ్చలంబై నిల్చె విగ్రహ
నుంత పరకాలుండు త్రాళ్ళను
బిలము నంబడవేయ ప్రతిమను
త్రాళ్ళకుంగట్టీ!

ప్రాణముల బిగబట్టి ప్రతిమను
గట్టిగా చేబట్టి బావకు
అంద జేసియు పొంగి పోయెను
సంతసము పొంగన్.

అపుడు పరకాలుండు ప్రతిమను
నందు కొనియెను, బావమరదిశి
రంబు మాత్రము కంత వెడలెను
దేహము రాదే.

ఋణము జేయుట నెంత సుఖమో
దీర్ఘగా దుస్సాధ్య మౌనటు
లిచట జొరగను సులభ మయ్యెను
వెడల దుష్కరమున్.

కంత నుండియు వెడల దాయెను
పాప మాతని దేహ మప్పుడు
నిర్గనుంబట దుర్గ మంబవ
దోచ దినునుంతన్.

ఎంత యత్నించినను దేహము
కంతలో పట్టుటయు లేదే
ఏమీ సేతు నటంచు పరకా
లుండు చింతించన్.

లోన నుండిన వానికప్పుడు
తోచెనొక వింతైన భావము
బావగారిని బిలిచి భక్తితో
నిటుల వచియించెన్.

ఓ మహపరకాల యోగీ!
సంతసంబున బలిసె మేనుసు
కంత నుండియు వెడల బోదిది
ఎంత యత్నించన్.

దేహముక్తికి నిపుడు సంభవ
మయ్యె నిదియును నాదు పుణ్యమె,
ఇంత వరకును మీతొ జేసితి
భాగవత సేవల్.

స్వామి కైంకర్యంపు ఫలితమె
ఇపుడు నాకును మోక్షమబ్బుట,
ఎంత ధన్యుడ నేను గనగా
అహో భాగ్యంబున్.

ఆలసించుట తగదు నిచ్చట
వత్తురాబౌద్ధార్చకుల్నిట
తలను ఖండించియును గొని పొం
డిదియె కర్తవ్యమ్.

వేరు మార్గం బింత కన్నను
లేదు, మొండెముగురు తెరుంగరు
మన స్ఫూర్తిగ గురు స్సాక్షిగ
చెప్పు చున్నాడన్.

బిలము పెద్దగ జేయ జూచిన
ధ్వనికి నలుగురు లేచి వత్తురు
ఈన గాచియు నక్కలకుతిన
బెట్టి నటులుండున్.

రంగ నాథుల సేవకైనా
జీవముల్విడు టెంత భాగ్యము
బావ! త్వరపడు తెల్ల వారెన
టంచు త్వర బెట్టన్.

అన్యథా కర్తవ్య మెరుగక
ఉత్తమాంగము గోసి, బుద్ధుని
మూర్తి తోశిష్యులను గూడియు
గ్రామమును దాటెన్.

తెల్లవారెను కృష్ణ కుటియను
గ్రామమును జేరంగ జనిపర
కాలుడిట్లు తలంచె నుదిలో
కొంత తడవతడున్.

చేత బంగరు ప్రతిమయున్నది
తెల్లవారగ వచ్చె, పయనము
జేయుచుండిన జనులు జూచిన
గుట్టు రట్టగునే.

గుట్టు చప్పుడు గాని యట్టుల
దీని దాచగ వలయునంచును
దున్ని యుంచిన పొలము నందున
కాలితో ద్రొక్కన్.

జాను బంటియు నదియు దిగబ
నా పొలంబున ప్రతిమ దాచియు
నొడ్డునను కాపలగ గూర్చొని
కాపలాగాయన్.

నారు విత్తగ రైతు రాగను
అతని పరకాలుండు నాదని
అడ్డగించను తగవు లాడుచు
నరిగి రిరుపురునూ.

గ్రాసు పెద్దల చెంత కేగుచు
వృక్ష ఆరోహకుని నచ్చట
కాపలాబెట్టియును వెడలెను
రైతు నీడ్చుచునున్.

అంత నాయిరువురును నచ్చటి
గ్రామ పెద్దల తోడ జెప్పిరి
వారి మాటల వినిన వారలు
అప్పుడిట్లనిరీ!

నీవెవండవొ మేమెరుంగము
నీవు పరకాలుండవాసురి
యీపొలంబీ వ్యక్తి భుక్తము
నందు గలదయ్యేన్.

నీయ దంచును సాక్షమున్నదె
పత్రమైనను గల్గియుంటివ
యనగ పరకాలుండు నచ్చట
ప్రతిన తాజేసెన్.

నాదు పితదామోదరునిదిది
అతడు నీ పొలమిచ్చె నాకును
ఇతడు నాదని బొంకు చుండగ
ప్రజలు వౌననిరీ!

విఘ్న మొనరించుటకు వీరలు
ఏకమై పీడించు చుండిర
టంచు పరకాలుడు ప్రమాణము
దృఢముగా జేసెన్.

అపుడు పెద్దలు తీర్పు జెప్పగ
రేపటుంచును జెప్పి వెళ్ళగ
మురిసి పరకాలుండు మనమున
శ్రవణ తీర్థమునన్.

తాన మాడియు సూర్ధ్వ పుండ్రము
లను ధరించియు నచట వెలసిన
స్వామి దామోదరుని గొల్చెను
పొగడ పూల్దురిమెన్.

దాని కాయలు నారగింపుకు
నర్హములు గావరయ పూలే
నర్హములు నికనేటి నుండియు
కాయ గాయకుడీ.

పూలనే ప్రసవింపుడనియెను
నాట నుండా పొగడ చెట్లును
పూయు పూలను కాయలుండవు
అతని శాపమునన్.

పొగడ పూలచెపూజ జేసియు
ఊరి వారిని నీరమిమ్మన
నుంచి నీటిని అడుగు వంకతొ
నిల్లు నాదనుచున్.

వాదు లాడిత డంచు నెంచియు
నుండ నీడ నొసంగ నీతడు
వృక్షమే నాదంచు నుడువున
టంచు నాయూరన్.

మంచి తీర్థంబియ్యనందున
గినిసివరకాలుండు శాపం
బొసగె బావుల నీరులేనటు
లటులే లేకుండెన్.

రాత్రి వరకట వేచియుండియు
గాఢ నిద్రలో నూరు మునగను
పసిడి విగ్రహమును గొనియువా
రడవి నూర్గమునన్.

బోవు చుండగ కారునల్లని
నలుపు గల్గిన పురుషుడొక్కడు
వెంట నంటియు రాగ పరకా
లుండు నటజూచెన్.

ఓయి! ఎవ్వర నీవు నుమ్మిట
ననుసరించగ నేమి కారణ
మెచట కేగుచు నుంటి విప్పుడు
తెలుపు వేగంబే.

ననగ నేనీ నగర పాలుడ
నీకు పాయము గాగ వచ్చితి
ఊరి పొలిమేరకును మిమ్ముల
పాగ నంపెదనే.

అనిన పరకాలుండు నతనితో
ఆర్య! తమదయ చాలు మాకును
తనురు లేనిచొ కొల్ల గొట్టుదు
రచట పట్టణమున్.

పొండు పొండని నెంత జెప్పిన
వినక తమ వెన్వెంట వచ్చెడు
నతని జూచియు జీడిపలెమన
వెంట నున్నాడే.

పసిడి విగ్రహ మున్నదంచును
పసిని గట్టియు నపహరించగ
నెత్తువేయుచు వచ్చెనేమో
ఎంత ఘటికుండో.

దొంగ లందర దొంగ నేనే
నన్ను మించిన వాడితండో!
తాడి దన్నే వాడి తలనిల
తన్ను వాడుండున్.

కష్ఠ నష్ఠములకును నోర్వను
పొంద బడెనీ విగ్రహంబును
నీత డొంటరి వాడె జూడగ
నుత్తరింతతనిన్.

అనుచు కరవాలంబు నెత్తను
చిమ్మ చీకటి చెదరి పోయెను,
నిపిన మందున విష్ణు పదనుట
దర్శనం బయ్యెన్.

తనతొ నరు దెంచతడు నిజముగ
దొంగ గాడా వెన్న దొంగయె
కృష్ణ కుటి దామోదరుండే
అచట పొడసూపెన్.

శంఖ చక్రా ద్యాయుధములతొ
పచ్చనీ పీతాంబరము తో
కోటి సూర్య ప్రకాశనూమడు
లక్ష్మి సహితుండై.

ఖడ్గ బంధము వీడి అంజలి
బంధమును బంధించి జెప్పెను
ద్రవిడ భాషా పాశు రాల్పది
భక్తినుప్పొంగన్.

స్వామి! దామోదరా నీవా?
మోదరనమందించి తిచ్చట
నీదు సన్నిధి నుండి కైంక
ర్యంబునే జేతున్.

కృష్ణ కుటి శ్రీ రంగములు నా
దృష్టి పథమున రెండు నొక్కటె
ఇంత కన్న విశేష నూశ్రీ
రంగముంగలదే.

అనెడు పరకాలునకు దామో
దరుడు ఓవర కాల! నినుసూ!
భేదమేమియు లేదు నూకుమ(మాలో)
నిరువుర మ్మొకటే!

అయిన నే విషయంబు నేస్థల
మునకు నాదేశింప బడియును
బయలు దేరునో నదియు పర్యవ
సాన మగునచటన్.

నేను సంతుష్టుండ నైతిని
నీదు వెన్నంటియును మండెద
జేరు శ్రీరంగంబు నీవిక
నీకు క్షేమంబౌ!

అనియు దామోదరుడునుడువగ
నచట సాష్టాంగంబుగా పడి
స్వామి నానతి జేరె పరకా
లుండు క్లేనుముగన్.

తెల్ల వారెను లేచి రెల్లరు
నాగ పట్టణ నుందు బౌద్ధా
లయమునకు బౌద్ధార్చకులు కడు
భక్తి భావముతోన్.

బౌద్ధ సూక్తుల పఠనములతో
తాళముమ దీసియును వారలు
లోని కేగియు చేష్టలుడిగిరి
ఏమి దోచకనే.

వేసి యుండిన తాళమటులే
వేసి యుండెనుచెక్కు చదరక,
విగ్రహంబిట నూయ మయ్యెన
దేమి యబ్బురమో!

అందరును నిశ్చేష్టులైరట
వ్రేలు చుండెను మొండె నుచ్చట
ఎక్కి రాశిఖరంబు పైనకు,
శిరము లేదయ్యెన్.

శిఖరనూ భిన్నంబు నయ్యెను
చక్ర భ్రమణము నాగియుండెను
కంఠ యందున గొంతు నిరికిన
మొండెమట నుండెన్.

అందరును రారెత్తి పోయిరి
బౌద్ధ ప్రభువుల నాజ్ఞచేపరు
వెత్తి అన్వేషించుమంజని
రపుడు కృష్ణకుటిన్.

పొలము పోవను రైతు చింతా
క్రాంతుడై దామోదరుని గడు
భక్తిచే ప్రార్థింప స్వామియు
కలలో గాన్పించి!

ఓయి! రైతా! పొలము నీయదె
సేద్యమును సాగింపు రేపే
హక్కు భుక్తము నీదె చింతను
వదలు మింతటితో.

ననగ నారైతటులె జేసెను,
అతని కథవిని నిదియు పర
కాలుండు జేసిన చైదమిదియని
జనిరి శ్రీ రంగం.

అచట నన్వేషించి రాపర
కాల యోగిని కలిసి బట్టిరి
వాగ్వివాదము జరిగె వారికి
చాల తడవచటన్.

అంత బౌద్ధులు పట్టుకొని జని
రట్టి పట్నపురాధిపతికడ
నంత నాతడు వినియు జెప్పెను
విగ్రహము నొసగన్.

దానివిని పరకాలు డెంతో
పేచి పెట్టియు పూచి పత్రము
నొక్కదానిని వ్రాసి నొసగెను
బౌద్ధులకు నపుడున్.

వర్షమొక్కటి గడచి నంతనె
ఒక్క చిటికన వ్రేలు తక్కువ
లేని యట్టుల నొనగు వాడను
ఇటులె నిష్టంబౌ.

ననుచు పత్రము వ్రాసి యీయగ,
బౌద్ధు లంగీ కారమంచును
వ్రాసి యిచ్చిన పత్రముంగొని
వెడలి రట నుండీ.

అపుడు పరకాలుండు బంగరు
నిగ్రహంబును వక్క వక్కలు
జేసి చిటికెన వ్రేలు నుంచియు
నమ్మి ద్రవ్యముతోన్.

రంగ నాథుల దేవళంబును
సుందరంబుగ తీర్చి దిద్దెను
ఎన్ని యెన్నియొ దేవతలవి
గ్రహములన్నిల్పెన్.

సప్త ప్రాకారముల గట్టెను,
ఉన్నతో న్నత మైన గోపుర
పంక్తులున్నట వెలసె యంబర
చుంబితములనగన్.

స్వర్ణ గోపుర కలశ నుమరెను
కొలనులెన్నియొ వెలసె నచ్చట
అపర వైకుంఠంబు ననబడె
నంద చందములన్.

సెరియపెరుసూళ్యైభవంబును
వేయి పడగల శేషు కైనను
పొగడ శక్యము గాదననంగా!
ఏరితరమౌనూ.

గడువు దాటగ బౌద్ధులరుదెం
చియును గోరిరి విగ్రహంబును,
అంత నాతడు వస్త్రములతో
చుట్టి యున్నట్టి.

ఒక్క చిటికిన వ్రేలు దెచ్చియు
వారి కొనగిన, వారు జూచియు
సంబరంబున నిస్సి జూడగ
వ్రేలు నొకటుండెన్.

ఏమియిదియని బౌద్ధులడిగిరి,
వ్రాసి యిచ్చిన విధము నిదియనె,
వాదు లాడిరి కొంత తడవును
తెలిసె చోళునకున్.

రాజశేఖరు డపుడు ఏకాం
తమునకును పరాకాలు బిలిచియు
ఓ నుహోదయ! ఇటుల జేయగ
నీకు తగునయ్యా!

ఏమి తెలియని వారు బౌద్ధులు,
దొంగిలించిన విధము నిజమా!
వారి ద్రవ్యము వారి కొసగియు
దయను జూపవయా?

అనుచు చోళుడు హితము బలుకగ
చోళ రాజా! వేద ధర్మవి
దూరులీ బౌద్ధులును నిజమున్,
పాపనునదగదే!

వేద పురుషుని నింద జేయుచు
వేదముల నిందించు వారలు,
సృష్టియభి వృద్ధికిని ధర్మము
నకును మూలంబౌ.

వేదముల దూషించు వారలు,
కొంది శీకుల జేయు వారిని
నైన శ్రీ రంగనికె ధనమును
వ్యయము జేసితిగా!

రంగ నాథుల దివ్య కైంక
ర్యమునకే వెచ్చించి యుంటిని?
ఇటుల జేయన కృత్య మౌవా?
స్వామి కార్యంబే?

నీవు శాస్త్రజ్ఞుడవు, వేదము
ధర్మ మెరిగిన బుద్ధి శాలివి
వీరికిని ధన మీయనునుటయు
కాకులను గొట్టి.

గద్దలకు పడవేసి నటులౌ,
కాంది శీకుల జేయు వారిని
అటులే జేయుట సమ్మతంబౌ
అదియె ధర్మంబున్.

చోళుడా పరకాలు సూటలు
వినియు నుదిలో నిటుల దలచెను
వీరు సత్యాహింసలకు ప్రా
ధాన్య మిడి నారల్.

ఉపనిషత్తుల నొప్పుకొనరే,
ద్వైవధిక్కరణంబు జేతురే,
ఒక్క ప్రత్యక్షంబు నమ్మిన
నరయతలి దండ్రుల్.

లేని వారలు ఆత్మ పరమా
త్మలను సాక్షాత్కారముంగను
జ్ఞాన పూర్ణులు పరమ ఋషులది
వేద విదితంబే.

వేద ప్రతిపాదితము ధర్మము
లట్టి వాటిని కొన్ని నొప్పరు
"అర్ధ జరతీ" న్యాయమేలా?
ఎటుల దీర్పతగున్.

దోపిడీ హత్యలును దొమ్మి
కార్యముల జేయంగ నేరెరే
ఏది వైదిక మేది గాదో
నెరుగ కున్నానే.

పోని పరకాలుండటన్నను
స్వార్థ చింతనలేని వాడే!
లోక కళ్యాణమున కతడును
జేసె నిటులెన్నో.

వీరినిన్వేడలంగ జేసిన
పక్ష పాతపు బుద్ధి యందురు
తనదు ముప్పును దప్పుటకుపర
కాలు డిట్లనియెన్.

చాల తడవాచోళ విభుడటు
తీవ్రముగ చింతించి సభలో
వ్రాసి యిచ్చిన విధము తీర్పును
చెప్పు చున్నాడన్.

ఓసభా స్థారులును వినుడీ
ముఖ్య సాక్షాధార పత్రము
లేనిచో న్యాయమున ధర్మము
బహూగ చింతించీ.

తీర్పు జెప్పగ వలయు, పరకా
లుండు వ్రాసిన విధము నాతని
వైపు నే తీర్పొసగు చుంటిన
టంచు తీర్పొసగెన్.

బౌద్ధులును జేయునది లేకను
బుద్ధు చిటికెన వ్రేలు గైకొని
మొగము వ్రేలను వేనుకొని జని
రట్టి నాగపురిన్.

అతుల నాగండంబు గడిచెన్
విప్రనారాయణుల గృహమును
నడ్డుగా నటనుండె నాల్గవ
కుడ్యమున కచటన్.

ఉన్నదున్నట్లుంచవలెనా!
కానిచో తొలగించవలెనా!
అనుచు పరకాలుండు తలచియు
ఏమి సేయదగున్.

శ్లో॥ తటాకం ధననిక్షేపం
బ్రహ్మ స్థాప్యం సురాలయం
ఏకాంతి నో మహాభాగా!
పంచ కాల పరాయణాః!
ఆలయే శుచ సంస్థాప్యాః!
పంచకాల పరాయణాః !!
(ఇజ్య అభిగమము మొ)

బ్రాహ్మ ణోత్తములకును గృహమును
గట్టి యొసగుట పుణ్య ప్రదమౌ!
పంచకాల పరాయణులునగు
వారి రూపములన్.

హరితొ సమముగ పూజ జేయుట
తగునటంచనె ఆగమంబులు
ఇట్టి లక్షణ లక్షితులు శ్రీ
రంగ భక్తులునౌ.

తొండ రడిప్పొడి యాళ్వార్లను,
దీని తొలగింపంగ రాదని
శాస్త్ర నిర్ణయమును నొనర్చి
అటులె గృహముంచన్.

విప్రనారాయణులు నా పర
కాలుతో ననె స్వామియిది మీ
పేర పరకాల్మంటపంబుగ
పిలువ బడుచుండున్.

అనగ నిరువురు నొకరికొకరును
గౌరవాదరములును దెల్పిరి
ఇటుల నాపరకాల స్వామియు
సఫలత నొందెన్.

రంగ పట్టణ శోభ పెరిగెను,
తాను కృతకృత్యుండు నయ్యెను,
కాని ప్రాకారముల గట్టిన
తాపి వారలకున్.

చిల్లి గవ్వయు నివ్వలేదని
తిరిగి తిరిగియు చెప్పులరుగగ
నలసి సొలసీ తిట్టు లెన్నియొ
తిట్టుచున్నుండన్.

దూషణము భూషణములు తిర
స్కారములు దేహముకె గావీ,
ఆత్మ కవి కావరయననుకొని
నిబ్బరము నుండున్.

వ్రణము బాధతో సమము నుండును
ఋణము బాధయు మధ్య తరగతి
జనుల, కిచ్చుట నున్న పరకా
లునకు నిది లెక్కా!

ఒక్క చేతితొ చోళ ప్రభువుల
సైన్యముక్కు నడంచి నట్టి
జోదుడీ పరకాలునకు వా
రెందు దీటరయన్.

శిల్పులును శ్రమియించి ప్రాకా
రాదులను కడుసుందరంబుగ
గట్టి నారే ఇట్టి వారల
కేమి చెల్లింతున్.

ఊరు వారిది, పేరు నాదీ,
ధన మొసంగిన పేరు నాయది,
యొరు లెరుంగరు యీరహస్యము
నేమి సేతిపుడున్.

అర్థఫలమును లేదు కైంక
ర్యంపు ఫలమే దక్క వలయును,
ఆమహా ఫలమిపుడు వీరికి
నంద జేయవలెన్.

అనియు పరకాలుండు తలచియు
ధనముకై దొమ్మికిని వచ్చిన
శిల్పులకు చిరునగవు తోడుత
స్వాగతంబంచున్.

రండు మీ కైవేచియుంటిని
ధనము గల దాశ్వేత పర్వత
మందు దాచితి బోద మచటికి
రండు నాతోడన్.

అందరును నానంద మొందుచు
పడవపై కావేరు దాటియు
శ్వేత అచలము జేరు కొనిరట
పద్మ లోచనునీ.

భక్తితో సేవించు కొనియును
అర్చకులు తీర్థంబు నొసగను
తీర్థఫలహారములు దినియును
మరలిరట వారల్.

ధనమునిమ్మని గోరరప్పుడు
మానసిక పరివర్త నంబును
తెలియకే తామొంది మరలిరి
తమదు గృహములకున్.

కొంత దూరము పడవ సాగెను
పడవలో మంతనము సల్పుచు
అందరును కావేరి నదిపై
జనుచునుండంగన్.

శ్లో॥ మన్నిమిత్తం కృతం పాపమపి పుణ్యాయకల్పితే
మామనాదృత్యయత్పుణ్య మతి పాపాయ కల్పతే

నానిమిత్తము జేయు పాపము
వలన పుణ్యము లభ్య మౌనే,
నన్ను గాదని జేయు పుణ్యము
పాపమును గూర్చున్.

అనియు శ్రీ కృష్ణుండు జెప్పెను
అట్టులేనిట జరిగి యుండెను
చెయిదమిది పరకాలు స్వామిద
పరమ పురుషునిదా?

పద్మ లోచన స్వామి వారల
భక్తి మెచ్చియు మోక్షమిచ్చెను,
కూలి ముట్టగ వారలందర
చెంతకుంగొనెనా!

అనగ పడవయు మధ్య నదిలో
బుడుగు మనితా మునిగె నడుగున
శిల్పులందరు పరమ పదమును
మురియుచును జనిరీ.

కొందరాపర కాలస్వామియె
ముంచి శిల్పుల జంపె నందురు,
కొందరందురు దైవ కృతమని
దైవమే ఎఱుగున్.

నావికులు పరకాల స్వామియు
మునిగి తేలియు నీదు కొనుచును
నొడ్డు జేరియు నింటి కేగిరి
బాధ తప్పులునై.

అంత పరకాలుండు శిల్పుల
ఇండ్ల కేగియు దెలిపె వార్తను,
ఘోర మౌనీ వార్తవిని వా
రెల్ల శోఖించి.

ఇంత ఘోరం బెపుడు జరుగదె
ఎన్న డైనను వింటి మాయిది
ఇందునేదో మోసమున్నది
అనుచు పరకాలున్.

కూలి నీయక డబ్బు కొరకై
నిలుపునను నట్టేట ముంచితి,
వనుచు శిల్పులు ఆలు బిడ్డలు
శోఖ తప్తులునై.

మాధనంబుల మాకొనంగుము
లేనిచోనీఅంతు జూతుము
కాల రూపుడు నయిన నాపర
కాలుడే జేసేన్.

అతని గీతను ధాత దాటడె
వారలా నింకాప్తులరయను,
అట్టి వారల జంపి వేసిన
లాభ మేముండున్.

కూలి డబ్బుల నొనగి నాడను
దానికా శేషాద్రి వానుడె
సాక్షి, ఇటమీవారి చేతనె
సాక్ష మిప్పింతున్.

సత్యమే జీవించి యుండిన
భక్తుడను నేనైతి నేనీ
మరణ మొందిన వారె మీతో
నిజము నుడువుదురే.

అనగ వారలు ఇట్లు తలచిరి
చచ్చినా వారెల్ల జచ్చిరి,
మరణ మొందిన వారు తిరిగి
బ్రతుక బోరుగదా!

కాల యాపన జేయనేలా!
కలహ మిచ్చట నిష్ఫలంబే
ఉత్తరక్రియలకును జాప్యం
జేయదగ దిచటన్.

ఇతని పనినాపిదప బట్టుద
మంచు వలలతొ బంధు జనముల
మృత కళేబరములను దీసి
రోదనంబులతో.

అగ్ని సంస్కారముల జేయగ
అపుడు పరకాలుండు స్నానము
జేసి శ్రీరంగేశు తనమది
భక్తితో దలచి.

పేరు పేరున బిల్చె శిల్పుల
దివ్యమైన విమానములనా
సీనులై తమ బంధు జన్నులను
బిలిచి యిట్లనిరీ!

ఓహో! బంధువు లారవినుడీ
ఈనుహోదయు వలన మేమును
పరమ పద సంప్రాప్తి నొందితి
మిదియు నిక్కంబున్.

ధనము పొందితి మెన్నొ రెట్లో!
వ్యర్థ కలహము బెట్టు కొనకుడు
ఇతడు హరికైంకర్య నిరతుడు
హరికి భక్తుండున్.

ఈ మహాత్ముని తోడి వైరము
బెట్టు కొనుటన మహాపాపము
నితని సేవించుచును సుఖముల
బొందుడికమీరల్.

అనుచు బల్కుచు శిల్పులెల్లరు
చూచు వారలు చోద్య మందగ
అట్టి దివ్య విమాణములపై
జనిరి సాయుజ్యమ్.

సంభ్ర మాశ్చర్యములతో శ్రీ
రంగ వాములు, భక్తి తాత్ప
ర్యములు కౌతుకములతొనచ్చట
దృష్యమును గాంచి.

నాటి భక్తుల మహిమలను విని
యుంటి మట్టి పురాణములలో
నేడు కనులారగను గంటిమి
కనులు సార్థకముల్.

అమచు పరకాలులను బొగడుచు
ఎవరి గృహముల వారలేగిరి
మాఘ మానము నందు జరుగెను,
మాఘ మాసమునన్.

జములు కావేరీలో స్నానము
జేయనమితం బైన పుణ్యం
బంచు జ్ఞానులు నిర్ణయించిరి
జరుగు చుండటులన్.

దినదినంబును రంగ నాథుల
సేవ యందభి రుచిని పెంచుక
నిరతిశయ సంతోషమును తా
ననుభవించుచునున్.

ఒక్క నాడతడిట్లు మనవిని
విన్నవించెను రంగ నాథుతొ
రంగ నాథా! గాంచ నియ్యది
ఫేలవము నయ్యేన్.

నీవు జెప్పిన నేను జేసితి
నీవు అధిపతి నేను దాసుడ!
జెప్పి నట్టుల జేసి నాడను
మంద మతినైతిన్.

నీవు ప్రాకారాలటంటివి
స్వర్ణ నిర్మిత మనగ లేదే!
ఉపనిషత్తులు, ఋషులు, స్వర్ణమ
యుండనీ బొగడున్.

సంస్కృతాంధ్రా ద్రవిడ భాషా
కవులు స్వర్ణ విరాజ మానము
లరయ నీదు పురంబులంధురు
అటులె నీబోటీ.

స్వర్ణ ప్రాకారముల నుండున
టంచు స్తోత్రము జేయబడునే
ఇచట నేనిర్మించి యుంటిని
రాతి కుడ్యములన్.

దృఢములౌ గోపురము లుండగ
రమ్య మంటప చతుశ్శాలలు
వేదికలు కూపములు ధాన్యా
గారములు నుండెన్.

అన్ని నిర్మాణములు పూర్తవ
చేయునదియే మిదియులేదే
కాంతి హీనపు కట్టడములే
నాకు నచ్చునివే!

అనుచు నునవిని జేసె స్వామితొ
చింత వలదో భక్త శేఖర
నీదు నిర్మాణములు స్వర్ణమే
చూడు మీ విపుడున్.

అనగ నన్నియు స్వర్ణ నిర్మిత
కట్టడములుగ మారి పోవను
నంత పరకాలుండు సంతస
మంది నిట్లనియెన్.

స్వామి! శ్రీ రంగేశ నీకున
సాధ్యమౌకార్యంబు గలదా!
నీదు లీలలనంతములునౌ
నేరతరమౌనా?

నీదు చూపే స్పర్శవేదీ!
స్వర్ణ మయమై నిదియునుండిన
నిన్ను జూచుట మాని భక్తులు
వీని జూతురుగా?

ఓహో! విశ్వాత్ముండ నీవిక
స్వర్ణ కాంతుల దొలగ జేసియు
నన్ను కరుణతొ నేలుమనగా
స్వామి యస్తనియెన్.

కాల క్రనుమున నిజము నాపర
కాల స్వామొక! దేవు డాయను
భావ వీచిక వీచి జనులును
శిష్యులుగ మారన్.

దేవునిగ వారెల్ల గొలువగ
అట్టి భావము మదినిలేశము
లేని యాపర కాల స్వామీ!
రంగ దానుడనన్.

భాపమును హృదయమున గల్గీ
రచనలందున నట్టి భావమె
ద్యోత కంబవ గ్రంథముల్నత
డెన్నొ రచియించెన్.

పరమ హంసని పరివ్రాజక
బిరుదములతో బిల్వనేరరు,
అన్ని లక్షణ లక్షితులునీ
భక్తి పరకాలుల్.

దేశ దేశములందు భగవ
ద్భాగవత కైంకర్య నిష్ఠను
చాట గోరెను, పర్యటించెను
వివిధ దేశములన్.

ఎందరెందరో పండితులసవ
లీలగా నోడించి వారిజి
తోస్మియనిపించుచు జేరెత్రి
విక్రమను పురమున్.

వాది మత్తేభంపు కేసరి
భాస్కరుండా దుర్మతాంధా
కార, కవి రాట్సార్వ భౌముడు
చతుష్కవి వరులున్.

వచ్చు చున్నారనుచు శిష్యులు
బిరుద ఘోషలు జేయు చుండగ
అటశమంధర శిష్యులోర్వక
వారి నెదిరెంచీ!

ఓయి పరకాలుండ! నీదగు
గొప్ప లిచ్చట చెల్ల నేరవు
మాదు గురువరు శమంధరులన్.
శాస్త్ర వాదమునన్.

ఓడు నట్టుల జేసి నీపరు
విచట నిలబెట్టియును నీదగు
విజయ భేరిని మ్రోగ జేయుము
నీవు సిద్ధంబా?

యనగ సరియన వారలప్పుడు
తొలుత కవితను వాదమాడుట
మొదలు పెట్టిరి నాడుభగవ
ద్విగ్రహములేకన్.

నుంద గించెను నతని బుద్ధియు
మార్చె బడెమరునాడు వాదము,
విష్ణు ద్వేషిశమందరుండా
విధము జేయించెన్.

వీరపాషండులతొ నిండియు
విష్ణు ద్వేషము భూమియయ్యెది
తులసి మొక్కట వెదక, జిల్లే
డ్వనము నందొరుకా!

కారు చీకటి మెరపు మెరసిన
విధము ముదుసలి వైష్ణవింగని
తల్లి! హరి విగ్రహము గలదా!
నాకు దయసేతే.

నంచు పదముల వ్రాలి వేడిన
విగ్రహము దయ సేసె వరకా
లునకు, కవితా ఝరియు పొంగెను
దాని మహిమంబున్.

శిరము వంచె శమంథరుండట
యపుడు సాష్టాంగంబు గొపడి,
ఓ చతుష్కవి శిఖామణీనీ
బిరుదు సార్థకమే?

ఎందరెందరొ పండితులునే
జూచితో పరకాల యోగీ!
ఇంత వానిని నింత వరకే
నెందు గననైతిన్.

నీ ప్రభావంబప్రమేయము
నేను నెంతో సంత సించితి
నీవు ధరనప్రతి హతంబుగ
పర్యటింవు మికన్.

అనుచు వేడిన అపుడుపరకా!
లుండు మధురపు భాషణములతో
ఓశనుంధర! సుకవి వర్యా
నీకు నాప్రణతుల్.

నీవు పండిత ప్రకాండుడవే
సుకవితా రసతత్వవిదుడవె
ధాత్రి నీర్యాసూయ వదిలిన
ఘనుడ వీవయ్యా!

ఒప్పి తాపర వైభవంబును
జ్ఞాన హీనులు తాము బట్టిన
శశకమునకును మూడు కాళ్ళవి
వాదు లాడు దురే.

నీవు సుజ్ఞానుడవు గానా
నిన్ను నేకడు బొగడు చుంటిని
అని త్రివిక్రమ పురము నందుత్రి
విక్రమున్నచటన్.

నిల్పి ఆయూర్పేరు నిల్పెమ
నుంగళాశాసనము జేసెను
అభంగురమగు వైభవముతో
స్వామి ముదమొందెన్.

శమంధరు సత్కార మందియు
నచటి నుండియు బయలు దేరెమ
హేంద్ర హిమవత్పర్వతములకు
మధ్య దేశమునన్.

నున్న విష్ణ్వాలయములను గని
విష్ణు దేవత మూర్తులను గని
ద్రవిడ భాషా పాశురములతో
వారి కీర్తించెన్.

తామ దిరిగిన క్షేత్రముల నా
రాయణుని వైభవము శోభిల
జేసి శ్రీ రంగమును జేరె తి
ర్మంగ యాళ్వారుల్.

"ఏక క్రియాద్వ్యర్థకరీ బభూవ"

ఒక్కపని జేయంగ, దావను
లాభముల్ రెండౌదవునట్లుగ
క్షేత్రయాత్రలో జైత్ర యాత్రయు
కలసి వచ్చెనటన్.

విష్ణు క్షేత్రములన్ని నెంతో
దివ్య క్షేత్రములయ్యు వెలిగెను,
మహిమ వైభవములును నెలకొని
వెలిగె నలుగడలన్.

దీని కాపరకాల స్వామియె
మూలమై భాసిల్లె సంతట
వీరొసంగిన ద్రవిడ గ్రంథము
లేడునై వెలసెన్.

ఏడు ఈ రేడ్లో కములతరి
యింప వెలసిన తత్వ అర్థాల్
జాతి బేధము లేక అధ్యయ
నమునకున్నర్వుల్.

అర్థులంచును దెలిపి నారలు,
ఈ ప్రబంధము పాశురాల్పద
మూడు వందల అరువదీనా
ల్గనియు పేరొందెన్.

స్థిరము గా శ్రీరంగ నుందున
నుండి పరకాలుండు వ్రాసెను
ఆరు దివ్య ప్రబంధముల్నవి
షట్ప్ర బంధకృతం.

వ్రాసె నారు ప్రబంధములను
పేరు ప్రఖ్యాతులను గాంచెను
ఈ ప్రబంధము పాశురంబులు
సంఖ్య వేయుండెన్.

దేశ సంచారంబు సేయుచు
నచటి దేవుల మతుల జేసిన
పాశురాల్కుమ్మాట నరువది
నాలుగునుగలవున్.

వీటి నిన్విడ దీసి చూడగ
దోచునారు ప్రబంధముల్నట
కలిపి యుంచిన నేడు గానగు
ఉజ్వలంబివియున్.

పీరు తామొక్కక్క దేవుని
పదియు పాశురములను బాడిరి,
ఒక్క దేవుని నేబదింటను
నలుబదిరువురమా.

ముప్పదేసీ పాశురములతో
దేవులిరువుర నుతుల జేసెను
ఇరువదేసీ పాశురంబుల
అయిదుగుర బాడెన్.

ఏడు పాశురములతొ కొందర
కొంత మందినినేబదొక్కట
ఒకటి రెంటను మూడు పాశుర
ములతొ న్తుతియించెన్.

మూడు వందల అరువదీనా
ల్గిందలీ పాశురపు నంఖ్యయు,
ఈ ప్రబంధము లొసగి నారలు
లోక రక్షణకై.

లోక రక్షకులయ్యు ధరలో
నూట అయిదును వత్సరంబులు
గడిపిరాపరకాల స్వాములు
ఎల్లరున్ బొగడన్.

యుగయుగంబుల ధర్మ సంస్థా
పనకు శ్రీహరి యవతరించుట
ఎల్లరెరిగిన విషయమియ్యది
సుప్రసిద్ధంబౌ.

అరయ నారాయణుని అవతా
రములు పదియవి ముఖ్యమైనవి
అటులె నారాయణుని శార్జ్గము
యొక్క యంశమునన్.

నాల్గు యుగముల లోన నాలుగు
వర్ణముల జన్మించి నారలు,
కృతయుగంబున కర్ధముండుగ,
బ్రాహ్మణుల యింటన్.

క్షత్రి యుండై ఉపరిచర వసు
పంచు త్రేతా యుగము నందును
ద్వాపరంబున వైశ్య కులమున
శంఖ పాలునిగన్.

కలియుగాన చతుర్థకులమున
శార్జ్గమే పరకాలుడయ్యెను
వీరు నల్వురు నాల్గు యుగముల
లోక రక్షకులై.

లోకముల రక్షంచి రనియెడి
విషయమును ఆశ్లిష్ట పురమా
హాత్మ్యమునగల దంచ టందురు
వేటికిన్నటులే.

తంఁడ్రి పెట్టిన పేరు నీలుడు,
వైరులకు పరకాలు డనియును,
కలయుగంబున కలికి వైరని
రంగనాథుడనెన్.

చతుర్విధము ప్రబంధముల రచి
యించను చతుష్కవి యనం బడె
మంగపుర మందుండ తిరుమం
గయా ళ్వారనియున్.

నాను ధేయులు పదుగురాళ్వా
రులలో సరిలేరెవ్వరీయిల,
వీరి స్మరణమె కలిహరణమను
నార్య నానుడియున్.

పెరియ పెరుమాళ్ రంగ నాథుల
చరణముల తానమ్మి గొల్చుచు
వైరి కలిపురుషునకు నితడని
రంగడే బొగడెన్.

వీరి చరితము వినుటముననున్
వీరి చరితము వ్రాయుటముననను
వీరి స్మరణము చేత కలిహర
నమును నౌనిజమున్.

శ్లో॥ వృశ్చికే కృత్తికా జాతం। చతుష్కవి శిఖామణిం।
శత్రు బంధ కృతం శార్‌జమూర్తిం కలహ మాశ్రయే॥

శ్లో॥ కలయామి కలిధ్వంసం। కవిలోకం దివాకరం।
యస్య గోభిః ప్రకాశాభిః ఆవిద్యం నిహతం తమః॥

మంగళము పరకకాలయోగీ
మంగళము తిరుమంగయాళ్వార్
మంగళము కలివైరి, శ్రీచతు
ష్కవిరొ మంగళమౌ.

-ఓం తత్సత్-

  

ఓంశ్రీ లక్ష్మీ హయగ్రీవాయనమః

## శ్రీ నమ్మాళ్వారులు,
## శ్రీ మధురకవి యాళ్వారులు

గంగ యమున సరస్వతీ గో
దావరీ సింధువును కృష్ణయు
తుంగభద్రా నర్మదలు నీ
భరత దేశమునన్.

మత్తరంబుననురుకుచుండును
త్రామపర్ణీ వేగవతి కృత
మాల కావేరీలు దక్షిణ
దిశను ప్రవహించున్.

ఋషులు ఉత్తర భారతాగ్రము
నకును సంబంధించు వారలు
దక్షిణపుదిగ్భాగమునకా
ళ్వార్లు నటులైరీ!

శ్లో॥ కలౌఖలు భవిష్యంతి! నారాయణ పరాయణాః!
క్వచిత్క్వచిన్మహాభాగాః! ద్రవిడేషుచ భూరిశః!

కలియుగంబున ద్రవిడ దేశము
నందు నారాయణ పరాయణు
లగు మహా భాగవతు లెల్లరు
నవరింతు రనిన్.

వేద వ్యాసమహర్షిచేనిది
భాగవతమున జేసె సూచన
స్వతః పావన మైన నదితీ
రముల వసియించీ.

ఋషులు పావను వైరి, అటులే
తైర్థికుల వలననును నదులున్
పావనములౌ ననియె శాస్త్రము
అటులె ఆళ్వారుల్.

(తీర్థీ కుర్వన్తి తీర్థాని)
నదీ తీరపు పట్టణంబుల
నవతరించియు నట్టి నదులను
పవిత్రముగను జేసి నారని
శాస్త్రవిహితంబౌ.

పూర్వ యుగముల మహారాజులు
తామ్ర పర్ణ్యాదీతటంబుల
కలియుగంబున పుటుక గోరిరి
వ్యాస ప్రోక్తంబే.

కృతయగంబుల రాజులట్టుల
ఏల కోరిరటంచ నంగమ
ఆళ్వారాదుల పాద స్పర్శను
వాయు స్పర్శమునన్.

గాని నదులన్నియు పవిత్రము
గావటంచుమ ఋషులచేనా
ళ్వార్ల మహిమలు నెరిగి కృతయుగ
రాజు లెల్లరునున్.

కోరి జన్మల నెత్తి యుండిరి
తామ్ర పర్ణ్యాదీ తటంబుల,
నిదియె నాళ్వారుల ప్రభావమె
దైవ నిర్ణయమున్.

ఐదు జ్ఞానేంద్రియము లాక
ర్మేంద్రియంబుల నైదునవగా
అట్టులే నీపదుగు రాళ్వా
ర్లొక్క వ్యక్తి గనే.

పూర్వులౌ ఆచార్య వరులచె
పరిగనింపగ బడిరి నమ్మా
ళ్వారులకు నీ ఆళ్వారాదులు
నరయ నవయవముల్.

వంటి వారని నిర్ణయించిరి
అట్టి నమ్మాళ్వార్లు, నదియౌ
త్రామ్ర పర్ణీతీర మందలి
శ్రీకురుం గూరున్.

వీరి వలననె తామ్ర పర్ణికి
మహిమ చేకూరినదటందురు
కృష్ణునవతారమున గోకుల
మిట్లె పేరొందెన్.

పాండ్య దేశాభరణ మనగను
ఆది నాథుండనెడు పేరున
హరియు వెలసిన స్థాన మైనది
నలరు చున్నుండెన్.

ద్వాపరంబున కురువనంబడు
రాజు పరిపాలించు కతమున
దానికా కురుకాపురంబను
పేరు స్థిరమయ్యెన్.

కలియుగాదిన దాని పరిపా
లనము నాల్గవ కులజుడైనవి
భూతి నాథేంద్రునకు లభ్యం
బవను నది మొదలున్.

అతని వంశము దాన ధర్మము
సత్య శౌచము, దయలకెంతయొ
నాట పట్టెదైవ భక్తికి
నాల వాల మయెన్.

కారియను ప్రభువన్ని విధముల
వంశ కీర్తిని తరుగనీయక
రాజ్యరమణిని, నాథ నాయిక
రాణి కైబట్టీ.

చూడ చక్కని జంట యనగను
వీరి దాంపత్యంబు ననుకూ
లంబటంచుమ బొగడబడుచును
రాజకీయముగాన్.

దీటు లేని వాడటంచును
భాగవత జన శిఖామణియను
పేరు గాంచి కురంగ నగరికి
భార్యతో జనియెన్.

తిరుక్కురుంగుడి నంబియనుచును
వెలసి యుండిన హరిని గొల్చియు
నద్వితీయుండైన పుత్రుని
నొసగ గోరిరటన్.

అద్వితీయుండనగ తానే,
వేద శాస్త్ర పురాణ ఇతిహా
సముల ప్రతిపాదింపబడితిని
కాన నేరాజన్.

నేనె మీగర్భముల బుట్టుదు
నంచు తీర్థ ప్రసాదముల పూ
మాలలను నాకారి ప్రభువులకు
స్వామి యిప్పించెన్.

అంత నాప్రభు వాజ్ఞ గైకొని
భార్య తోకురు కాపురింజనె
ఆమె షడ్విధ కర్మలను తన
పతిని సేవించున్.

నాథ నాయకి తండ్రి కేరళ
లోనితిరువణ్ పరిశారం
పట్టణము పరి పాలనంబును
జేయుప్రభు పర్యుల్.

కారి దంపతులరయు గలిగిరి
వింత నౌనొక మానసిక మా
భావవృత్తిని, పూర్వులందరు
సేన నాయకులై.

భూమి నాయకులైరి వారలు,
గొప్ప వారలు విష్ణు భక్తులు,
భాగవతులైనందు వలననె
సూత్ర వతి నాథున్.

భక్తి భావము పెంచి కొలిచిరి
మహిలన్నియు వినియు మురిసిరి
గజముఖులు మొదలైన వారలు
సైన్య నాయకులై.

వీరికను పన్నలలో మెలగుచు
విఘ్నములవారించు వారవ,
ఆది నారాయణుని సూచన
విశ్వమున్నేలున్.

పరమ పదమున రెప్ప పాటును
లేక భగవద్గుణము లనుభవ
స్తోత్ర శీలురునైన సూరుల
వర్గ మందతడున్.

అగ్ర గణ్యుడు సూత్రవతినా
థుండటుందురు, కారిదంపతు
లర్థి వాడే తమకు సుతునిగ
జనన మొందవలెన్.

అనితలంచుచు స్వప్నములగమ
చుండి మురియుచు నుండ ద్రావిడ
భాషకుమ వేదత్వము మచే
కూర్చగా నెంచీ.

పరమపద నాథుండు సూరిగ
ఐంబు లందొక ఘనుని నంపియు
అరయ నాగస్త్య కృతంబగు
ద్రావిడంబందున్.

దివ్య గ్రంథములను రచింపను
ధరమ జన్మింపంగ విష్వ
క్సేమ తనదౌ నంశ నింపిన
పాత్ర రాజమునున్.

నాథనాయకి గర్భమందున
ఆదినారయణుడు బెట్టెను,
కాలక్రమమున కారి దంపతు
లక్కజంబుగనున్.

పుత్ర రత్నంబుద్భవించెను
కలియు గారంభ ప్రమాదీ
వత్సరము, వైశాఖ మాసవి
శాఖ నక్షత్రమ్.

ఆచతుర్దశి భృగువు వాసర
మందు జన్మించిన యతండును,
కాడుగద సామాన్యు డరయను
నతడు విష్ణుండే.

అందు వలననె ఆది శేషుడు
ఆది నాథుని నాలయంబున
ఎదురు తింత్రిణి వృక్షమునునై
జన్మముమ దాల్చెన్.

కారి పుత్రోద్భవము పూర్వమె
భావి కాలము దివ్య సూరుల
మహిమ వెల్గొందంగ జేయగ
మరో మహనీయున్.

ధరను శ్రీహరి అవతరింపగ
జేసే కృష్ణుని కన్నముందే
భీష్ముడును జన్మించి నట్టుల,
సూర్యునకు ముందే.

అరుణుడుదయము నొందునట్లుగ
అలరు కురికాపురి సమీపము
నందు కోళీ పట్టణంబున
చతుశ్శాఖుండున్.

పరమ వైష్ణవుడరయ నారా
యణుడటంచును పేరు గల్గిన
పండితోత్తమునకును పుత్రుగ
నుద్భవము నయ్యెన్.

అతని జననము ద్వాప రాంతము
వర్ష మీశ్వర చైత్ర శుక్లము
చిత్ర నక్షత్రంబు, తండ్రి నతనికి
మధుర కవియంచున్.

నామ కరణముజేయ నదియే
సార్తకంబవ కాల క్రమమున
నాతడుపనీతుండు నైతా
వేద వేదాంగాల్.

చదివి ప్రావీణ్యతమ నొందీ
సాటి లేరను నటుల ఆశఠ
గోప సూర్యున కరుణ సమునిగ
భాసిలుచునుండెన్.

అచట కురికాపురము ప్రభువగు
కారికిని పుత్రోదయంబవ
మార (మారుడ) నంచుమ పేరు బెట్టిరి
అంశ మంతునకున్.

గర్భ సంబంధంబు చేతను
కొన్ని సంస్కారములు కావలె
గర్భమందో, జన్మ పిదపో,
గురుని ఉపదేశం.

తప్పనందున విష్వక్సేమలు
మారనుకు గర్భంబు నందే
నారదుడు ప్రహ్లాదునకు వలె
మంత్ర మంత్రార్థాల్.

బోధజేయగ మారనన్నిట
జన్మ మొందుట కన్న ముందే
అన్నిటమ సర్వజ్ఞుడై భూ
పతను డైనంతన్.

అందు వలననె ఆది శేషుడు
ఆది నాథుని నాలయంబున
ఎదురు తింత్రిణి వృక్షమునునై
జన్మమును దాల్చెన్.

కారి పుత్రోద్భవము పూర్వమె
భావి కాలము దివ్య సూరుల
మహిమ వెల్గొందంగ జేయగ
మరో మహనీయున్.

ధరను శ్రీహరి అవతరింపగ
జేసే కృష్ణుని కన్నముందే
భీష్ముడును జన్మించి నట్టుల,
సూర్యునకు ముందే.

అరుణుడుదయము నొందునట్లుగ
అలరు కురికాపురి సమీపము
నందు కోళీ పట్టణంబున
చతుశ్శాఖుండున్.

పరమ వైష్ణవుడరయ నారా
యణుడటంచును పేరు గల్గిన
పండితోత్తమునకును పుత్రుగ
నుద్భవము నయ్యెన్.

అతని జననము ద్వాప రాంతము
వర్ష మీశ్వర చైత్ర శుక్లము
చిత్ర నక్షత్రంబు, తండ్రి నతనికి
మధుర కవియంచున్.

నామ కరణముజేయ నదియే
సార్తకంబవ కాల క్రమమున
నాతడుపనీతుండు నైతా
వేద వేదాంగాల్.

చదివి ప్రావీణ్యతను నొందీ
సాటి లేరను నటుల ఆశర
గోప సూర్యున కరుణ సమునిగ
భాసిలుచునుండెన్.

అచట కురికాపురము ప్రభువగు
కారికిని పుత్రోదయంబవ
మార (మారుడ) నంచును పేరు బెట్టిరి
అంశ మంతునకున్.

గర్భ సంబంధంబు చేతను
కొన్ని సంప్కారములు కావలె
గర్భమందో, జన్మ పిదపో,
గురుని ఉపదేశం.

తప్పనందున విష్వక్సేనులు
మారనుకు గర్భంబు నందే
నారదుడు ప్రహ్లాదునకు వలె
మంత్ర మంత్రార్థాల్.

బోధజేయగ మారనన్నిట
జన్మ మొందుట కన్న ముందే
అన్నిటను సర్వజ్ఞుడై భూ
పతను డైనంతన్.

నులు దెరచియు జూచె జగమును,
లిచె నావృత మయ్యు కనుపడె,
నులు రెండును మూసె, వెంటనె
లియు శతరూపం.

బొంది మాయతొ మారుని న్వశ
పరచు కొనగా నరుగు దెంచిన
హంకరించెను మారు డంతట
కలియు పరువెత్తెన్.

'తము అనగా మాయ యనియును
ాయనే వశపరచు కొనుట, శ
ారి యంచును పిలువ బడియెను
ారుడు న్వింతన్.

బాహ్యజగతిని నేరరెవ్వరు,
ఇరుపురుకును నిశ్శబ్ద సమరము
జరుగ నాశతు డోడి పారెను
కాన మారుండున్.

పాలు ద్రావడు, మలము మూత్రవి
సర్జనంబులు లేక, దేహం
ద్రివ్యములును మహ దివ్యకాంతితో
వృద్ధి నొచుండెన్.

కనులు మూత సమాధి యోగము,
దేహమును పోషించు భగవ
ద్గుణాను భవము, కాంతి, ప్రాకృత
జనులు తెలియరుగా.

ఏడ్పులేదే, నవ్వడే మల
మూత్ర ములు వదలడములేదే,
బోసినవ్వుల పూలతో మము
మురియ జేయడుగా.

ప్రతిమ సముడౌ బాలుడీతడు
ఉలుకు పలుకులు లేక నుండెను
బాలలీలలు లేని బాలుడు
మాకు నింకేలా?

అని తలంచియు కారి దంపతు
లపుడు గొని కురికాపురింజని,
తామ్ర పర్ణీ తీరమున గల
ఆది నాథులకున్.

ఎదురుగా గల చింత మొదలున
వదలి వెళ్ళిరి దుఃఖ వ్యాకుల
చిత్తులునై, కొంత ఋణమును
దీర్చగా దలచి.

మేలు బంగరు తొట్టె నుంచియు
స్వామి! భగవన్! ఆది నాథా!
నీవు నొసగిన వింత బాలుని
నీకె నొసగితి మీ!

నీదె భారంబింక నితనిద
టంచు కన్నుల నీరు పొరలగ
భక్తితో ప్రణమిల్లి గంపెడు
చింత భారముతో.

నింటి కేగిరి! మారుడున్నట
ప్రాకృతుల వలె ప్రాక వచ్చిన
పిదప ప్రాకియు ప్రాను తొర్రలో
జేరె నొకనాటన్.

భగవ దర్చా విగ్రహము వలె
చేష్టలుడిగియు బాలుడుండెను
అటుల పదునార్వత్సంబుల
నాది నాథుకృపన్.

కావి బాలుని లోన గలిగెడి
భగవదను భవ జనిత నిర్భర
త్వాను సంధానంబు, జ్ఞానము
దైవ దర్శనమున్.

జ్ఞాన నేత్రుల కిదియు తెలియును
జ్ఞాన హీను లెరుంగ నేరరు
గడిచె పదునారేండ్ల కాలము
కాల మాగదుగా?

భక్తి సామ్రాజ్యాధి పతియా
దివ్యయోగికి రాజ్యమేలా?
సకల సంగ విముక్తి కాంతా
రమణునకు పెండ్లా?

ఆలయార్చక స్వాములంతట
ఆదినాథుల యాజ్ఞచేతను
చింత తొఱ్ఱలో నిశ్చలంబుగ
నున్న మారనుకున్.

జేయుచుండిరి శోడషోపా
చారములు నిత్యమును భక్తితో,
వేయుచుండిరి వకుళ మాలిక
లతని గళమందున్.

భాహ్య స్మృతి గోల్పోయి ధ్యానము
నందు మునిగిన మార నెరుగడు
లోక మందున జరుగు మార్పుల
నతడు నెరుగడుగా?

ఆవిధిన్వర్థిల్లుచుండిన
దివ్య మూర్తికి జనని జనకులు
మార నంచును పేరు బెట్టగ,
నదియె రూఢయ్యెన్.

కారి మారనటంచు ప్రజలును,
శఠుని గోపించుటను శఠగో
పుడును, వకుళాభరణులగుటకు
వకుళ భూషణులున్.

ఆళ్వారాదుల జేరిపీరా
ళ్వారటంచును పిలువ బడియెను
ఆళ్వారాదులె సిద్ధ పురుషుల
టంచు ననబడిరీ.

మధుర కవియను వారు ఉత్తర
దేశ యాత్రకు బయలు దేరియు
దివ్య క్షేత్రము లెన్నొ జూచియు
తిరుగు ముఖుడయ్యెన్.

నాడ యోధ్యను జేరి యచ్చట
విశ్రమించగ, రాత్రమందున
దక్షిణపుదిశ పెద్ద మంటవె
లుంగు కాన్పించెన్.

ఇండ్లు కాలుటొ? ఊరు కాలుటొ,
సరకు సేయక నుండి రచ్చట
నంచు నచ్చటి జనుల నడుగను
చూడ లేమనిరీ.

తోచె నతనికి వింతగానది,
తోచె వారికి భ్రాంతు నిగనున్,
లేచె వేరొక గ్రామ మేగను
వేచె రాత్రమునన్.

పూర్వ విధమున వెలుగు గనబడె
రాత్ర మంతయు నటులనుండెను
వింతగానది దోచె నతనికి
నాడు ద్వాపరమున్.

కృష్ణు నవతారమున భక్తజ
నులకు నాల్గు భుజములు శంఖము
చక్రములుగను పడెడి వటనిత
రులకు నటు గాకన్.

రెండు చేతులు జూడ బడునట,
దక్షణాగ్నియు నటులె నయ్యెమ
మధురకవి కొకరికిని మాత్రమె
కాన బడుచుండెన్.

బ్రహ్మ సాక్షాత్కారమును వాం
చించు నతడా యోగ మార్గము
పయనమును సాగించు చుండును
మధుర కవి యటులే.

దారి పొడవున విష్ణు క్షేత్రము
లన్ని దర్శించుచును శ్రీరం
గంబు జేరియు స్వామి జూచెను
ఏమి చిత్రంబో.

తేజమును జూచినది మొదలుగ
దక్షిణాగ్నిన నిలిచె చిత్తము
నిలువ దాదేవతా మూర్తుల
పైన చిత్తమ్మున్ (ఒజున్)

నామ మాత్రపు దర్శనంబును
జేయుచుమ దిరుగాడ జొచ్చెను,
రంగ నగరము నందు రాత్రము
జ్యోతి గననయ్యెన్.

అతడు శ్రీ రంగంబు నుండియు
జేరె కురికాపురము, నచ్చట
రాత్రి జ్యోతిని కాన డాయెను
మధుర కవియచటన్.

ఇచటిదే యా కాంతి పుంజం
బనుచు నాకురి కావురంబున
తిష్ఠ వేసియు పృచ్ఛ చేయను
ఎరుగ లేమనిరీ.

వింతలౌ విషయంబు లేవన
కౌరి మాదుల గూర్చి దెలుపగ
చింత చెట్టుసమీపముంజని
మధుర కవి జూచన్.

జ్ఞానముద్రను బట్టి పద్మా
సీనుడునునై భగవత్పదంబుల
యందు జ్ఞానము నిల్పు శఠగో
పులను దర్శించెన్.

అతడు బట్టిన జ్ఞానముద్రయె
హృదయ కుడ్యము నందు భక్తి
చిత్ర లేఖనమునకు బట్టిన
కుంచెయిది యనగా!

ఘోరమౌసంసారమనియెడి
కాల సర్ప విషంబు లాగను
వెజ్జు బట్టిన హస్త ముద్రా
యనిన విధముండెన్.

ఇంత వరకును గాంచి యుండెను
వింత యౌనొక నగ్ని జ్వాలన్.
ఇప్పుడది చల్లనియు వెన్నెల
రేఖ వలె దోచెన్.

దక్షిణాగ్ని యటంచు నెంచియు
దాను దిలకించితిని దీనిన
టంచు జేరెను చింత బొరియమ
భక్తి భావము తోన్.

అట్టి మూర్తిని వర్ణనము జే
యంగ నేరక చేష్టలుడిగివి
వర్ణుడై తాజూచు చుండగ
సందియము గల్గెన్.

కనులు విప్పడు, మాటలాడడు,
బధిర మూకాంధుండితండా?
అనుచు పెను గుండ్రాయి దెచ్చియు
భూమి బడవైచెన్.

విచ్చె శ్రీ శర గోపుజూపులు,
మధుర కవి వైపునకు మరలెను,
చూపులో జూపులును కలువగ
శిష్యునిగ మారెన్.

మధుర కవి మది యందు వేరొక
సందియము బాధించె వింతగ!
దివ్య దక్షిణ జ్యోతి నన్నున్
శిష్యునిగ గొనునా?

వీరు మౌన వ్రతులు నైరీ
మౌనవ్రత వ్యాఖ్యాన మూతగ
శిష్యునిగ సందేహములు తొల
గించు నర్హతయున్.

నాకు గలదా? దివ్య మూర్తియు
మూగ గానిచొ నాదు భాగ్యమె!
భాగ్య మౌనని సందియము తొల
గుటకు నిట్లనియెన్.

ప్రకృతి గర్భంబునను బుట్టిన
జీవుడును తినుదేని, నాపై
దేని యందు వసించు నంచును
పృచ్ఛ సేయగనే.

దేన బుట్టునొ దానినేదిని
దాని యందే నుండు జీవుడు
నంచు శఠగోపులను నుడివిరి
ఉపనిషద్యర్థమ్.
"తజ్జలానీతి శాంత ఉపాసీత"

మధుర కవి హృదయంబు పొంగెను
సంతసంబున కంతె లేదే?
నాట నుండత డటనె శ్రీ శఠ
కోపులను గొల్చెన్.

అట్టి శఠగోపులను వీడక
కారి పదములె ప్రాప్యఫలనుని
తింత్రిణీపాదపము క్రిందనె
కాలమును గడుపున్.

అరయ పదునార్వర్షములకును
నోరు మూనుక కనులు దెరువక
బాహ్య జగమును గాంచ కుండియు
మధుర కవి వరులన్.

కనులు విప్పియు జూచె మొదటను
చంద్రుడును పదహారు కళలతో
పూర్ణ చంద్రుండై వెలుంగువి
ధంబు పరిపూర్ణుల్.

నయ్యు పదునారేండ్లు గడిపిరి
ధ్యాన్నమునదర్శించి నెరిగిరి
ఒక్క భగవత్తత్వ మంతయు
తెలిసి గ్రహియించెన్.
(ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం)

ఒక్క దానినెరింగి నంతనె
అంతయుం దెలియున్న టనెయెడి
వేద వేదాంతార్థ వాక్యా
ర్థములు సార్థకముల్.

చూడగా శరగోపులందున
నూరు పాళ్ళది నిక్కమయ్యెను
వర్షశతములు బ్రతికి గురుశు
శ్రూష జేసియునూ.

పర్యటించుచు శ్రవణ మననమ
నెడి ధ్యాసలు జేసి తపమున
ఋషులు సంపాందించు వాఙ్మయ
వేద విజ్ఞానమ్.

చతుర్వింశతి తత్వ జ్ఞానము,
ఆత్మ పరామాత్మలను నెరిగెడు
జ్ఞానమునుపరతత్వజ్ఞానము
లోక జ్ఞానములున్.

రెప్ప పాటున కరతలామల
కములు నవగను ఎల్లరున్న
ర్వజ్ఞులన శర గోపులేనిం
కొకరు గాదనిరీ.

వారి దివ్యప్రబంధములలో
వారి సర్వజ్ఞత్వమున్నం
పూర్ణముగ గోచరము నౌనతి
భక్తి పఠియింపన్.

ఇంత వరకా జ్ఞాన మంతయు
హృదయ మందున భావ రూపున
నుండ శఠగోపులకు నయ్యెను
స్వామి దర్శనమున్.

శ్యామ లాంగుడు చతుర్భుజుఁడును
శంఖ చక్రాద్యాయుధములతో
శ్రీలు భూనీళాది దేవే
రులను గూడియునున్.

గరుడ వాహనుడయ్యు, భాస్కర
కోటి సముడుగ వెలుగు చుండగ
ల్యాణ గుణములు దివ్య ముఖమం
డలము శోభిల్లన్.

జగత్పతి వైకుంఠ నాథుడు
నచట ప్రత్యక్షంబు నయ్యెను
అపుడు బ్రహ్మానంద రసమున
మునిగియునుదేలెన్.

చంద్ర కిరణ స్పర్శచేతను
చంద్ర కాంతామణి ద్రవించును
అటులె హరి సాక్షాత్కరించగ
జాలు వారెనటన్.

" పూర్ణ నుదః పూర్ణ నుదః పూర్ణమిదం "

అదియు వంపూర్ణంబునైనది
ఇదియు గన సంపూర్ణమైనది
ఉపనిషత్సారార్థమియ్యది
భక్తులను బ్రోవన్.

విష్ణు పరనుప దమున వెలిగెడు
నట్టి పరవామండు గన, పరి
పూర్ణ తత్వమొ అటులె భక్తా
నుగ్ర హార్థంబున్.

లోకముల వెలుగొందు హరి, అ
ర్చావతారము నంత పరి పూ
ర్ణత్వమేయని తత్వమును ప్రక
టించ గాదలచీ.

లోక నుందార్చావ తారము
దివ్యస్థలమున వెలుగు చుండిన
విష్ణు మూర్తులు నందరు న్వత
గోప మౌనులకున్.

క్రమముగా పాక్షాత్కరించగ
ద్రవిడ భాషా దివ్య వాణిన,
విష్ణు మూర్తులు నిష్ట తోడుత
నొదిగి తాముండెన్.

రమ్య ములునగు వృత్తములతో
తాళలయ బంధములతో, మధు
రాతి మధురము లైన పదజా
లములు వృత్తములున్.

కఠిన పాషాణముల కరుగం
జేయుభక్తి భానములతో
కవుల, పండిత హృదయములనా
వర్జనము జేసీ.

అట్టి కవితా లక్షణములతో
ఉపనిషత్రుతి పాదితా,త
త్వార్థ వేదాం తార్థములతో
సౌలభ్య వర్ణనలన్.

కలిగి భగవద్విరహ సంయో
గముల వలనను గలగు ఖేదా
మోదరస భావములతో నుప
దేశములతోడన్.

నిశ్వమునకును శ్రేయమొనరిం
చెడిదె కావ్యనుటంచనంబడు,
నట్టి ప్రతి పాదనలు గలిగియు
జాలు వారినవౌ.

దివ్యులౌ శఠగోపమౌని ప్ర
బంధములు సాక్షాత్కరించిన
హరియు నర్చామూర్తులందర
భక్తి గొనియాడెన్.

ఇప్పటికి ద్రావిడపు భాషా
కర్త వ్యాకర్తయును నైనా
ఆ అగస్త్యుడు పూర్ణముగకృత
కృత్యుడున్నయ్యేన్.

అతని తపము ఫలించె పూర్తిగ,
అక్షరపు రూపమును దాల్చెను,
హరియు నిచ్చిన వరము విధమున
వేదమే యయ్యెన్.

ఒక్క పదనుండైన తమకును
స్థానమును లభియింపనలెనని
కోరిసూరి గణంబు లెల్లరు
దర్శనంబిడిరీ.

సురలు కింపురు షాది కిన్నెర
లెల్లనటకరు దెంచి భగవ
ద్గుణములను గానమును వినియును
మహానందముతో.

ఈశతారుల వైష్ణవము సం
వృద్ధి సర్వప్రపంచ వ్యాప్తం
బౌను గాకని మంగళాశా
నము నుంజేయన్.

బ్రహ్మ నాల్గుముఖముల నుండీ
నాల్గు వేదము లెట్లు వెడలెనొ
నటులె శ్రీ శఠ గోపు ముఖమున
దివ్య ఝరివోలెన్.

నాల్గు దివ్య ప్రబంధముల్నవి
వేదముల సారములు నయ్యవి
అందు తిరువిత్తంబు ఋగ్వే
దంపు సారంబున్.

మరియు తిరువాశిరియ మనునది
ఆయజుర్వేదంపు సారము,
అరయ తిరువందాది యనునది
అథర్వణ సారమ్.

ఈ ప్రబంధము లందు మండిన
పాశురంబులు ఎనుబ దేడులు
సామవేదపు సారమౌతిరు
వాయి మొళి యందున్.

పాశురాల్పంరెండు వందలు
నిదియు సర్వ ప్రబంధములలో
అతిగ మూర్ధన్యంబు నైనది
మధురభరితంబున్.

ఆముముక్షువులకును వలసిన
అర్థజాలము లిందె గలవున్,
ఇందు పరస్వరూపమాత్మస్వ
రూపముల్ మరియున్.

రూప విరోధి ఫలస్వరూప
ములును నివిమూడ్విధము లంచును
దెలుప బడినవి ఎంతొ లెస్సగ
మోక్ష మార్గంబున్.

మరియు నారాయణుని చరణా
శరణభక్తి ప్రపత్తి నిందే
గలదు. వేదా శాస్త్ర సారత
మంబు నైనదియున్.

శుభకరంబును నైద్వయపునుం
త్రార్థమును శఠగోపులీ తిరు
వాయ్మొళి యందునను దెల్పిరి
లోక రక్షణకై.

ఈ ప్రబంధము వ్రాయు నప్పుడు
నూట యెనిమిది దివ్య తిరుపదు
లందలీ యర్చావతారులు
నెదుట గనుపట్టన్.

వారలందరు వరుసగాకీ
ర్తింప బడిరా గ్రంథనుందున,
నీవిధి న్నమ్మాళు వార్లను
ముప్ప దైదేడున్.

ధరను ధ్రువ తారగను వెల్గియు
స్వామి సన్నిధి జేరి మురిసిరి
అంత నాళ్వార్ తిరునగర్యని
అదియు పేరొందెన్.

నుధుర కవి మొదలైన భక్తుల
కీ ప్రబంధంబులను జెప్పిరి
ఈ విధి న్నఠ గోపులున్నహి
ర్ముఖులు నైవెల్గెన్.

తొలుత నిష్ఫల సంతటంచును
దుఃఖ మొందిన కారి దంపతు
లంది రమితా నంద నుప్పుడు
ధన్యతములంచున్.

ఏలనన తిరువాయ్ మొళి పా
శురము లందలి ఫలశ్ళ్రుతినన్
నూరనున్నర గోపనని కురు
గూరు శఠగోపన్.

అంచు తనపేర్తెలుపు కొనుటలొ
కారి ప్రభువుల పిలుపు మారన్,
అనెడు పేరును ఊరునున్నర
గోపులున్విడకన్.

ఆదినాథ స్వామి బెట్టెను
అతనికిన్నర గోపులంచును
కొన రచనలో చివరలను తన
ఊరు పేరుంచెన్.

దేవకీవసు దేవులకునున్
యశోదానందులకు పట్టిన
మహాయోగమె పట్టెనంచును
కారి దంపతులున్.

ఎంతొ మురిసిరి, భీష్మవిదురా
దులకు వోలెను జన్మధన్యత
గాంచెనీ శఠగోప సంద
ర్శనము నను నేడున్.

అనుచు నాప్రాంతీయులున్నర
జనులు భక్తిని పొంగి పోయిరి
భక్తి యోగమె మహాయోగము
దాని సరిలేదే.

అపుడు సంతర్ముఖులు గానుం
జేసి నదియేకాంత సాధన,
అనుభవంబును, బహిర్ముఖులై
జేసి నట్టియునౌ.

అనుభవంబుప దేశములువిని
మధుర కవితో మొదలిడంబడె,
రెండు దశలలో నింత కన్నను
భేదమున్లేదే.

అరయ రెండవ దశలో బహిరం
గంబు గా దెల్పినవి శరగో
సాంత రంగిక అనుభవములును
అవియె పరభక్తి.

మొదటిదౌ పరభక్తి పరునీ
దర్శనంబును, పరజ్ఞానము
పరుని గల్గియు నుండుటయునున్
పరమ భక్తియునూ.

నురల ఎడబాటౌనొయేమో
యనెడి భయమును పరనుభక్తి,
ఇట్టి కృష్ణ తృష్ణమూర్తి
భవము యనునటులన్.

ఆశరారుల కాలనుప్పుడు
గడుచు చుండెను, ఒకటి నిజమా
దైవ చింతను వలెనె తింత్రిణి
బిలము నున్నదలీ.

క్షణము నుండక నీరు ఆహా
రములు భగవద్గుణములనుగా
నిత్య నిర్మల మూర్తి గానన్.
స్నానము స్లేవున్.

అపుడు కురికాపురము మురిసెను,
రచనలన్కురు గూరు శడగో
పన్నటంచును పేర్కొనంగను,
ధన్యత న్నంచున్.

నిన్న వాదిప్ప రాననియును,
పాడినపుడా ఆదినాథుడు
వినియు నెంతో సంత సించెను
శిష్యులకు వానిన్.

బోధ సేయగ నాప్రబంధా
క్షరములు న్వాయువున గలిసీ
ఆకసము పయనించి తనదౌ
అలలో లీనమవన్.

తాను విరజానైతి నంచును
తాన్రు పర్ణియు పొంగి పోయెను,
ద్వాపరంబున కృష్ణుడున్నా
చరమ శ్లోకంబున్.

బోధ జేసెను, అట్టి ధర్మం
బాచరింత్రు ప్రపన్ను లెప్పుడు
వీడు మిన్ ముత్తవుమ్ అనితిరు
వాయి మొళివలనన్.

కనుక శఠ గోపులు ప్రపన్నుల
జనుల కూటస్థులు నటించును,
ననగ నను సంధాన మాత్రము
పరను వద మొసగీ.

శక్తిగల దివ్య ప్రబంధము
లొసగియును వాచామ గోచర
వైభవముతో నీవిభూతిన్
ముప్పదైదేడుల్.

ఇలను వేంచేసియు భగవ
దాజ్ఞచేవైకుంఠమేగిరి
అట్టి వైకుంఠంబెనిత్యవి
భూతి యనబరగెన్.

మధుర కవికి ప్రపంచ మంతయు
శూన్య మైపొడగట్టె నంతట,
గురువు విరహము దుస్సహంబవ
నతడు నిటుదలచెన్.

నాకు శఠగోపులను మించిన
దైవమును వేరరయ లేదే!
నాపురాతన అఘములను పరి
హారమును జేసీ.

నన్ను పరిపూర్ణులుగజేసిన
దాశరారుల పూర్ణ కృపయే!
నాత్మ నాయనయందు జేర్చియు
నిర్భరుడ నైతిన్.

నాకు గతినింకేమటంచుసు
కొంత తడవును చింత జేసియు
చింత మూలము సందె శ్రీశఠ
గోప మౌనులదౌ.

శ్రేష్ఠ మర్చా విగ్రహంబును
శాస్త్ర విధము ప్రతిష్ఠ జేసియు
నిత్య పూజాధికము లచ్చట
జరుగు సటుజేసేన్.

లక్ష్మణుడు రామునకు నిష్ఠుడు,
అతడు భగవన్నిష్ఠుడయ్యెను
అటులె శత్రుఘ్నుండు భరతుని
సేవ జేయుటచే.

భాగవత నిష్ఠుండనంబడె,
మధుర కవి నమ్మాళువారల
వైభవము వెలుగొంద జేయగ
కణ్ణినున్ శిరుత్తాం.

బంచు ద్రావిడ భాషలో పది
పాశురంబులు వ్రాసె నిష్ఠతో
నందు తన ఆచార్య నిష్ఠయు
పంచ మోపాయమ్.

అరయ నాచార్యాభిమానము
మరియు చరమో పాయమని యెడి
విధము పెర్కొనబడియెనిందున
జనులు తరియింపన్.

మిన్న సులభోపాయమియ్యది
ఈ యుపాయమునకును నాద్యుడు
మధుర కవియనియనిరి పూర్వా
చార్య పుంగవులున్.

మధురకవి శఠగోపమౌనుల
దివ్య వైభవములసు వెలుగగ
పద్ధతిని నేర్పరచె నొక్కటి
అంర్చనాకాలం.

బంధు బిరుదుల పఠన జేయుట
భేరి కాహళి కలసు నూదుట (కాహళములసు)
మంత్ర పుష్పాదుల పఠించుట
జరుగు దినదినమున్.

కారి మారులకును జయంబౌ
జయము కురుకా నగర విభునకు
జయ సహస్రా గాధ కీర్తకు
జయ పరాంకుశుకున్.

జయము కవికంఠీరవునకును,
జయము ద్రవిడామ్నాయ దేవుకు,
జయము శ్రీ శఠ గోపమౌనికి,
జయము దిగ్విజయం

అనెడి జయఘోషలతో కాహళ,
భేరి నాదములుప్ప తిల్లగ,
నట్టి ధ్వనులాలించి వచ్చిరి
కంబకవి శిష్యుల్.

వచ్చి వాటిని లాగు కొనగను
మధుర కవి కారణము నడుగను
మహాతేజో విరాజితుడే
కంబకవి రాజుల్.

మధురలో నున్నారు, వారికి
మహా కవులౌ శిష్య రత్నాల్
మూడు వందల మంది, వారుకి
రీట ధారులునై.

కంబకవి పాదములు వారల
మకుట వజ్ర విరాజితములై
పూజ లందును, ద్రవిడ కవికం
ఠీరవుండతడున్.

మీదు గురవుల బిరుదులన్నియు
మాదు గురవుల కేసు చెల్లును,
కంబ కవివరు కవిత యందున
నోడ గాజేసీ.

విజయముంగొని శంఖపీఠము
నెక్కగానతడర్హుడగునే,
అంచు బింకము నొలక బోయుచు
శిష్యులుస్సలుకన్.

మధుర కవి నిశ్శంకముగతా
నొప్పి మాశర గోప మౌనులు
నెచటికిని తామరుగు దెంచరు
దివ్య మౌకవితన్.

నొక్క దానిని వ్రాసి యిచ్చెద
పత్ర మందున, దాని మీ
గురువరేణ్యుల కిందు, దానిని
శంఖపీఠమునన్.

నిడగ జేయుడు నపుడు పీఠము
పత్రికను శిరసా వహించిన
గురువరేణ్యుల కపుడు చెల్లును
బిరుద జాలములున్.

మధుర కవి శఠగోప సూక్తిని
వ్రాసి పత్రిక నిచ్చి పంపమ,
వారు మధురకు జనియు జరిగిన
దంతయుం దెల్పన్.

కంబకవి శఠగోప సూక్తిని
శంఖ పీఠము పైని నుంచగ,
సూక్తి నిన్శిరసా వహించి
నెట్టె వారలనున్.

కంబకవి భయ భీతుడై సం
భ్రమము లాశ్చర్యంబు లొదవను,
ఆశరారుల సూక్తి పత్రము
శిరమునందాల్చి.

చేరె కురికాపురము వెంటనె
నిగ్రహము వదలియును శఠగో
పులకు సాష్టాంగంబు గాపడి
భక్తి భావముతోన్.

ద్రావిడా మ్నాయాది దేవా!
అన్ని బిరుదులు నీవె కానీ!
అర్హులుంగారితరులుంగన
సర్వ అపరాధిన్.

మమక్షమస్వని వేడి పాడీ
మధురకుంజనె కంబకవియున్,
అంత ధీమంతుండు గురువును
వెలుగగా జేయన్.

వలె నటంచును మధుర కవివరు
లెంచి కురికాపురము నందుని
వాసముండియు, గురు ప్రోక్తం
బైన వైష్ణవమున్.

ఎల్లరును దర్శించు నట్లుగ,
వృద్ధిజేసెను లోక మందున,
మధుర కవియే లేనిచోశఠ
గోప భాస్కరులా.

దివ్య వాక్కిరణములు ప్రసరణ
లేక లోకము నంధకారా
బంధురంబై అగోచరమై
యుండి యుండెడివీ.

ఇహము సంబంధంబు లేనీ
యట్టి శ్రీ శఠగోపు లాలో
కములు ధరపై వ్యాప్తి జెందక
మేఘముల చాటున్. (మాటున్)

దాగి యుండిన భాస్కరుని వలె
తెలియ కుండను నణగి యుండును,
మధురకవి వాయు ప్రభంజన
మునను వెలుగొందెన్.

పదుగు రాళ్వారులును తత్వము
చదివి నారాయణ పరాయణు
లైప్రసాధించినవి ద్రావిడ
ప్రబంధంబులునున్.

అనుదినంబ ధ్యయనమును నతి
భక్తి జేసెడి మానవులకును,
కరతాలామలకమును జేయుచు
ముక్తి ధామములౌ.

ఆది నారాయణుని పరివా
రాంశములతో నవతరించిన
ఆళ్వరాదుల చేత లోపా
ముద్రపతి తపమున్.

ఫలితమై వేదములునైది
వ్యాతి దివ్య ప్రబంధములునై,
దివ్య దేశము లందవశ్యము
పాఠనీయములై.

ద్విగుణమౌ దివ్యత్వతత్వము
కలియుగంబున నాళ్వరాదుల
ద్రవిడ భాషప్రబంధ పఠనన్
న్నాలయములందున్.

కృతయుగంబున ఆది నారా
యణుడె పరతత్వంబటంచును
ధ్యాన యోగముతో నుపాసిం
చియును నితరులకున్.

మార్గమును ప్రహ్లాదనారద
ఆవశిష్ఠాదులును జూపిరి
వీరి దొక వర్గంబటంచును
నెన్నగా బడిరీ.

మరియు త్రేతా యుగమునందున
యజ్ఞములు ప్రాధాన్యతన్గొన
యజ్ఞపతి యజ్ఞ స్వరూపుడు
యజ్ఞరక్షకుడున్.

అనుచు నారాయణుని త్రేతా
గ్నులను సంభావించి, యజ్ఞము
యాజ నంబుల జేసి యుండిన
వారు ఋషి వర్యుల్.

వీర లరయగ కాశ్యపాత్రీ
భరద్వాజాదులును, నెన్నగ
వీరి దొక వర్గంబటంచును
వ్యవహరింపబడెన్.

అంబరీషుడు మరియు రుక్మాం
గదుల ప్రభువులు, విష్ణు భక్తులు,
వ్రత గరిష్టత ద్వార శ్రీ హరి
కరుణనుంగొనిరీ.

ద్వాపరంబున నొదవె సందియ
మరయ దూర్వాసుండు పంటీ
ఋషులు కొందరు శివుడునున్ పర
తత్వమనియనిరీ.

అందు చేతనె కలియుగంబును
ద్వాపరంబని పిలువ బడియెను
ఆయుగాంతయు నందు పరత
త్వంబు నాహరియేన్.

అంచు గట్టిగ లోకములకును
చెప్పవలసిన యవసరంబవ,
దాని ఫలితమె శ్రీపరాశర
వ్యాస శ్రీశుకులా!

భారతము భాగవతములు శ్రీ
విష్ణు పురాణ రచన ప్రవచనలు,
మోక్షమునకై నాపరీక్షిత్
వినెను భాగవతమ్.

ఈ విధంబున తత్వయాధా
ర్థ్యములు వారల ద్వార వెలసెను
కలియుగము బౌద్ధాదిమతముల
గూడి సంకరమై.

క్లిష్టమైదుర్భరము నైపా
పముల పంకిల మైయ్యు నుండను
నపుడు నీ ఆళ్వార్లఅవతా
రములు ధరవెలసెన్.

ద్వాపరాంతపు కలియుగంబుల
సంధి కాలము జనన కాలము,
ఆళ్వారాదుల జనన కాలము,
నందరటుగాదే.

వీరు పరతత్వమును స్థాపన
మనెడు పరమప్రయోజనముకై
హరియు వీరల నవతరింపగ
జేసె ధరయందున్.

అందు చేతనె వారి అవతా
రములు అనుభవ చేష్టితములున్
మరియు ప్రతి పాదనలు దివ్య ప్ర
బంధములు నటులే.

పాశురంబుల సంఖ్య నొకపథ
కంబుగా వ్రాయడము జరిగెను,
నిదియె నొక వర్గంబునైనది
వీరెయాళ్వారుల్.

యుగయుగముచరితమును సింహా
లోకనము జేసియుమ జూచిన
పరమ భాగవ తోత్తములునా
ఋషులె ఆళ్వారుల్.

లోకమున కుపకారులయిజగ
త్పూజ్యులై పూజలను నందిరి,
అట్టి ఆళ్వారాదులలోగన
నమ్మ ఆళ్వారుల్.

ముఖ్యులనియును మిగత వారలు
వారి కవయవ బూతు లనియును
ధరను నిర్దేశించి నారలు
పూర్వ ఆచార్యుల్.

దివ్యమౌ శ్రీరంగ మాదిగ
పుణ్యా క్షేత్రము లన్ని టందున
పాంచరాత్రాగమ ప్రకారము
సుప్రతిష్ఠులునై.

ఆది నాథుల కాత్మ భూతులు
నైవెలుంగుచు నస్మ దాదుల
పూజలందుచు కృపను నించుచు
జనుల నిరతంబున్.

వీరి బోధనలనుసరించుచు
వీరి బాటలో నడచు చుండిన
బ్రోచుచుందురు ధరలో నరులను
ముక్తి సులభంబౌన్.

మంగళము కురి కాపురీశా
నుంగళం వకుళాభిరామా
నుంగళం శఠగోప స్వామిన్
మంగళము మీకున్.

కంబకవి గర్వాపహారా!
శ్రీ పరాకుంశ భక్త వర్యా!
శ్రీ శఠారీకృపా పాత్రా
నుదురకవి మంగళమ్.

## నమ్మాళ్వారుల తిరుక్షత్రతనియన్

శ్లో॥ వృషభేతు విశాఖాయాం। కురికాపురి కారిజం
పాండ్యదేశీ కలే రాడౌ। శఠారిం సైన్యపంభజా॥

శ్లో॥ మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మద న్వయానాం
ఆదస్యనః కులపతేర్వకుళాభిరామం
శ్రీ మత్తదంఘ్రియుగళం ప్రనమామి మూర్ధ్నా॥

## మధురకవి ఆళ్వారులతిరునక్షత్ర తనియున్

గ్లో॥ మేషే చిత్రాసముద్భూతం। పాండ్య దేశీ గుణాంశకం।
శ్రీ పరాంకుశ సద్భం। మధురం కవి మాశ్రయే।

శ్లో॥ హస్థ తాళద్వితయం ప్రపద్యేశఠా వాగ్వ్యాసముదార కీర్తి।
మాధుర్య సంశ్లిష్ట కవిత్వ యుక్తం। మహత్వ సంభావిత బుద్ధి తత్వం॥

-ఓం తత్సత్-

వకుళ భూషణు చరిత చదివిన
శ్రీ శఠారుల మహిమ వినినమ
శఠుని బాధల బాసి వారలు
హరిని జేరెదరే!

మధుర మౌశ్రీమధరకవియా
ళ్వార్ల చరితము పదము పదమున
మధురమైమధువొల్క జేయుచు
ముక్తి ధామంబౌన్.

# గద్యము (ము.స.)

ఇదియె శ్రీ నేరళ్ళ వంశో
ద్భవులు కౌండీన్య గోత్రజులౌ
రంగమాంబా సంత వరదుల
గర్భ సంజాతుల్. (చార్య సత్పుత్రా)లౌ

శ్రీమదాత్తాన్ వేంకటావర
దార్యు, శ్రీచిన జీయరదుళక
టాక్ష లబ్ధ ప్రాప్తులును శ్రీ
రంగ దాసులచే.

వ్రాయబడె నీ ఆళ్వార్ల చరితము
సూరి చరితము పూర్తియయ్యెను
లోక హితమును గోరి వ్రాసియు
(పూర్తి చేయబడెన్)లకొనగబడెన్.

సర్వమును శ్రీశ్రీనివాసుల
కునుమ సదృషపదయుగంబుల
కర్పణం బొనరించు చుంటిని
కావ్య కన్నియనున్.